వేంకటరామయ్య, కళా

హిందూధర్మపునరుజ్జీవనము

రాజమహేంద్రవరము, 1922

Record no. 145

Vēṅkaṭarāmayya, Kaḷā

Hindūdharmapunarujjīvanamu

Rājamahēndravaramu, 1922

Record no. 145

## Bibliographic Record Target

వేంకటరామయ్య, కళా

హిందూధర్మపునరుజ్జీవనము, ప్రథమసంపుటము. దీర్ఘాయువు / కళా వేంకటరామయ్య. - రాజమహేంద్రవరము : శ్రీవిద్యానిలయముద్రాక్షరశాల, 1922.

iii-iv, xi, (1), 184 p. ;20 cm.

Record no. 145

Vēṅkaṭarāmayya, Kaḷā

Hindūdharmapunarujjīvanamu, Prathamasampuṭamu. Dīrghāyuvu / Kaḷā Vēṅkaṭarāmayya. - Rājamahēndravaramu : Śrīvidyānilayamudrākṣaraśāla, 1922.

iii-iv, xi, (1), 184 p. ;20 cm.

Record no. 145

శ్రీ

శుభమస్తు.

హిందూధర్మపునరుజ్జీవనము.

ప్రథమసంపుటము. 

# దీర్ఘాయువు

కళా వేంకటరామయ్య బి. ఏ. బి. యల్ గారిచే

వ్రాయఁబడినది.

---

రాజమహేంద్రవరము.



---

రిజిష్టరు కాపీరైట్ ] 1922. [ వెల రు 1—0—0.

# ఉపోద్ఘాతము.

హిందూధర్మపునరుజ్జీవనము, దీర్ఘాయువునను నామములవలననే, ఈగ్రంథమెట్టిదియో, ఇందుం గల విషయము లెట్లుండునో, దీనివలనఁ గలుగు ఫల మెట్టిదియో, తెలుపకయే తెలియుచున్నది. ఇది నాశ్యాలకుఁడు కళా వేంకటరామయ్య వ్రాసిన దగుటంబట్టి నే నప్పుడప్పుడు దీనిం బరిశీలించి నాకుఁ దోఁచిన విషయములు కొన్నికొన్ని చెప్పుచు వచ్చితిని. ఇందుఁ గొన్నికొన్ని విషయములు సామాన్యములై యున్నను, అన్నివిషయములును సర్వజనోపయోగకరములై యున్నవని చెప్పు టతిశయోక్తి కాఁ జాలదు.

ఇప్పుడు రెం డింగ్లీషు ముక్కలు చదివనవాండ్రెల్ల నిందు సూచింపఁబడిన దురభ్యాసములకు లోనై స్నాన సంధ్యాద్యనుష్ఠానముల నుజ్జగించి, గుజ్జెనగూళ్లం గుడుచుచు, పూర్వసువాసినీత్వద్యోతకంబుగ ముండనంబును, వాజిముఖనృత్యత్కేసరకలాపంబుం దలఁపించు నలికవాలకంబును, శాబకవేషముం గోచరింపఁజేయు నీచాంబరధారణాదికంబును, నికృష్ట వ్యాహార విహారంబులునుం గలిగి మొన్న మొన్నటివఱకును దాము హిందువులై యుండియు, హిందువులన్నను హిందూధర్మము లన్నను ధర్మప్రాయులై నిజకర్మపరిపాకంబునం జేసి నిందించు నికృష్టుల లెందఱునో భరించు మన భరతమాత దౌర్భాగ్యంబున కెంతయుఁ జింతింప వలసియున్నది. మా వేంకటరామయ్య తా నాంగ్లేయవిద్యమాత్రమే ప్రధానముగాఁ జదివినవాఁడయ్యు నట్టిగుణంబులం దగుల్కొనక ప్రతిదినమును స్నానము, సంధ్యావందనము, జపము, దేవతారాధనము లోనగు పూర్వాచారంబులం బరాయణుండై యుండుటంబట్టియే వానికిట్టి గ్రంథము వ్రాయుటయందును, ప్రకటించుటయందును బుద్ధి పుట్టినదని చెప్పవచ్చును.

ఈ దీర్ఘాయుర్గ్రంథము భాగసప్తకంబునఁ బరిఢవిల్లుచు 184 పుటలు గలదియై యున్నది. ఇందు మొదటిభాగమున :—గ్రంథోపయోగ వివరణంబును హిందూజన నిత్యకృత్యనిర్వచనంబును, ద్వితీయభాగంబున :- నాహారనియమాదికంబును, తృతీయభాగమున :-లోహ

కలశాది పాత్రోపయోగానుపయోగంబులును, చతుర్థభాగమున:— వాసస్థలవిభాగంబును, పంచమభాగమున:— స్త్రీపురుషాలంకారప్రకారంబులును, షష్ఠభాగంబున:— పురాణపఠనాదిసత్కాలక్షేపసంవిధానాదికమును, దేవదర్శనారాధనాది ఫలంబులును, వేదవైదిక ప్రభావంబును, తీర్థయాత్రాఫలంబులును, సప్తమభాగమున:— నాయుర్వైద్య విషయంబులును, శయ్యాగృహవిధానంబును, వివాహధర్మములును, సంభోగనియమంబులును, గర్భిణీస్త్రీల నియమంబులును, సంతాన సౌభాగ్యంబులును జేర్కొనఁబడియున్నవి.

ఈగ్రంథమం దాయాసందర్భములఁ గొన్ని ప్రమాణశ్లోకము లుదాహరింప నొప్పునని నే ననుకొంటినిగాని యవి సర్వజనసుబోధకములు కావనియు, గ్రంథ మాఖ్యాయికారూపమున నున్నఁ జదువరుల కానంద మాపాదించు ననియు, అట్టిప్రమాణశ్లోకములు సర్వజనైకవేద్యములే యనియు, తలంచి గ్రంథకర్త ముఖ్యములైన కొన్నిప్రమాణములను మాత్రమే చూపినట్లు తెలియవచ్చుచున్నది. మఱియు మహాపవిత్రధర్మభూయిష్ఠమైన నిందుఁ గొన్ని సందర్భములఁ బాఠకుల కానందసంధాయికముగా హాస్యాద్భుతవిషయములు సందర్భోచితముగా వ్రాయఁబడియున్నయవి. కొన్నిస్థలముల సంఘముల విమర్శించునపుడు ఇంచుకించుకగా నుపాలంభనములును నుచితరీతిఁ జూపట్టెడిని.

ఇది పండిత పామర జనగ్రాహ్యముగా నుండవలసిన గ్రంథము గావున లోకోక్తి ననుసరించి వ్రాయఁబడినది. కాన వ్యాకరణదోషాదికము పాటింపఁబడి యుండలేదు. తొలుతం జేర్కొనిన కొందఱు నికృష్టుల కీగ్రంథము రుచింపకున్న రుచింపకుండును గాని ధర్మకర్మఫలగ్రహణాశక్తు లందఱు దీని నాదరించి మన్నింతురనియే నానమ్మకము.

ఇది ప్రతిహిందూ గృహమందును నుండఁదగిన మహోపకారగ్రంథమని మఱియుఁ జెప్పుచు నింతతో విరమించుచున్నాను.

రాజమహేంద్రవరము,
24—12—1922.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

## Author's Preface.

To bring out in an interesting narrative form, the interrelation of the principles of Long-life and the Sastraic 'Vidhis' enjoined by our ancient Rishis, is the chief aim of this work. In this first volume, I think, this object has been considerably realised. While attempting to accomplish this task, though I have relied mostly on Ayurvedic and Indian Astrological pandits, here and there in my arguments I had to express my individual opinions. Any improvements that may be suggested in this direction, will be gladly accepted for the second edition of this work.

Another aim of this work is to indicate how far there is an actual "REVIVAL" of our Dharma at the present day. For this purpose, I have examined, (though not exhaustively) the present Indian conditions and have surveyed the Modern Hindu Society.

In the compilation of this work, I owe my obligations to many Ayurvedic experts, Astrological theorists and renowned Pandits versed in Vedas and Dharma Sastras, who cleared my doubts whenever necessary. My thanks are no less due to the famous Author and Pandit M. R. Ry Vaddadi Subbarayudu Garu, the Retired Telugu Pandit of the local Government College, who has been my Guru during my High School career in the local Training College and who has patiently corrected my manuscripts

My keen interest in the Ancient Hindu Dharma has originated from my renowned maternal ancestry. I have retained my deep veneration for *it*, on account of my close attachment to my brother-in-law, M. R. Ry Kaviraz S. Krishnamurty Sastry garu, the well-known Scholar and the Author of "*Sree Krishna Bharatam.*" I offer my thanks to him for his having written the preface to this Volume.

*Rajahmundry*,
28th December.

K. V.

## పండితాభిప్రాయములు

1. సుప్రసిద్ధాంధ్రకవివరేణ్యులును, రాజమహేంద్రవర రాజకీయ కళాశాల యందాంధ్ర పండితులై ఖ్యాతిగాంచి, ఉచిత వేతనమును స్వీకరించు పండితోత్తము (Retired Telugu Pandit) లగు మహారాజశ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు ఇట్లు వ్రాయుచున్నారు :— **28—12—1922** రాజమహేంద్రవరము.

హిందూధర్మ పునరుజ్జీవనమను వచనగ్రంథము మదంతేవాసియగు కళా వేంకటరామయ్య యను తరుణవయస్కునిచేత వ్రాయఁబడినది. గ్రంథకర్త దాదాపుగఁ బుస్తకమంతయు నాకుఁ జదివి వినిపించినాఁడు. ఇతఁడు బి. ఎల్. పరీక్షయందుఁ గృతార్థతనొందినవాఁడయ్యు మాతృభాషయందుఁ జక్కగ వాక్యరచన చేయనేర్చియుండుటనుగూర్చియు, స్వమత ధర్మానురాగము గలిగి తోడిజనులకుఁ దనకుఁగల యనుభవము బోధింపఁ బ్రయత్నించుటనుగూర్చియు నేనుమిగుల నానందించుచున్నాను. భిషజ్మణులయు వేదవేదాంగవేత్తలయు సేవగావించి సంగ్రహించిన హిందూధర్మ మర్మము లీగ్రంథమున బొందుపఱుపఁబడినవి. కాఁబట్టి దీనిని జదువుటవలన బాలకులనేక నూతన విషయముల నెఱింగి స్వధర్మాచార పరాయణులు కాగలరని తలంచెదను.

వడ్డాది సుబ్బారాయుఁడు.

2. రాజమహేంద్రపురవాసులును, జ్యోతిశ్శాస్త్రవిశారదులును, గవర్నమెంటు కళాశాలలో బ్రధానసంస్కృత పండితులై, ఉచితవేతనము (Retired) స్వీకరించుచున్న శ్రీమత్ మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి సాదర దత్తాభిప్రాయము :—

హిందూధర్మ పునరుజ్జీవనమను కోశంబును నవకాశంబుతోఁ జూచితిని. అయ్యది మహాబుధులచే నుడువంబడిన శ్రుతిస్మృతి పురాణోక్తధర్మంబులు హిందువులు శిష్టాచారంబుగా నాచరించుచున్న యవి యాయురారోగ్యంబులకు నైశ్వర్యంబునకు సాధారంబులని సోపపత్తికముగా నీగ్రంథంబున విమర్శించి వ్రాయఁబడినది. యుక్తి లేని యాచారంబు ఛాందసంబని నిరసించు బుద్ధిమంతులుగల ఈ కాలంబునందు యుక్తిమాత్రికంబుల సరంబులతో నిండిన ఈ గ్రంథంబు హూణవిద్యావిశారదులకు హీనంబుగాని శిష్టాచార విశ్వాసంబును విశేషింపఁజేయునని నొక్కి వక్కాణింపఁదగియున్నది. నాస్తికులమతంబు నుత్పాటించి మత విశ్వాసంబును నాచారపరిపాటిని సహస్రముఖంబుల నుపన్యసించుచున్నయది. ప్రస్తుతకాలంబున నియ్యది సర్వవిధంబు



లను సర్వజనాదరణంబునకును బాత్రంబై పండితావలంబనంబునకు నర్హంబని ఈ గ్రంథావతంసంబు ఘంటాపథంబుగా ఘోషింపందగియున్నదని నా తాత్పర్యము.

రాజమండ్రి. **25—12—22.** కల్లూరి వేంకటరామశాస్త్రి.

3 రాజమహేంద్రవర రాజకీయసత్కళాశాలయందు సంస్కృత పండితులగు శ్రీమాన్ సం. వేంకటఅప్పలాచార్యులవారు యిట్లు వివరించుచున్నారు :—

శ్రీ కళా వేంకటరామయ్యగారు వ్రాసిన హిందూధర్మ పునరుజ్జీవనము గ్రంథము నచ్చటచ్చట చూచితిని. హైందవమతాచారములయందు విశ్వాసమును పుట్టించి వైదిక ధర్మములను మరల నుద్ధరించుట కీగ్రంథము ముఖ్యసాధనమని నానమ్మకము. శ్రీకృష్ణభారత గ్రంథరచనాప్రఖ్యాతి విభ్రాజితులును కవిరాజ బిరుదాంకితులునగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిల వారుపోద్ఘాతమును వ్రాయుటయు, సుప్రసిద్ధాంధ్ర పండితకవి వతంసులును బహుగ్రంథరచనా పరిష్కృతులునగు మహారాజశ్రీ వడ్డాది సుబ్బరాయ కవివరేణ్యులు పరిష్కరించుటయు నీగ్రంథ ప్రాశస్త్యమును సహస్రముఖముల విశదీకరించుచున్నవి గాన నధికముగా వ్రాయుట యనావశ్యకంబు. ఇరువదవ శతాబ్ది యందిట్టి గ్రంథములు లోకమునకు పరమోపకారములని నా యభిప్రాయము.

రాజమహేంద్రవరము, **26—12—1922.** సం. వేం. అప్పలాచార్యులు.

4. కాకినాడ జగన్నాథపుర వాస్తవ్యులును, విద్వత్కాగ్రగణ్యులును, "ఆర్యమతబోధినీ" పత్రికాధిపతులునగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారిట్లు తెలుపుచున్నారు :—

హిందూధర్మ పునరుజ్జీవనము అను గ్రంథరాజము నేను సావధానముగా జదివితిని. అయ్యది ఆస్తికులెల్లరు నవశ్యముగా పఠింపఁదగిన గ్రంథమై యున్నది నాస్తికులగువారు పఠించినయెడల గొంతవఱకైన మంచియాస్తికులగుదురని తలంచెదను. బాలురు దీనిని పఠించిన నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధినందు యోగ్యతను సంపాదింపగలరని నమ్మెదను. స్త్రీలు పఠించిన సర్వమాంగళ్య కలితలై గృహముల జక్కగ దిద్దుకొన సమర్థురాండ్రగుదురని ఎన్నెదను. వేయేల, ఐహికాముష్మిక సుఖము నందగోరువారు ముఖ్యముగా నిది జదువఁదగినది. ఇందున్న యూహలలో గొన్నిటితో నే నేకీభవింపఁజాలను. కాని మొత్తముమీద మంచి ఆలోచనముతో సరసముగా వ్రాయఁబడి లోకోపకారమొనర్చు గ్రంథములలో నిది యొక్కటియని యూహించెదను.

**18—12—1922.** కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

5. రాజమహేంద్రపురవాసులును, ఘనాంతస్వాధ్యాయవేత్తలును, వైదికాచార దీక్షాపరులునగు బ్రహ్మశ్రీ ఆకెళ్ళ నూరావధానులుగారిట్లను గ్రహించుచున్నారు:—

ఈ హిందూధర్మ పునరుజ్జీవనము గ్రంథకర్తగారు నాకు చదివి వినిపించిరి. ఈ గ్రంథపఠనమువలన జదువరులెల్లరు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి నొందుదురు. సనాతన హిందూధర్మము లవలేశమైనను వదలక మృదుశైలితో వేదశాస్త్రధర్మప్రశ్న, గౌతమప్రశ్న ప్రమాణంబులు ఇందున ఉదహరించి వ్రాసిన ఈ కళా వేంకటరామయ్యగారికి భగవంతుఁడు చిరకాలాయుర్దాయమునిచ్చి పుత్రపౌత్రాభివృద్ధిని నిచ్చుగాక యని నేను ప్రార్థించుచున్నాను. **22—12—1922.** ఆకెళ్ళ నూరావధాని.

6. వేదశాస్త్ర శ్రౌతాది మహావిద్యాపారంగతులును, ధర్మశాస్త్ర కోవిదులును "ముక్కామల" గ్రామ వాస్తవ్యులునగు బ్రహ్మశ్రీ భమిడిపాటి అచ్యుతరామ సోమయాజులుగారిట్లు వ్రాయుచున్నారు :—

ఈ హిందూధర్మ పునరుజ్జీవనము అను గ్రంథరాజమును నేను చూచితిని. దీనిలోని చాలా ధర్మములు శాస్త్రమందున్నవిన్నీ, మన పెద్దలచేతను ఆచరింపబడినవి. గాని ఇప్పటి పాశ్చాత్య ధర్మముచేత అంతరించినవి. గాన ఇప్పుడు తిరిగి అవి ఆచరణలో పెట్టుటకు ఈ గ్రంథమునేది స్త్రీలకు బాలురకున్ను సులభముగా చదువుకొని బోధపఱచుకొని ఉత్సాహపూర్వకముగా పూర్వధర్మములయందు ప్రవర్తించి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని సులభముగా పొందుటకు మంచి ఉపయోగమైనది. ఇప్పటి కాలమునుపట్టిన్నీ శరీరస్థితులనుపట్టిన్నీ కొన్ని సామాన్యధర్మములు చేర్చబడినను మంచిస్థితిలోకి వచ్చినతర్వాత మార్చుకోవచ్చును. ప్రస్తుత పరిస్థితినాలోచించి సన్మార్గములోనికి వచ్చుటకు ఆజ్ఞారూపముగా బోధించు శ్రుతిస్మృతులకంటె ఈగ్రంథమే స్వతః ప్రవృత్తిని కలుగఁజేయుటకు ముఖ్యసాధనము చదివినవారికి వెంటనే ఫలించును. నా అభిప్రాయము చేతను ఈ గ్రంథము ముఖ్యముగా చదువదగినది.

**23—12—22** భమిడిపాటి అచ్యుతరామసోమయాజి.

7. "ఆయుర్వేద విశారద" బిరుదాంకితులును, రాజమహేంద్రవర పురపాలక సంఘాయుర్వేద వైద్యశాలా ప్రవర్తకులునగు బ్రహ్మశ్రీ చావలి రామమూర్తిశాస్త్రుల వారిట్లభిప్రాయ మిచ్చుచున్నారు :—

సనాతన హిందూధర్మము లాయుర్వృద్ధికరములని ఈ గ్రంథకర్త చర్చించు సందర్భములలో నాయుర్వేద నియమములను గమనించిరి. ఈ సులభశైలి గ్రంథము స్వస్థులకును, ఔషధసేవచేయువారికిని, నారీమణులకును మిక్కిలి ఉపయోగకరము.

**24—12—1922.** చావలి రామమూర్తిశాస్త్రి.



8. సంస్కృతాంధ్ర పండితశేఖరులగు బ్రహ్మశ్రీ భమిడిపాటి కామేశ్వర శాస్త్రిగారిట్లు విశదీకరించుచున్నారు :—

హిందూధర్మ పునరుజ్జీవనము అను సులలితాంధ్ర గద్యాత్మక గ్రంథరాజమును సమగ్రముగాఁ జూడ భాగ్యము నాకు లభించినది. ప్రస్తుతకాలమున పాశ్చాత్య విలసితమునందు మగ్నులై ప్రాచీన సాంప్రదాయములను సంపూర్ణముగావిడనాడి యనారోగ్య భాగ్యసంకలితులగువారికి భావిసంతతివారికి నీగ్రంథము పారిజాతముభంగి సకలాభీష్టములనొందజేయగల్గునని నాదృఢ నిశ్చయము. ఇందలిశైలియె గ్రంథకర్తయొక్క భాషాపటిమను, లోకానుభవమును ప్రతిపాదించుటవలన నేనందునుగూర్చి విన్నవించుట చర్విత చర్వణము.

**23—12—1922.** భమిడిపాటి కామేశ్వరశాస్త్రి.
ఆర్యాపురం, రాజమండ్రి.

9. గౌతమీతీర వాస్తవ్యులును, అనేకాంధ్రగ్రంథ రచనాధురంధరులునగు బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితులుగారిట్లు తెల్పుదురు :—

ఈ గ్రంథమంతయు నేను జదివితిని. ధర్మశాస్త్రములయందును బురాణములయందును నిగూఢములైన హిందూజన ధర్మములన్నియుఁ బండితపామర హృద్యములుగా నిందు వ్రాయఁబడియున్నవి. కావున హిందువులందఱు నీగ్రంథరాజమునాదరింతురని నమ్ముచున్నాను.

**25—12—22.** మధిర సుబ్బన్న దీక్షితులు.

10. ఆయుర్వేద శిఖామణులని విశేషకాలమునుండి ప్రఖ్యాతిగాంచియున్న శ్రీచాగంటి పేరయ్యలింగముగారును, శ్రీరాతుల బాపనయ్యగారును, ఇట్లు వ్రాయుచున్నారు:—

హిందూధర్మ పునరుజ్జీవనము వచనగ్రంథమునందలి ఆయుర్వేదీయాంశములు యుక్తియుక్తముగా క్రోడీకరింపఁబడి సర్వజనోపయోగముగా నున్నవి. ఇక్కాలంబుననిట్టి గ్రంథరాజంబు వ్రాసిన శ్రీకళా వేంకటరామయ్యగారికి ఆంధ్రులెల్లరు మంచి ప్రోత్సాహము నొసంగెదరుగాక !

చాగంటి పేరయ్యలింగము,
రాతుల బాపనయ్య,
ఆయుర్వేద వైద్యులు.

రాజమండ్రి,
**26—12—22.**

విషయసూచిక

తప్పొప్పుల పట్టిక.

ఇచ్చట ప్రధానములైన తప్పులుమాత్రమే పేర్కొనబడినవి.

—గ్రంథకర్త.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 5 | 22 | ఇహమదు | ఇహమందు | 80 | 21 | టయుక్తము | యుక్తము |
| 7 | 16 | వర్త | వర్తనము | 82 | 25 | శోగములు | కళావిహీనత |
| 11 | 13 | హెచ్చనది | హెచ్చినది | 83 | 26 | సుసంతానము | సుసంతానము |
| 16 | 14 | ర్మల | నిర్మల | 84 | 7 | కల్లు, తేనె | కల్లు,క్షీరము, తేనె |
| 16 | 15 | సెయేళ్ళ | సెలయేళ్ళ | | | | |
| 22 | 17 | శొందురు | నొందుదురు | 89 | 1 | విషయము | విషము |
| 34 | 15 | దుటుర్ఘము | దుర్ఘటము | 93 | 1 | విధములలై | విధములవై |
| 43 | 5 | త్పత్తి | ఉత్పత్తి | 94 | 11 | విశ్వామిత్రా | కణ్వా |
| 44 | 23 | విధులందు | తిథులందు | 94 | 19 | మనశ్శాంతిని | మనశ్శాంతికిని |
| 53 | 21 | దీనం దేసి | దీనంజేసి | 96 | 8 | లులొనరింతు | లొనరింతు |
| 68 | 24 | నొందురు | నొందుదురు | 104 | 2 | బయలుడే | బయలుదేరి |
| 70 | 7 | సపదు | సప్తము | 106 | 3 | సమభావతో | సమభావముతో |
| 73 | 14 | తకీ | కీర్తనము | | | | |
| 75 | 5 | బవు | బడవు | 106 | 4 | భూవతి | భూవసతి |
| 73 | 21 | నానాదివ | నానావిధ | 110 | 8 | సువాసునులు | సువాసినులు |
| 74 | 3 | తల | వలన | 121 | 14 | భోజరాజనీ | భోజరాజీ |
| 76 | 6 | కలుగుననని | కలుగని | 134 | 3 | దరశాస్త్రుండు | దర్శనాస్త్రుడు |
| 76 | 15 | నిర్ణింత | నిర్ణిత | 140 | 22 | దగిన | దగని |
| 76 | 20 | ప్రథము | ప్రథమభోజనము | 145 | 4 | మందు | మందుండు |
| 77 | 21 | యందురు | యందురు | 162 | 19 | కంకుశము | చేతిఅంకుశము |
| 77 | 22 | దధియు | దధియు | 164 | 10 | రాష్ట్ర | సంయుక్త రాష్ట్ర |
| 77 | 25 | దార్ఢ | దార్ఢ్యవి | | | | |
| 80 | 16 | దాంపట్యము | దాంపత్యము | 154 | 25 | రింపని | కొనసరింపని |
| 80 | 21 | నారగించు | నారగించుట | | | | |

శ్రీ

శుభమస్తు

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA

## దీర్ఘాయువు.

---

శ్రీమదనంతంబగు భారతవర్షాది పుణ్యదేశములతో నిండియున యీ పృథివియందు దయామయుండును, సర్వజ్ఞుండును సకలైశ్వర్య దాయకుండును నగు నీశ్వరుని మహిమచే జన్మించు సమస్తజీవకోటియు తమప్రాణమన నెంతయో విలువగ నెంచుకొనుచుఁ జిరకాలము జీవించుటకు నత్యంత ప్రీతికలిగియుండు. మానవులు, ఇతరజంతువులు, పక్షులు, జలచరములును దమజీవమునకిసుమంత బాధ కలిగినతోడనే కష్టపడుట సహజము. భూమియందు వసించు మనుష్యుడు తనశరీరమందు గాయము తగిలినతోడనే ప్రాణమేమగునో యని విలపించు. ఘోరవిపినంబులందు సంచరించు జంతువును మృగయుండు పశుపాశితో గాల్చినతోడనే నిజప్రాణమునకై యెంతయో శోకింపదొడంగు. ఆకసమునందెగురు పక్షిని బోయవాడు కొట్టినతోడనే అది రోదనముచేయును. జలమునందు విహరించు చేపను పల్లెవాడు గట్టుమీదకు దీయుచుండగనే అది శరీరము గొట్టుకొనుచుఁ దనకు వాటిల్లనున్న ప్రాణకష్టమును దెల్పును. పిపీలికాది సమస్తకీటకజాతులును దమకు ప్రాణాపాయము కలుగు పనులు జరిగినతోడనే తమ దుస్థితిని సర్వవిధములచేతను బోధపరుచును. దన్మూలమున దీర్ఘకాలము జీవించుట తమకు నిష్టమని స్పష్టముగా వ్యక్తీకరించును.

దీర్ఘకాలము జీవించియుండుట మానవులెల్లరకును ప్రీతికరము, అత్యవసరము. మహారాజులు, చక్రవర్తులు మొదలు పాటుపడి జీవనము చేయుకూలివాని వఱకును, ఇహలోకసుఖములు క్షణభంగురములని గ్రహించి పుణ్యకార్యము లొనరించుమహాత్ములు మొదలు కామక్రోధములకు లొంగి పాపకృత్యము లొనరించు నరాధముల వఱకును సాధ్యమగునంతటికాలము సజీవులై యుండుట ఆవశ్యకమనితలంతురు. రాష్ట్రాధిపతియగు చక్రవర్తి తనప్రజలకు సుఖముకలిగించు కార్యము లొనరించి పశ్వాదుల కఖండ సదుపాయములు చేయించి ఆశీర్వచనము నొంది, పరలోకసౌఖ్యమును, దీర్ఘాయువును గోరుచుండును. ప్రపంచసుఖము లననుభవించుటకును, తనివితీరునట్లుగా సమస్తదేశములందుగల వింతలు, అద్భుతములు పరిశీలించి ఆనందించుటకును, ప్రపంచానుభవమును, నిరుపమానమగు బుద్ధికౌశలమును సంపాదించుటకును దీర్ఘాయువు మనుష్యుని కత్యవసరము. తనఅఖండబుద్ధిని నరుడు తనమిత్రులకును, దానిని గోరు నితరులకును నేర్పుటకు దీర్ఘాయువు ప్రధానము. ఆయుర్దాయమున్నచో, విద్యలనభ్యసించి, వాని నితరులకు బోధింపవీలగును. తమకుటుంబాభివృద్ధిని జూచుటకును, మిత్రులతో సర్వసుఖములనొందుటకును దీర్ఘాయువు మానవుల నాశ్రయించియుండవలెను. దేశసేవ చేయుటకును, ప్రఖ్యాతిబడయుటకును ఆయుర్దాయమే ప్రధమాంగము. పారిశ్రామిక వృత్తులయందుగాని, రాజనీతియందుగాని మహానైపుణ్యముతో విరాజిల్లుచు దానినుపయోగపరచుటకును, బోధించుటకును, దీర్ఘాయువుముఖ్యము. క్రతువులొనరించి, తీర్థయాత్రలుచేసి, మహాతపంబాచరించి, పుణ్యముసంపాదించి, శాశ్వతమగుపరలోకసుఖములనొందుటకు దీర్ఘాయువు ప్రధమఘట్టము. ఇయ్యది ఎల్లరకు నత్యవసరమై, సర్వజనవాంఛితమగు మహాప్రసాదమగుటచే రమణీయసౌధములందు విహరించుచు సామ్రాజ్యాధిపత్యము వహించియుండుచక్రవర్తి సహితము,



తనరాష్ట్రమంతయు ధారవోసినను, తనకుంగలవిశేష ద్రవ్యమంతయు నర్పించినను, గుటీరమునందు కాపురముచేయుచుం దనపొలము దున్నుకొనుచు నిర్మలమగు నీటికాలువలనుండి నిశ్శబ్దముతో ప్రవహించు జలముచే ఫలించు సస్యములే తనవిశేషసంపద యని యుప్పొంగు పేదకాపునకుంగల దార్ఢ్యము, దీర్ఘాయువును దనకు రావుగదా యని దుఃఖించుచుండు. కావున మానవులెల్లరును, దీర్ఘాయువన నత్యవసరము గాను అమూల్యముగాను నెంతురు.

ఇట్టి అమూల్యమగు దీర్ఘాయువునకు ముఖ్యాంగము ఎడతెగని శరీరారోగ్యము. ఆరోగ్యములేని శరీరమందు రోగోత్పత్తియై సుఖము నశించిపోయి ఉత్సాహహరణమగుచు. రోగములుగల శరీరము దార్ఢ్యమును నష్టపోవును. శరీరదార్ఢ్యము తగ్గుటవలన దేహము క్రమముగాం గృశించి బలహీనతనొంది, శీఘ్రకాలములోనే జీవమును గోల్పోవును. ఆరోగ్యముగల మానవశరీరము రోగరహితమై దార్ఢ్యముతోం దేజరిల్లు. అట్టి శరీరమందు రక్తబలము విశేషముగా నుండుటచే ధైర్యసాహసములు, తేజోబలము, ఉత్సాహము, నిశ్చలమనస్సు మొదలగు సుగుణములు నిరంతరనివాస మేర్పఱచుకొని యుండు. ఈసుగుణములతోం బ్రకాశించునపుడు శరీరమునకును, జీవమునకును, నత్యంతమైత్రి యొప్పారు. శరీరమునకును జీవమునకును గల యీసంబంధమే ఆయుర్దాయమని వైద్యశాస్త్రము వెల్లడించుచున్నది. దేహారోగ్య మెంతకాలము నిలువంబడియుండునో, అంతకాలమును శరీరము ఆయుర్దాయముతో దీపించుచుండు. సుస్థిరమగు ఆరోగ్యమువలన మానవశరీరము వజ్రమువలె విలసిల్లుచు, ఉత్సాహముతోం బొరలుచు, దీర్ఘాయుఃక్షేత్రమునందు దేజరిల్లుచుండు.

ఈసుస్థిరమగు దేహారోగ్యము మానవులు తమతమ దేశపరిస్థితుల కనుకూలముగా నుండు ఆచారనియమముల ప్రకారము వర్తిం

డినచో చేకూరదు. శరీరము రోగమునకు లోబడినపుడు ఔషధసేవ ఆరోగ్యమును గలిగించినను, దానిని స్థిరముగా నిలబెట్టుటకును రక్షించుటకును నిరుపయోగమగును. నిరంతరౌషధసేవ, నిరంతరయమబాధ. దేహమందు ఔషధసేవచే రోగము లణగుచున్నను, స్థిరముగు నారోగ్యము కలుగనేరదు. ఈవిధముగా సాధింపఁగోరు ఆరోగ్యము బుద్బుదప్రాయమగును. కావున జీవయాత్ర గడపునపుడు మానవులు స్వీకరించు పదార్థములును, ఆచరించు నియమములును, దమదేశశీతోష్ణస్థితులకును, ఇతరపరిస్థితులకును ననుకూలించియున్నచో ఆరోగ్య మేర్పడును. అమెరికాదేశముయొక్క శీతోష్ణస్థితులకును నచ్చటి పంటలకును భారతవర్షపు శీతోష్ణస్థితులకును బాటలకును వ్యత్యాసము కలదు గావున నీరెండుదేశములందును మానవుల కారోగ్యమొసంగు పద్ధతులలో ననేక వ్యత్యాసములు కలవు. ఈహేతువువలననే అమెరికాదేశస్థుల కారోగ్యము కలుగుపద్ధతులకును, ఆఫ్రికాఖండవాసుల కారోగ్య దాయకములగు ఆహారములకును భేదముకలదు. పాశ్చాత్యదేశములగు ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు మొదలగు దేశములందుఁ బ్రజల కారోగ్యమిచ్చు పద్ధతులును భరతవర్షమునందుఁ బ్రజల కారోగ్యము చేకూర్చు పద్ధతులును భిన్నములుగా నున్నవి.

భరతవర్షమందలి ప్రజల కారోగ్యము నొసఁగు ఆచారములతోఁ గూడియున్నది ఘనతవహించిన ప్రాచీనహిందూధర్మము. ఈహిందూధర్మము ప్రపంచమందలి మతములలో శ్రేష్ఠతరమైనదని ఖ్యాతిగాంచి శ్రుతి, స్మృతులను దన భుజద్వయముగా నెన్నుకొనుచు వాని నెల్లకాలములందును బ్రమాణములని ప్రకటించుచుండు హిందూమతముయొక్క అమూల్యసారము. హిందూమతమును విపులము చేయుచు దానిఁ బోధించు మహాశాస్త్రము. ఈమతాభివృద్ధికిఁ దోడ్పడు దివ్యాయుధము భారతీయుల నీతిశాస్త్రము. న్యాయశాస్త్రము జ్యోతిశ్శా



స్త్రము వైద్యశాస్త్రము మంత్రశాస్త్రము ఆరోగ్యశాస్త్రము. భరతవర్షముయొక్క ఘనతకు మూలకారణము. ఈధర్మమునందు భారతీయుని ఆరోగ్యమును గాపాడుపద్ధతులు మతనియమములతోఁ బాటు చేర్పబడియున్నవి. ఔషధసేవతోగాని, ధనవ్యయముతోగాని నగత్యములేకయే యీధర్మాచరణము భారతీయుల కారోగ్యమును బ్రసాదించి దానిని రక్షించును. సకలరోగములును ఈధర్మాచరణముచే నిర్మూలమగుటచే భారతీయులు స్వర్గసుఖములతోఁ దుల్యమగు సుఖముల నిహమందే యనుభవింతురు. ఈధర్మము భారతీయుల కారోగ్యమెట్లొసఁగుచుండెనో దానియందట్టి సమర్థత యెటుగలదో విచారించుట యీగ్రంథముయొక్క రాఁబోవు పుటపుటయొక్కయు, పంక్తిపంక్తి యొక్కయు ప్రధానోద్దేశమైయున్నది. భరతవర్ష శీతోష్ణస్థితుల కనుకూలముగానుండు ఆచారము లీధర్మమునందు విధింపబడుటచే దీనిని దీక్షతో నాచరించు భారతీయు లీకాలమందును సహితము ఆరోగ్యవంతులై సుసంతానవంతులై మార్కండేయునివలె జిరకాలజీవులై ప్రకాశించుచున్నారు.

భరతవర్ష శీతోష్ణస్థితుల కనుకూలమైన ఆచారములతోఁ గూడియుండి చిరకాలముక్రిందటనే ప్రఖ్యాతినొందిన హిందూధర్మమును బ్రాచీనకాలమునం దత్యంత దీక్షతో భారతీయు లభ్యసించుట కనేక కారణములు కలవు. ఉత్కృష్టమగు నీధర్మమును ప్రాచీనకాలమందు దైవసమానమహిమాధ్యులును, మహాత్ములును, భారతవర్షయశస్కరులును నగు ఋషిశ్రేష్ఠులు బ్రసాదించిరి. వీరు బహుజాగరూకతతో నిహపరముల ననుసరించి నిర్మించిన ఈధర్మము ఇహమందు మతాచారముల ననుసరించి ఆరోగ్యము నొందుటకును, బరమందు మోక్షసౌఖ్యము నొందుటకును మార్గదర్శియై యున్నది. ఈఋషిపుంగవులయం దెల్లరకును భక్తివిశ్వాసములు కలవు. మఱియు నాకాలమందు భారతీ

వర్షమునందు మతములు విశేషముగా లేవు. కావున మతపరిపాలనము సులభమై యుండె. ప్రభువు ధర్మమునందు దారితేరిన సద్వర్తనపరులగు బ్రాహ్మణమంత్రిశేఖరులసాహాయ్యముతోఁ బ్రజాపరిపాలనతోఁ బాటు మతపరిపాలన మొనరించుట కవకాశము కలిగియుండెను. సంఘబహిష్కారభీతి మెండుగానుండుటచే బ్రజలు మతాచరణమం దత్యంతభయభక్తులతో మెలఁగుచుండిరి. మతభ్రష్టత్వము నొందినవారికి కుటుంబాస్తియందు హక్కు తొలగిపోవునని హిందూన్యాయశాస్త్రము మనువుకాలమునుండియు శాసించుచుండెను. ఇంతియగాక, ఈహిందూధర్మము వ్రాయబడిన సంస్కృతభాష దేశమందు జాజ్వల్యమానమై ప్రకాశించు వెలుగువలె తేజరిల్లుచు మిక్కిలి అభివృద్ధిలో నుండెను. దేశమంతయు మహాపండితశేఖరులతోఁ దనరారుచు, ధర్మములును, వానియర్థములును, వానియుద్దేశములును ప్రజలలో ననేకులకు గ్రాహ్యమైయుండి, న్యాయాన్యాయవివక్షత, ధర్మాధర్మభేదములును బ్రాహ్మణులెల్లరకును దెలిసియుండెను. హిందూధర్మము నాచరింపఁదగిన ఆశక్తి కలుగుటకు సంస్కృతభాషావిజృంభణము కారణమై యుండెను. ప్రభువునకును, బ్రజలకును అన్యోన్యానురాగ మధికమై యుండ ప్రజలలో సకలవర్ణస్థులకును, బ్రాహ్మణశేఖరులు మార్గదర్శకులై దయాధర్మసత్యశౌచాది సద్వర్తనములతో నతిశయించియుండి శాస్త్రోక్తముగు సమ్మానమును బడయుచుండిరి. బ్రాహ్మణులెల్లరును సద్వర్తనపరులై యుండుటచే వీరియెడల నితరవర్ణస్థు లత్యంతభక్తివిశ్వాసములు చూపుచు వీరియాజ్ఞను శిరసావహించి వీరివలెనే హిందూధర్మయుక్తముగా వర్తించుచుండిరి. దేశమందెల్లరును సత్యమూర్తులై న్యాయమార్గవర్తులై యుత్సాహముతోఁ గూడియుండిరి. ఈవిధముగా భరతవర్షమందలి ప్రభువును, బ్రజలును హిందూధర్మము నత్యంతదీక్షతో నాచరించుచుండిరి.



పూర్వకాలమునందు భారతీయులెల్లరును సనాతన హిందూధర్మము నాచరించుటచే దేశము సర్వసంపదలతోఁ గూడియుండి దేశీయులకు దీర్ఘాయువు హస్తగతమై యుండెను. ప్రసిద్ధికెక్కిన ఈధర్మము నాచరించుట వలన భారతీయులు సదాచారసంపన్నులై, న్యాయమార్గవర్తులై, ధర్మస్వరూపులై వర్ధిల్లుచుండిరి. సకలగ్రామములును, నిరంతరము వేదశబ్దముతో ధ్వనించుచుండెను. వేదమూర్తులును మహాశాస్త్రవేత్తలును, యుక్తముగా బ్రభువు చేతను, బ్రజల చేతను సమ్మానింపఁబడుచుండిరి. భరతవర్షము వేదోక్తాశీర్వచనమును బూర్ణముగా నొందుచుండెను. దేవాలయములు ఉదయసాయంకాలములయందు భక్తాగ్రేసరులతోఁ గిటకిట లాడుచుండెను. అప్పటప్పుడు మ్రోగుచుండు గంటలయొక్క ధ్వనిచే భూతప్రేతపిశాచాదులు దూరముగా పరువిడుచుండెను. దేశమందెల్లెడలను దపోనిష్ఠాగ్రేసరులు దీపించుచుండుటచే యుక్తకాలనియమముల ననుసరించి స్నానసంధ్యావందనాదు లొనరింపని ద్విజులు ప్రభువుచే దండింపఁబడుచు సంఘబహిష్కారభీతులగుచు మెలఁగుచుండిరి. వర్ణాశ్రమధర్మముల ననుసరించి యోగ్యమగు వర్తనగలిగి భారతీయులు మెఱయుచుండిరి. దేశమందుఁ బల్లెపల్లెయందును, దత్తప్రాంతములందును, హిందూధర్మ మీరీతిగా నాచరింపఁబడుచుండుటచే, న్యాయము, సత్యము, సద్వర్తన మొదలగు ధర్మములు భరతవర్షమున నలంకరించియుండె. వీనిప్రభావము వలనను, హిందూధర్మముయొక్క పవిత్రతామహిమల చేతను భరతవర్షమందుఁ గుంభవృష్టిగా మాసమునకు ముమ్మారు వర్షములు గురియుచుండెను. జీవనదు లధికములగు ప్రవాహములతో నిరంతరము ప్రవహించుచుండ, తటాకాదులును, కూపములును జలపూరితములై యుండె. ప్రభువర్యు లొసంగిన మందబయళ్లు విస్తీర్ణములై యొప్పారుచు, ప్రశస్తమగు పచ్చికతోఁ గూడియుండుటచే పశ్వాదులు వలసి

నట్లు మేయుచు, సుఖము నొందుచు, అధికములగు క్షీరము లొసంగుచుండెను. పంటలధికముగా ఫలించుచు, దేశము సుభిక్షముగానుండెను. ఫలవృక్షములశాఖలు ఫలభారముచే నిలపైఁ జనుసంతతి వైభవముతో గన్నులపండువుగా నుండెను. దేశమందుఁ బ్రభువు మొదలు కష్టించి జీవించు కూలివానివఱకును, కలకలలాడుచు, సుఖించుచు, నుత్సాహముతో వర్ధిల్లుచుండిరి. హిందూధర్మముయొక్క మహిమచే దేశమునకు క్షామము, అగ్నిభయము, జారచోరత్వములు, వర్ణసాంకర్యము మొదలగు దేశారిష్టములు దూరములైయుండెను. మరియు భారతీయులు తామపూనిన సర్వకార్యములందును విజయము నొందుచు, అపజయ మెట్టిదో యెఱుంగకుండిరి. వారికి ఈ ధర్మాచరణముచే సర్వశత్రునాశనమై సర్వజనవశీకరణమై, సమస్తకోరికలునుదీరి సమస్తభోగములును సమకూరుచు, స్వర్గసుఖముతోఁ దుల్యమగు సుఖమిహమందే కలుగుచుండెను. ఆరోగ్యదాయకములగు నియమములు ఈధర్మమందు విధింపబడియుండుటచే దీక్షతో దీనినాచరించిన పూర్వకాలపుహిందువులు నీరోగులై, అంటురోగము లన్నవి యెఱుంగకుండిరి. వారువయస్సునకుఁదగిన జఠరాగ్నికలవారై అజీర్ణరోగములనెఱుంగక, ఎట్టి యాహారమైన నత్యాశ్చర్యముతో స్వీకరింపగల్గుచు, నిర్వికారులై ఘనమగు శరీరదార్ఢ్యముతో విరాజిల్లుచు, అద్భుతప్రజ్ఞావంతులై ఎంతటి దూరమైన నెడతెగని ఓపికతోఁ బోగలుగుచుండిరి. ఏకాగ్రచిత్తముఁగుదుర్చు మార్గములు వారాచరింపుచున్నందున, ధైర్యస్థైర్యములు వారల నాశ్రయించియుండెను. కాలనియమముల ననుసరించిన భోజనము స్వీకరించుచు తత్వభేదము కలిగించు వానిని భుజింపమిచే వారు అకాలమృత్యువుయొక్క ముఖ మెఱుంగరైరి. దేహబలమునకును లావణ్యమునకును మూలమైన శక్తులను, గ్రహించి వానినిరక్షిం



చుకొను విధము లీధర్మము విశదీకరించి యున్నందున, పూర్వకాలపు హిందువులు, ఈధర్మము నాచరించి నిరంతరోత్సాహవంతులై, జీవయాత్రయందు వజ్రములవలె విలసిల్లుచు, రోగరహితమైన సుసంతతిని బడయుచు, సుమారు 100—150—200 సంవత్సరములేగాక చిరకాలము వఱకును సజీవులై ప్రకాశించుచుండిరి. ఈరీతిగా ఉష్ణదేశీయులగు భారతీయుల కనుకూలముగానుండు ఆచారములతో గూడియున్న హిందూధర్మము దీక్షతో ప్రాచీనహిందువు లాచరించుచు, ఐశ్వర్యవంతులై యలరుచు, దీర్ఘాయుర్మహారాజ్యాధిపత్యము వహించుచుండిరి.

దీర్ఘాయురైశ్వర్యంబులకు మూలమై, భారతీయుల అమూల్యసంపదయై, పరిషత్తులయందు నన్యదేశములలో శ్రేష్ఠతరమైనదిగా నెన్నుకొనబడినదై, ఇహపరసాధనముల ననుసరించి నిర్మింపబడిన హిందూధర్మమును, ఆధునిక హిందువులు ఆచరింపక, శీతలదేశీయుల కుపయుక్తమగు ఆచారములతో గూడియున్న పాశ్చాత్యనాగరకత నభ్యసించుచున్నారు. కాలపరిస్థితులు మాఱుచుండుటవలన ఈకాలపు హిందువులు హిందూధర్మమును నాచరించుచుండుటలేదు. ఈధర్మము వ్రాయఁబడినభాషయగు సంస్కృతమునకు, మనయాజ్ఞవల్క్యాది ఋషిపుంగవులయొక్కయు, వేదవ్యాసకాళిదాసాది సత్కవులయొక్కయు బుద్ధినిధానగర్భము నందుకొని గర్వించు సంస్కృతమునకు హిందూదేశీయభాషలకు మాతృభాషయగు సంస్కృతమునకు ఆధునిక విద్యావిధానమందు ఆంగ్లభాషతోఁ దుల్యమగు ప్రాముఖ్యము లేదు. ఇందువలన హిందువులలో ననేకులును, పాశ్చాత్యవిద్యల నభ్యసించుచున్న యువకు లనేకులును, హిందూధర్మశాస్త్రము లెట్టివో, వానిని రచించిన మహాఋషు లెట్టిమహిమాఢ్యులో, వానికి వ్యాఖ్యానము లెట్టివో ధర్మ మేదియో అధర్మ మేదియో, మొదలగు స్వల్పవిషయములు సహితము ఎఱుంగని దుస్థితిలోనుండుటకును, మహావిద్వాంసులను, వేద

మూర్తులను జూచి గౌరవించుటకు మారుగా వారిని బరిహసించుటకును, పితృ, గురు, దేవభక్తివిరహితులై చిన్న పెద్ద తారతమ్యము గణింపజాలక అజ్ఞానముచేఁ బుట్టిన దాడినుండియు మహాపాపకృత్యము లొనరించుటకును గారణమగుచున్నది. కావునఁబట్టి సంఘబహిష్కారభీతిశూన్యమై, పెద్దలయెడల భయభక్తులు సమసిపోవుచునవి. హిందూధర్మము ఈవిధముగా దాదాపుగా ఈకాలపుహిందువు లందఱకును దెలియకుండుటయే గాక హిందూమతము కూడ నూతనమగు మార్పు జెందినది. నాగరకత ప్రపంచమందలి దేశములెల్ల రాజకీయ విషయములందే కాక మతవిషయములలో గూడ స్వాతంత్ర్యధ్వజము నెత్తి ప్రారంభించినవి. ప్రజాస్వాతంత్ర్యము ఈదేశములందు సాధ్యమగునంతటి వఱకు సర్వవిషయములందును, నాటుకొనుచున్నది. నాగరకతచే జయింపబడిన దేశములకెల్ల స్వాతంత్ర్యము లక్షణమైయున్నది. క్రీస్తుశకము 1858 సంవత్సరమందు ఈస్టుఇండియా కంపెనీవారి స్వాధీనము నుండి బ్రిటిషుప్రభుత్వము వారు హిందూదేశమును వశపఱచుకొన్న సందర్భములో భారతీయులకు మతస్వాతంత్ర్య మొసంగబడెను. ఈ సంవత్సరమందు సూర్యాస్తమయ మెన్నఁడు నెఱుంగనంతవిస్తీర్ణమై నాగరకత ప్రభుత్వములలో నగ్రస్థానము వహించియున్న బ్రిటిషుసామ్రాజ్యమునకు నాధిపత్యము బూనిన దయామయురాలును, మహారాజ్ఞియునగు శ్రీమద్విక్టోరియాజగజ్జనని హిందూదేశమందుగల సర్వమతస్థులకును, మతవిషయమై తామెట్టి జోక్యమును గల్గించుకొనమనియు, వారివారిమతమును వారు యథేచ్ఛముగా రక్షించుకొనవచ్చుననియు, నభయమిచ్చుచు ప్రకటించి యుండెను. భారతీయు లీశాసనముఁబడసి అవురంగజేబుటిప్పుసుల్తానుల కాలములందు హిందూ పడినమతనిర్బంధములను బూర్ణముగా మరచిపోయి శాంతి నొందగలిగిరి మరియు క్రీ. శ. 1860 సంవత్సరమందు హిందూన్యాయశాస్త్రమును సందొరక మతవిష



యమగు సవరణ గావింపఁబడెను. హిందూమతమును విడనాడి అన్యమతమును స్వీకరించువారికిఁ గుటుంబాస్తియందు హక్కుతొలఁగ నేరదని ఈశాసనము ప్రకటించెను. ఈసంస్కరణము వలన హిందువులు భయభక్తులతోఁ బ్రాచీనకాలమందు వలె హిందూధర్మము నాచరింప కుండుట కవకాశము కలిగినది. కాని ప్రభుత్వము వారి యుద్దేశ మెన్నఁడు నట్టిది కాదు. ఇండియన్ పీనల్ కోడ్ లో మతవిషయమగు నేరములకు శిక్షలు నియమింపబడి యుండుటచే, ప్రభుత్వమువారి ప్రధానోద్దేశము భరతవర్షమందలి మతములనన్నిటిని రక్షించుటకని ప్రకటితమగుచున్నది. ఈకాలములో భరతవర్షమందనేక మతములు వర్ధిల్లుచున్నవి. వీనినన్నిటిని దీక్షతోఁ బ్రజలాచరించునట్లు ప్రభుత్వమువారు చేయఁబూనుకొనలేదు. అట్టి కార్యభారము వారికి వ్యర్థప్రయాసలతోఁ గూడిన పని. నాగరకతాభివృద్ధిచే దేశమందు మతముల సంఖ్య పూర్వము కంటె హెచ్చినది. సంఘాభివృద్ధి వలనను, వాణిజ్యాభివృద్ధి వలనను, బట్టణములును, నాగరకతచే జయింపబడిన వ్యాపారస్థలములును, అనేక మతస్థులతో నిండియున్నవి. ఇచ్చోట్ల ఒకేగృహమందు ననేక మతస్థులు వసించువారుకూడ కలరు. ఇంతియగాక, హిందూమతమువంటి మతము నేదేని ప్రభుత్వమువారు ప్రోత్సాహించినచో, అన్యమతస్థుల కది కోపకారణమగును. భరతవర్షమందు నిట్టిపరిస్థితులు నాగరకతా విజృంభణముచే గలుఁగుటచే మతపరిపాలనము పూర్వకాలమందు వలె జరుగుటకును, హిందూమతముయొక్క ప్రధానాంశమగు హిందూధర్మమును దీక్షతో నీకాలపుభారతీయులు ఆచరించుటకును నవకాశము లేదయ్యె. కావున భారతీయులు హిందూధర్మమర్మవిషయమున మూఢులై అనవసరముగా తమంతట తామే శీతలదేశీయుల కుపయుక్తమగు నాచారములతోఁ గూడిన పాశ్చాత్యనాగరకత నభ్యసించుచున్నారు.

హిందూధర్మము నాచరింపకుండుటచే, పూర్వకాలపు హిందువులకు హస్తగతమైన దీర్ఘాయురైశ్వర్యంబులు ఈకాలపు భారతీయులకు దుర్ఘటములై యున్నవి. ఈప్రశస్తమగు ధర్మము ఇహపరసాధనముగా నుండునట్లు నిర్మింపబడి యున్నందున, దీని నాచరించుట భారతీయులు మానినతోడనే శాశ్వతసుఖములకు మూలమైన పరలోకసాధనము న వీరు మఱచిపోయి, క్షణభంగురమగు ఇహలోకసుఖము నొందుటకై వీరు ధనాకర్షణ కలవారై దీనినార్జించుటయే తమ ప్రధానోద్దేశముగ నెంచుకొనుచు, దయాధర్మసత్యములకును, సద్వర్తన, సత్సాంగత్యములకును దూరమగుచున్నారు. వేదశాస్త్ర శ్రౌతవిద్యలు భారతీయుల యాధిక్యమునకు మూలమైన ఈమహావిద్యలు డానాపుగా నశించుచున్నవి. వేదమూర్తులును, మహాశాస్త్రజ్ఞులును కొలది సంఖ్యవారుమాత్రమే కలరు. దేశమునకు వేదోక్తాశీర్వచనము కలుగుచుండుట లేదు వేదమూర్తులును, శాస్త్రవేత్తలును, సన్మానము నొందుటకు మాఱుగా పరిహసింపబడుచున్నారు. భరతవర్షమునందు బల్లెపల్లెయందును గల దేవాలయములు పూర్వకాలమందు భక్తాగ్రేసరులతోం గిటకిటలాడుచుండిన ఆలయములు, ఈకాలమందు ప్రాతఃస్సాయంకాలములందుగూడ నిర్జనప్రదేశములైయున్నవి. వర్ణాశ్రమధర్మములు పూర్ణముగా నశించుచుండుటచే ద్విజులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు కాలనియమముల ననుసరించి స్నానాదులు చేయుట మానివేయుచున్నారు. దేశమందుం దపోనిష్ఠాగ్రేసరులును, శివపూజాధురంధరులును నశించుటకుం గారణమయ్యె. ఇందువలన భారతీయుని యొక్కయు, భరతవర్షము యొక్కయు మాహాత్మ్యమే యంతరించుచున్నది. ద్విజులయందు జారచోరత్వములు నాటుకొనుచున్నవి. పుణ్యభూమియై ప్రసిద్ధికెక్కిన భరతవర్షము ఇన్నివిధములచే పాపపూరితమై యున్నందున వర్షములు కురియక దేశము దుర్భిక్షపీడితమై యున్నది.



భరతవర్షముయొక్క పవిత్రతకుం బ్రాచీనకాలమునుండియు హేతువై చవుటిపట్టులను రత్నగర్భములుగం జేయుచున్న గంగా, గోదావర్యాదిజీవనదు లెండిపోవుచున్నవి. దేశక్షేమమునకు మూలమైన పశ్వాదులు వలసిన మేత లేనివై హింస నొందుచున్నవి. అనేకములగు జంతుజాలములు నశించుచున్నవి. పంటలుకూడ కడుతక్కువగా ఫలించుచున్నవి. ఫలవృక్షములు విరివిగా గాయుట మానివేయుచున్నవి దేశమందు క్షామ మధికమగుచున్నందున పాటకప్రజలే కాక సాధారణ కుటుంబములు కలవారు సహితము, నిరుత్సాహవంతులై కష్టపడుచున్నారు. భారతీయులను దాపుబూనిన సర్వకార్యములందును నపజయ మెదుర్కొనుచున్నది. ప్రభుత్వమునకును, ప్రజలకును, నన్యోన్యానురాగములు తగ్గుచున్నవి. నిరుపమానమగు ప్రభావముతో నతిశయించియున్న దివ్యమగు ఈధర్మము నాచరింపమిచే భారతీయులు ధైర్యస్థైర్యపరాక్రమవిహీనులై దుస్థితిలోనుండి, ఇహలోకనరకము ననుభవించుచు, ననేకకష్టములకును, రోగములకును లోబడి అంటుజాడ్యములకు లొంగిపోవుచున్నారు. వీరల యారోగ్యము అంతరించుచుండుటయే కాక వీరు అజీర్ణరోగములచే గెలువబడి, జఠరాగ్ని లేనివారై, ఎట్టి స్వల్పకార్యములనైన నెరవేర్పజాలక శకటాధారము లేనిదే ఒకచోటనుండి మరియొకచోటుకుం బోలేనంతటి బలహీనులై యున్నారు. ఇట్టిసందర్భములో భారతవర్ష శీతోష్ణస్థితులకును, హిందువుల తత్వములకును విరుద్ధములగు భోజనపదార్థములను స్వీకరింపంజేయు పాశ్చాత్యనాగరకత నీకాలపు హిందువు లభ్యసించుటతోడనే వీరి సహజమగు తత్వములు భేదించి వైద్యశాస్త్రవిరుద్ధములైన నూతనరోగము లుద్భవించుచున్నవి. ఇంతియగాక, వీరు సర్వశక్తులను గోల్పోయి, కురూపులై, కళాకాంతులునశించిన దేహములతో, కుటుంబసౌఖ్యముల నొందజాలక

పతితము ఉత్సాహవిరహితులై రోగపూరితమైన దుష్టసంతతిని బడయుచు నతిసుకుమారులై సుమారు 45—40—35 సంవత్సరములకంటె నెక్కువకాలము జీవింపజాలకున్నారు. ఈవిధముగా భారతీయులు తమస్వకీయమై, గర్వకారణమై, తమదేశ శీతోష్ణస్థితుల కనుకూలముగానుండు ఆచారములతోఁగూడియున్న హిందూధర్మము నాచరింపక, పాశ్చాత్యనాగరకత ననవసరముగ నభ్యసించుటచే వీరికి దీర్ఘాయురైశ్వర్యంబులు చేకూరుట దుర్ఘటమైయుండి, దేశము భయంకరమగు స్థితిలోనికి వచ్చినది.

ఇట్టి భయంకరమగు దుస్థితినుండి దేశమును రక్షింపఁగల హిందూధర్మాచరణమును వర్తమానకాలమందు భారతీయులు అనేకులు చేయకున్నను, దీని నత్యంతాభిమానముతోను, దీక్షతోను నాచరించు పుణ్యపురుషు లచ్చటచ్చట కలరు. వీరివలన నీ కాలమందీధర్మము ననేకు లాచరించుచున్నారు. ఈపుణ్యాత్ములే లేకుండి ఇంతమాత్రమైనను హిందూధర్మాచరణము జరుగకున్నచో, భరతవర్షమే కాక ఈపృథివి కూడ ఈకాలమందు పాపపర్వతభారమునకుఁ గ్రుంగిపోయి, భగ్నమై, భస్మమై, భూతమై యుండిపోవును.

హిందూధర్మాచరణ మీ కాలమున ననేక కారణములచే నపశక్తితో భరతవర్షమందు ప్రబలుచున్నది. ఇందలి ప్రధాన కారణములు రెండుమాత్రము వివరించు టవసరమైయున్నది. ఆసేతుహిమాచలమై వ్యాపించి దేశీయులెల్లరకును నైకమత్యమును గుదిర్చి, దేశభక్తి నుదయింపఁజేయుటయందు ప్రధానకారణమైన ఆంగ్లవిద్యయు, చెన్నరాజధానియందును, మరికొన్ని యితరస్థలములందును నాటుకొనుచున్న అబ్రాహ్మణోద్యమమును ప్రాచీనకాలమందు వర్ధిల్లి భారతీయులకు సర్వసుఖముల నొసఁగిన హిందూధర్మప్రతిష్ఠాపనకు ఘనమగు సహాయ మొనరించుచున్నది. ఈ రెండు విషయములును హిం



దూధర్మమున కెట్లు చేయూత నిచ్చుచున్నవో తెల్పుటకై కొంచెము ఇచ్చట చర్చించుట ఆవశ్యకమై యున్నది.

## ఆంగ్లవిద్యాభివృద్ధి.

భారతీయులు క్రీ. శ. 1860 సంవత్సరమునకుఁ బూర్వమునుండియు నాంగ్లవిద్యను నేర్చుకొనుచున్నను, ఈవిద్య 1880 సంవత్సరమునుండియు నీ దేశమున విశేషముగా వ్యాప్తి నొందుచున్నది. ఈ ఆంగ్లవిద్య ఇరువదవశతాబ్దారంభము నుండియు నత్యధికమగు బలముతో వ్యాప్తి నొందుచు హిందూదేశీయు లెల్లరకు నొండొరులయందు నభిమానము, ఐకమత్యమును బుట్టించుచున్నది. ఈవిద్యయందు బరిపూర్ణపాండిత్యము సంపాదించినవారలకు దేశీయభాషలందును, మతమునందును, ధర్మములందును, గౌరవమును ప్రేమయు మూఁడు విధములుగా జనించుచుండుటచే హిందూధర్మము ఈకాలమందుఁ బునరుజ్జీవనము నొందుచున్నదని చెప్పవచ్చును.

1, హిందువులు ఆంగ్లవిద్యాభ్యాసము చేసి, అందుఁ బూర్ణమగు జ్ఞానమునొందినవారైనచో, నాంగ్లేయుల ఆధిక్యమువారికిగోచరంబగుటచే హిందూధర్మము నూతనబలముతో వర్ధిల్లును. ఆంగ్లేయులు ప్రపంచమందలి ఆధునిక నాగరకులలో నగ్రగణ్యులని ప్రఖ్యాతిఁ బడసి నిరుపమానమైన విస్తీర్ణతతో మెఱయు సామ్రాజ్యమును సంపాదింపఁగలిగిరి. ఈసామ్రాజ్యవృత్తాంతమే గాక ఆంగ్లేయుల ధైర్యస్థైర్యములు, ఓర్పు, పూనిక మొదలగుగుణములు గూడ ఈవిద్యాపరిపూర్ణులకు గోచరంబగును. భారతీయులందిట్టి విద్యాపరిపూర్ణులుండుటచే వారికి నాంగ్లేయుల రాజ్యవిస్తారము ఆధిక్యము మున్నగునవి స్పష్టపడి తమస్వదేశమగు భరతవర్షమెట్టియాధిక్యముతోఁ బూర్వము ప్రకాశించెనో తెలిసికొనుట మొదలగు పరిశీలనాశక్తి కలుగును. మరియు వారికి మనదేశమెట్టిది ? దీనికెన్నడైన నెట్టిఘనతయైనను గల

దా? ప్రస్తుతపు స్థితికంటె మనదేశము వైభవముగా నుండెనా? ఈ విధమగు నూతనరీత్యాజ్ఞాన ముదయించును. విద్యాధికులెల్లరును, దమ ప్రాచీన నాగరకతయు, దానినిగూర్చిన ఇతరవిషయములను దిలకింపఁగోరుదురు. ఈవిధముగా నాంగ్లవిద్యాధికులకు ప్రాచీనహిందూ ధర్మమునందు నత్యంత గౌరవము కలిగి, ఆకాలమందు వర్థిల్లిన విద్యలందును, వానినభివృద్ధిపఱచిన మహాత్ముల యెడలను నూతనమగు గౌరవము జనించి వాని నభివృద్ధిపరచుటయందుఁ గుతూహలము బుట్టును.

2. ఆంగ్లవిద్య, దేశమందు విశేషముగా వ్యాపించుటచే భారతీయులకు దమస్వకీయమగు హిందూధర్మమును మతమును నుద్ధరింపఁ జేయు వాంఛ కలుగును. ఏదేని విశేషముగా నున్నచో దానియందు విరక్తిభావము పుట్టుట సహజము. సతతము జనసమ్మర్దముతోను, సౌధములవరుసలతోను, గూడియుండు పట్టణములందుండు వారికి మనోహరమగు నిర్మలవాయువు వీచు నిర్జనప్రాంతములగు పచ్చికబయళ్ల యొద్దను, సెలయేళ్ల యొద్దనను వాసము చేయుటయందు హితము కుదురు తీరున కారపు పిండివంటలు విస్తారముగా భుజించినవారికి, వానియందు విరక్తి పుట్టి మధురమైన భోజ్యములను రుచిచూచుటయందు మనస్సు మారు చందంబున ఇహలోకసుఖములందభిరుచి గల్గించు పాశ్చాత్య విద్యలను బాల్యమునుండియు గ్రహించి, అందు పరిపూర్ణజ్ఞానము సంపాదించిన హిందువులకు వీనియందు విరక్తి పుట్టి పరలోకసౌఖ్యములకు మూలమగు హిందూదేశీయవిద్యలందును, శాస్త్రములందును, నాచారములందును, నభిమానము పుట్టును. ఈరీతిగా నాంగ్లవిద్యాపరిపూర్ణులకు హిందూధర్మాచరణమునందు దృఢమగు పూనిక జనించును.



3. ఈవిద్యయందుఁ బరిపూర్ణజ్ఞానమును సంపాదించిన హిందువులలో గొందఱు తమకుటుంబములందుఁ దరతరముల నుండియు నాచరింపబడుచున్న శిష్టాచారస్వధర్మములను దీక్షతో నాచరించుచు, పాశ్చాత్యనాగరకత నభ్యసింపక పవిత్రతతోఁ దేజరిల్లుచున్నారు. వీరు ఆంగ్లవిద్వాంసులగుటచే నాగరకప్రభుత్వములలోఁ బ్రాముఖ్యము వహించిన బ్రిటిషు సామ్రాజ్యవ్యాప్తిఁ జేసిన ప్రసిద్ధపురుషుల యొక్క చతురత, బుద్ధికౌశలము, పట్టుదల, రాజనీతి నిపుణత మొదలగు సుగుణములను గ్రహించినవారగుచున్నారు. వీరికి హిందూధర్మము నభివృద్ధిచేయుటకుఁ దగినమార్గములు సులభముగాఁ దెలియును. అట్టి కార్యదీక్షను వీరు పూనుకొని అందు విజయమునొందు యవకాశము కలదు. ఈరీతిగా స్వామి వివేకానందుఁడు, రమేశచంద్రదత్తు, బాలగంగాధరతిలకు మొదలగు విద్వాంసులు హిందూధర్మపునరుజ్జీవనమునకుఁ దోడ్పడి ఇలపై మానవు లెందాక వఱలుదురో, యందాక తమపరిశ్రమలు భరతవర్షమందుఁ జిత్రితములైయుండునంత ఖ్యాతిఁ గాంచిరి.

## అబ్రాహ్మణోద్యమము.

భరతవర్షమం దనేకప్రాంతములందు బ్రాహ్మణద్వేషము అంకురించిన దని ఇదివరలో వివరింపబడెను. చెన్నరాజధానియందు సుమారు అయిదారు వత్సరములకుఁ బూర్వము ఈయుద్యమము బయలుదేరినది. దీనివలన రెండు ఫలితములు కలుగుచున్నవి. బ్రాహ్మణుఁడు తగిన గౌరవము నొందుటకు మాఱుగా ద్వేషింపబడుచున్నాడు. మరియు నీతఁడు విద్యాధిక్యము చేతను, బుద్ధికౌశలము చేతను, నర్హుఁడైనను, నుద్యోగములు సంపాదింపలేనివాఁడై యున్నాడు. ఈరెండు ఫలితములును హిందూధర్మపునరుజ్జీవనమునకు నాధారపడుచున్నవి.

బ్రాహ్మణుఁడు తన గౌరవమును గోల్పోవుట యను నిందలి ప్రథమఫలితము, హిందూధర్మప్రతిష్ఠాపనకుఁ దోడ్పడుచున్నది. ఈగౌర

వమును నీకాలమందు బ్రాహ్మణుఁడు గోల్పోవుటకు హేతువు బ్రహ్మద్వేష మని బోధపడుచున్నది. ఈదుస్థితిలో నున్న యితఁడు తాను తన దేశీయసోదరుఁడగు నబ్రాహ్మణునిచే ద్వేషింపబడుటకుఁ గారణమేమని శోధింపగా తనయెడల గౌరవము ఇతరజాతులవారికి లేదని గ్రహించుచున్నాడు. ఈగౌరవము పూజ్యమగుటకుఁ గారణము ఏమి యని ఆలోచింపగా తనమతాచారపద్ధతులకును నియమములకును విరుద్ధమైన పాశ్చాత్యనాగరకతను దా నభ్యసించి, తన స్వధర్మవిధులననుసరించి యోగ్యమగు వర్తనము లేనివాడై తనపూర్వులవలె తాను ప్రకాశింప నందున నితరవర్ణముల వారికిఁ దనయెడల గురుభక్తియు, లక్ష్యమును లేదని ఆతనికి స్పష్టపడుచున్నది. యుక్తకాలనియమముల ననుసరించి స్నానసంధ్యావందనాదు లొనరించు బ్రాహ్మణులు, ఈకాలమందు దురాచారవర్తులై యుండి, చిరకాలమునుండియు నన్నప్రదానమునకు వన్నెకెక్కిన బ్రాహ్మణులు, పాశ్చాత్యనాగరకతాభ్యాసముచే నన్నవిక్రయాదు లొనరించుచు, పూర్వకాలమునుండియుఁ బవిత్రతకుఁ బ్రసిద్ధికెక్కిన బ్రాహ్మణులు, ఈకాలమందుఁ గాఫీహోటళ్లకుఁ జనుచు, దురాచారప్రవర్తకులై మద్యమాంసాదులు స్వీకరించుచుండుట మొదలగు హిందూధర్మవిరుద్ధములగు ననాచారములకు లోబడుటవలన నితరవర్ణముల హిందువులకు బ్రాహ్మణుల యెడల నేల గౌరవము నిలచియుండును ? సకలధర్మములను బోధించు బ్రాహ్మణుఁడు, సకలనీతులను నితరవర్ణస్థుల కెఱిఁగింపవలసిన యీతఁడు, ఈకాలమందు నధర్మముగా సంచరించుచు నీతివిరహితుఁడై వర్తించుటచే దేశీయసోదరులగు నబ్రాహ్మణు లేల యితనిని గౌరవింతురు ? బ్రహ్మద్వేష మీకారణములచే జనించెనని కుశాగ్రబుద్ధిగల బ్రాహ్మణులెల్లరును గ్రహించి సద్వర్తనము కలవారై యుండుటకుఁ గారణమగుచున్నది. మఱియు దేశీయసోదరుఁడగు నబ్రాహ్మణుఁడు బ్రాహ్మణునిపై



శత్రుత్వము గాని యపకారము చేయుట గాని యట్లు కనపడినను, నయ్యది శత్రుత్వము కాదు. అపకారముగాదు. మనయందు శత్రుత్వము పూనినట్లు కనపడువారే మనకు లాభ మొనరింతురు. వారే మనలోపములను బయలుపెట్టగలరు. మనయందు మైత్రితో మెలగువారు, మనయందుండు నభిమానముచే లోపములను మనకుఁ దెల్పసాహసింపనేరరు. దేశీయసోదరులగు నబ్రాహ్మణు లెన్నటికిని తమ బ్రాహ్మణసోదరులపై వైరము బూనరు. వారి తాత్పర్య మెన్నడు ననట్టిదై యుండును. తనయుఁడు సన్మార్గవర్తుఁడై, విద్యల నభ్యసించి, ప్రజ్ఞావంతుఁడై, తన వార్ధకమునందు సుఖము నొసఁగునని వివేకవంతుఁడగు జనకుఁ డెట్లు తలచి, ఐదవసంవత్సరము మొదలు పదునాఱవ సంవత్సరము వఱకును వానిని శత్రుభావముతోఁ జూచువానివలె శిక్షించుచుండునో, అట్లే ప్రస్తుతకాలపు బ్రాహ్మణులను దమ స్వధర్మవిరుద్ధముగా వర్తించుచున్న స్థితినుండి మంచిస్థితిలో బెట్టుటకును, యుక్తమగు వర్తనముగలవారినిగాఁ జేసి హిందూధర్మయుక్తమగు వర్తనముతో నుండునట్లు చేయుటకును, అబ్రాహ్మణులు బ్రహ్మద్వేషమను అస్త్రమును బ్రాహ్మణులపై బ్రయోగించి వారిచే బలవంతముగా హిందూధర్మాచరణముఁ జేయింపఁ నెంచుచున్నారు. హిందూధర్మము నవశక్తితో దేశమందు వర్ధిల్లును. అబ్రాహ్మణోద్యమము ఈ విధముగా హిందూధర్మమును బ్రతిష్ఠించుచు, దేశమునకు ఘనమగు నుపకారము చేయుచున్నది. కావున నీ యుద్యమకారకులు మిక్కిలి గౌరవనీయులు, స్తవనీయులు.

ఈయుద్యమముయొక్క రెండవ ఫలితమగు బ్రాహ్మణుఁడు ఉద్యోగము సంపాదింపలేనివాఁడై యుండుటవలనగూడ హిందూధర్మము పునరుజ్జీవనము నొందుచున్నది. బ్రాహ్మణునికి నుద్యోగములు దొరకని యెడల నీతఁడు తన యుదర పోషణార్థమై యితర వ్యాపకములను

వెదుక నగత్యము కలవాఁడై యున్నాఁడు. ఈవ్యాపకములలో ప్రధానమైనవి వాణిజ్యవ్యవసాయములు. నాగరకతాసాంప్రదాయకమగు పట్టణవాసము చేయనీయక ఆరోగ్యదాయకమగు గ్రామసీమావాసము వృద్ధిచేయునది వ్యవసాయము. దానధర్మములకుఁ గల్పవృక్షము వ్యవసాయము. వేద, శాస్త్ర, శ్రౌత విద్యలభివృద్ధి యగునంతటి యవకాశము హిందువుల కిచ్చునది వ్యవసాయము. స్వాతంత్ర్యముయొక్క సుగంధము నాఘ్రాణింపఁ జేయునది వ్యవసాయము. నీటిబుగ్గను బోలు నాగరకత ప్రపంచమునకుఁ బ్రశస్తమగు బంటలను ప్రసాదించి దానిని బోషించునది వ్యవసాయము. హిందూధర్మయుక్తమగు స్నాన,సంధ్యావందనాదులు మొదలగు ఆచారములకుఁ జిరకాలమునుండియు నవకాశమిచ్చు వృత్తి వ్యవసాయము. హిందువులకు దార్ఢ్యవంతమైన క్షీర దధి ఘృతములు లభ్యమగునట్లు పశ్వాదులను బోషించునది వ్యవసాయము. దీర్ఘాయువునకుఁ బ్రధానమైన దేహదార్ఢ్యమును, నౌషధసేవ చేయకయే గల్గించునది వ్యవసాయము. హిందువులెల్లరకును హిందూధర్మయుక్తమైన వృత్తి వ్యవసాయము. అబ్రాహ్మణోద్యమువలన బ్రాహ్మణునకి నుద్యోగములు లభింపకున్నచో హిందూసాంప్రదాయ మీరీతిగా పునరుజ్జీవనము నొందుచున్నది.

అబ్రాహ్మణోద్యమమును ఆంగ్లవిద్యాభివృద్ధియు ప్రాచీన హిందూమహాధర్మమును గొంతవఱకీ రీతిగా ప్రతిష్ఠించుచున్నవి. ఈ ధర్మము నాచరించు హిందువులకు దీర్ఘాయువెట్లు సమకూరఁగలదో ధర్మమెంతవఱకుఁ బ్రబలుచున్నదో ఈరాఁబోవుపుటలు వ్యక్తపరచును.



శ్రీ

శుభమస్తు.

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## ప్రథమ భాగము.

### హిందువుల నిత్యకృత్యములు.

---

ఈశ్వరాంశసంభూతులగు ఋషిశ్రేష్ఠులు భరతవర్ష శీతోష్ణస్థితుల ననుసరించి ప్రాచీనకాలమునందే హిందువులకొరకై నిత్యకృత్యములను నిర్మించిరి. ఈనిత్యకృత్యములు ఇహమందు నారోగ్యదాయకములై యలరారుచు, పరమందు సకలసుఖములకును మార్గములై విలసిల్లుచున్నవి. ఈభాగమందీకృత్యములలో ప్రధానమైనవి చర్చింపఁబడియున్నవి. వీనియందలి కడపటిదగు నాయుష్కర్మముమాత్రమను దినము నాచరింపఁదగిన కృత్యము కాదు. ఇతరకృత్యములు అనుదినమును హిందువులాచరించరింపఁదగినవి కావున నవినిత్యకృత్యములనియు, నిత్యకర్మములనియు బిలువబడుటకుఁ గారణమైయున్నది. ఇందలి మొదటికృత్యమును, నాల్గవదియు స్త్రీపురుషులిరువురు నాచరింపఁదగినవి. మిగిలినవి పురుషులకొరకే నియమింపఁబడినది.

### 1. వేకువజామున లేచుట.

భారతీయులు రాత్రిపూట సుఖముగా నిద్రించి, పాన్పుపైనుండి మేల్కొనుసమయము వేకువజామని మనుయాజ్ఞవల్క్యస్మృతులును, మార్కండేయాదిపురాణములును, చెప్పుచున్నవి. ఈజామున గోడి కూయును. ఈకూత ఈజామున కానవాలగుటచేఁ దొల్లియర్ధరాత్ర

సమయంబున కుక్కుట వేషముఁదాల్చి కొక్కొరొకో యని మహేంద్రుఁడు ధ్వనిచేయుటతోడనే, అసమయమును వేకువజామని గౌతమ మునివర్యుఁడునమ్మె. ఈజామునందు వ్యవసాయదారుఁడు తనకుడిభుజముపై నాగలిఁబెట్టుకొని, యెడమచేతితోఁ బాలమునందుండు పశువుల క్షీరమును దెచ్చుటకై చెంబునుబట్టుకొని పొలమున కేగుచుండును. పగటిపూట ఘోరాటవియందు శయనించి రాత్రిపూట మానవులు విహరించు ప్రాంతములకేగిన వ్యాఘ్రము, కోడికూతనువిన్నతోడనే తాను రాత్రినుండియు దినుచున్న జంతుమాంసము నచ్చటనే మఱునాటిరాత్రియందు దినుటకై యుంచి, తనమునుగుస్థలమున కేతెంచు.

ఈజామునందు మేల్కొన్నయెడల మనస్సు అతినిర్మలముగా నుండును. రాత్రిపూటయందు శరీరమునకు నిద్రవలనగల్గు విశ్రాంతి వలన మనస్సుశాంతముగా నుండును. సుబుద్ధు లుదయించును. ఎట్టిపని యైనను బూనికతో నెరవేర్పఁగలయుత్సాహ మతిశయిల్లు, శరీరారోగ్య మొసఁగు ఏకాగ్రచిత్తమీసమయమందే కుదురును. ఈసమయమందీ హేతువుచే మానవులు పూనుకొను కార్యములెల్ల విజయమొందును కావున వేద, శాస్త్ర, శ్రౌత విద్యార్థులును నాంగ్లవిద్యాభ్యాసకులును నీసమయమందే మేల్కొనిచదివి కృతార్థత నొందుదురు. ఈజాము దాటినపిమ్మట మేల్కొనువారీ సుఫలితముల నొందజాలరు. సూర్యోదయానంతరము మేల్కొనువారికి నేకాగ్రచిత్తము కలుగుటకుఁ దగిన మనశ్శాంతి జంతుజాలముల ధ్వనివలన లభింపదు. తాపసోత్తములు ఈశ్వరధ్యానముచేయుటకు నిర్జనప్రదేశములగు విపినంబులకేగుటచే నిశ్చలమనస్సుకల్గును. మరియు, సూర్యోదయపూర్వము కొన్ని కొన్ని వస్తువులందు గొన్నిమహాశక్తు లుండుననియు, నివన్నియు భానుతేజస్సు వలన నాకర్షింపఁబడుటచే, భానూదయానంతర్మము మేల్కొను వారు



ఈశక్తులను గ్రహింపజాలనందున నారోగ్యము నొందజాలరనియు వైద్య శాస్త్రవేత్తలు వివరించుచున్నారు.

ఈజామునందు మేల్కొనినతక్షణమే గోవృష్ఠమునుగాని, తులసిచెట్టునుగాని జూచి నమస్కరించుటవలన దీర్ఘాయువు కల్గును. గోవుశరీరమందు విద్యుచ్ఛక్తివిశేషముగాగలదు. కావున నుదయమున లేచినతోడనే మానవులు దీనిని దర్శించుట విధియని హిందూధర్మము తెల్పుచున్నది. కాత్యాయనులవారు

"శ్రోత్రియం సుభగం గాంచ అగ్నిమగ్ని చితం తథా
ప్రాత రుత్థాయ యః పశ్యే దాపద్భ్యః స ప్రముచ్యతే।"

ప్రాతఃకాలమందు గోవును, జూచుటవలన శుభముగునని తెల్పుచున్నారు. గోవును నమస్కరించుటవలన దానియందలిమంచిశక్తులన్నియు, నమస్కరించువారు గ్రహింతురు. నమస్కరించుటవలన నాయుర్వృద్ధికరమని గౌతమసూత్రము పల్కుచున్నది.

"అభివాదనశీలస్య చత్వారి వర్ధంతే ప్రజ్ఞాయుర్యశోబలమితి"

ఆయుస్సు, బలము, యశస్సుకల్గునని భావము. గోవుశరీరమందుండు మహాశక్తి దానినినమస్కరించువారి ప్రేళ్లకొనలచేనాకర్షింపబడి, వీరి శరీరములోనికిఁ బ్రవహించుటచే వీరు తేజోవంతులగుదురు ఈతేజస్సు యొక్క ప్రభావమువలన నూతనబలమేర్పడి, ఆయుర్దాయము కల్గునని స్పష్టమగుచున్నది. కావున తేజోవంతులు, నమస్కారార్హులు. వారిని నమస్కరించువారు తేజస్సునుగ్రహింతురు. దీర్ఘాయువు నొందుదురు. పెద్దలను, తేజోవంతులగు బ్రాహ్మణులను, నమస్కరించుటకుఁగారణ మిదియే. గోవునునమస్కరించి, భారతీయులు దీనినిబూజించుటకు గారణమిదియే. ఈజంతువుత్రొక్కిన ప్రదేశమైశ్వర్యదాయకమని హిందువులు భావింతురు. దీనిశరీరమందుండు నిర్భేద్యమైన విద్యుచ్ఛక్తి వలనహిందువులు ప్రాయశ్చిత్తసమయమునగోదధి,క్షీర,ఘృత, గోమయ,

గోమూత్రములను స్వీకరించి, తేజోవంతులగుదురు. గోవుశరీరమందేగాక తులసిచెట్టునందుగూడ నిట్టిశక్తి కలదు కావున దానినిగూడ హిందువులనుదినమును బూజింతురు. పూర్వకాలపుహిందువులనుదినమును వేకువజామున లేచి గోవునునమస్కరించుచుండిరి; తేజోవంతులకు, నమస్కారముచేయుచుండిరి; కావున వారిని దీర్ఘాయురైశ్వర్యంబులు అంటియుండెను. ఆధునికభారతీయులు నమస్కారముయొక్క ప్రభావమును నాగరకతాదోషముచే గ్రహింపజాలక నమస్కరించుట నీచకార్యమనియెంచి వర్తించుటవలన నాయుర్భాగ్యవిహీనులై యున్నారు. మరియుఁ బాశ్చాత్య విద్యలనభ్యసించినహిందూయువకులు ఈజామునందు మేల్కొని గోవునుగాని తేజోవంతులగు పెద్దలనుగాని నమస్కరింపక దీర్ఘాయువులేనివారగుచున్నారు.

ఈజామునందు గోవును దర్శించినపిమ్మట సాధ్యమైనంతత్వరలో దంతములను శుభ్రపఱచుకొని ముఖప్రక్షాళన మాచరింపవలెను. జాగుచేయక దంతములను శుభ్రపఱచుచో, నోటియందున్న దుర్గంధముతోఁగూడిన మలినము శరీరములోనికిఁ బ్రవహింపనేరదు. ఆరోగ్యము చెడకుండును. పండ్లు తోముట కాలస్యముచేయుటవలన నీహేతువుచే ననారోగ్యము కల్గును. హిందువులనేకులు, సూర్యోదయానంతరము మేల్కొనిన చాలకాలమువఱకును దంతధావనముచేయు నలవాటులేనివారై, తేజోవిహీనులై, రోగములఁ జిక్కుచున్నారు. సూర్యోదయానంతరము దంతధావనము చేయుఅలవాటు కలవారికిఁ గుష్ఠరోగము ప్రాప్తించునని పురాణములు పలుకుచున్నవి. దంతధావనమునకుఁ బండ్లపొడినుపయోగించుట నాగరకతాదోషము. తుమ్మపుల్లనుపయోగించిన యెడల నాఱునెలలనుండి సంపాదించిన పుణ్యము నశించునని పురాణములు వివరించుచున్నవి. కానుగపుల్లనుపయోగించుట వలన



పైత్యమణఁగి, పండ్లుగట్టిపడును. చీము,రక్తము, కారుటకట్టును. జువ్విపుల్లబుద్ధిని వికశింపఁజేసి వీర్యవృద్ధినిచ్చునని యు, వేపపుల్లపైత్యమును, శీఘ్రకాలములో విరుచునని యు, ఉత్తరేణి జ్ఞానమును వృద్ధిపఱచి వీర్యనష్టమును దెచ్చునని యు, నాయుర్వేద మెఱిఁగించుచున్నది.

దంతధావనానంతరము నిర్మలప్రదేశమునకుఁజని పరిశుభ్రవాయువున్న విశాలమగు బహిరంగ ప్రదేశమందు మలవిసర్జన మొనరింపవలెను. మలయమారుతము వీచుబయళ్లయందు మలవిసర్జన మొనరించువారే సుఖము ననుభవింతురు. ఆసమయమునందు దేహమునుండి కల్మషపదార్థములు తొలగిపోవును, శరీరము చులకనగును. ఉత్సాహము కల్గును. యుక్తకాలమందు మలమూత్రవిసర్జనము చేయుటవలన రక్తపిత్తము, కఫము మొదలగునవి హరించును. మేహశ్లేష్మములు విఱుగును. రక్తము చురుకుగాఁ బ్రవహించును. జఠరము చక్కగా ప్రకాశించును. సుఖవిరేచనము కానివారికి దేహమందు ఉత్సాహము చెడి రోగము లంకురించి, దీర్ఘాయువు చెడును. మలమూత్రవిసర్జనమున కనుమానము కల్గినవెంటనే నిర్మలప్రదేశమందు నొనరించుట కర్తవ్యము. జాగుచేయువారికి ననారోగ్యము సంభవించును. ప్రాచీనకాలమునుండియు, హిందువులు గ్రామములందు వసించుచు, వేకువజామున మేల్కొనుచు, బహిరంగములగుమైదానములకేగి,యుక్తకాలములందీకృత్యముల నాచరించుచు, దీర్ఘాయువు నొందుచుండిరి.

౨. అరుణోదయస్నానము.

హిందువులు అరుణోదయకాలమందు దంతధావనాదులాచరించిన వెంటనే స్నానముచేయుట ప్రాచీనాచారమైయున్నది. ఈస్నానము ద్విజుల పవిత్రతకును శుచిత్వమునకును, తేజస్సునకును బరమరహస్యము. ఉష్ణదేశీయులై, రవియొక్క మహోగ్రమైన వేడిమికి లోఁబడియుండు భారతీయులకు నఖండశైత్యోపచారము. హిందువు

లకు బల, లావణ్యముల నొసఁగుటకు మూలకారణము. ఈస్నానము చిరకాలమునుండియు హిందువులకైశ్వర్యదాయకము, ఆరోగ్యదాయకమునై యున్నది. మను, యాజ్ఞవల్క్యాదిస్మృతులును, పురాణములును నీస్నానమైశ్వర్య, ఆరోగ్యములను హిందువులకొసఁగు నిత్యకృత్యమని వివరించియున్నవి.

ఆరోగ్యమును గల్గించుటవలన, నరుణోదయస్నానము హిందువులకు దీర్ఘాయువునిచ్చు దివ్యసాధనమైయున్నది. ఈస్నానము సూర్యోదయపూర్వమాచరించుటవలన, ఉదకము పవిత్రమైన శక్తులతోఁగూడియుండుననియు నవన్నియు శరీరమువలన గ్రహింపబడుననియు నందువలన శరీరము ప్రకాశమానమైయుండుననియు, సూర్యోదయానంతర మీశక్తులు, ఉదకమునుండి తొలగిపోవుననియు, అరుణోదయస్నానమాచరించు హిందువులే వీని ఫలితముల నొంది తేజోవంతులగుదురనియు నాయుర్వేదము వివరించుచున్నది. మరియు నీస్నానము చేయు భారతీయుల శరీరమందలి రక్తము సమశీతలత్వము కలదై, చక్కఁగా బ్రవహించును. దానియందుండు దోషములు హరించును. రక్తమిందువలన శుభ్రపడును. నూతనబలమేర్పడును, రోగములు కలుగనేరవు. ఇతియగాక నీస్నానము చేయుటవలన శరీరమందుండు చెమ్మట, మలినము మొదలైనవి పూర్ణముగా తొలగిపోవును. చర్మరోగములు శరీరమునుండి పరువిడును. శీతలోదకస్నాన మరుణోదయమందుఁ జేయు దీక్షాపరుల శరీరములనుండి మేహ, కుష్ఠు, పాండు, ఉబ్బు, క్షయ, శ్లేష్మరోగాదులు అంతరించును. నేత్ర, కర్ణ, దంత శిరోరోగములు నిర్మూలమగును. శరీరమీరీతిగా నీస్నానముయొక్క మహిమవలన నీరోగమైయుండి చులకఁబడి, బింకముగలదై తేజోవికాసములతో నొప్పారు. దేహమంతయు మితమగు గాలితోఁ గూడియుండుటచే బలహీనులుసహితము అరుణోదయస్నాన ప్రభావముచే, కండపుష్టికలవారై ప్రకాశింతురు మాఘ



కార్తికమాసములందీస్నానము చేయు భారతీయులకు గతించిన వర్షకాలమందుఁగల్గిన అనారోగ్యము జయింపఁబడి, రాఁబోవు వేసవికాలమందు సోకు వేడిమియొక్క ఉగ్రత నెదుర్కొనుటకుఁ దగినసామర్థ్యము శరీరమందేర్పడును. అరుణోదయస్నాన మీవిధముగా దీర్ఘాయువునకు రాచబాటయైయున్నది.

ఈసదాచారమువలన భారతీయులకు సద్వర్తనమేర్పడి, దీర్ఘాయువు సమకూరును. ఈస్నానానంతరము శరీరము నిర్మలముగానుండును. సూర్యోదయకాలమునకు మనస్సు ఉత్సాహపూరితమై యతిశయిల్లుచుండును. ధైర్యస్థైర్యము లుదయించును. బుద్ధి వికసించును. నిర్మలచిత్తమును, దృఢమైన పూనికయుఁ బట్టుపడును. క్రోధ, కల్మషములు కడుదూరమైయుండును. ధర్మము, శాంతము, సత్యము మొదలగు సద్గుణములతో మనస్సు ప్రకాశించును. పురుషుఁడు ఈస్నానప్రభావముచే దయార్ద్రహృదయుఁడై సన్మార్గవర్తియై విలసిల్లును. ఇట్టిసదాశివతేజుని దీర్ఘాయువాశ్రయించి యుండును.

ప్రతిదినమును నరుణోదయస్నాన మాచరించు భారతీయోత్తములకు నైశ్వర్యము కలుగును. ఈస్నానము సోమరితనమును దునిమివేయును. ఈస్నానమాచరించుటవలన సూర్యోదయమగువేళకు భారతీయులు కార్యదీక్షయందుఁ బాల్గొనసంసిద్ధులైయుండగలరు. మానవుఁడు కార్యములను నెరవేర్చుటకుఁ దగినదృఢచిత్తము ఆసమయమందు గల్గును. ఉత్సాహముపుట్టును. మరియు, నరుణోదయస్నానకాలమందు రవికర్ఘ్యమిచ్చుట హిందువుల ప్రాచీనాచారము. అరుణోదయకాలమందిట్లర్ఘ్యమిచ్చువానికి సర్వశత్రునాశనమగుననియు నట్టిపురుషుని జయించుట దుస్తరమనియు హిందూధర్మము విశదీకరించుచున్నది. శ్రీమద్రామాయణము గొప్పదృష్టాంతము నిచ్చుచున్నది. రాక్షసరాజును, సోమయాజియునగు రావణాసురుఁడు, ఈరీతిగా సూర్యోదయ

పూర్వము అనుదినమును సప్తసముద్రములకేగి రవికర్ఘ్యమిచ్చు వాడు కతోనుండెను. అరుణోదయస్నానార్ఘ్యముల ప్రభావముచే బవిత్రత నొందిన రావణాసురుని, అహీనబలపరాక్రమశాలియు, అస్త్ర శస్త్ర విద్యాధురీణుండును, అవతారమూర్తియునగు శ్రీరామచంద్రుండు సహితము తనకు నగస్త్యునివలన నాదిత్యహృదయోపదేశంబును, విభీషణునివలన దశకంఠప్రాణ మర్మోపదేశంబును గల్గునంతను, యుద్ధము నందు జయింపలేకపోయెను. అరుణోదయస్నానము భారతీయులకు నైశ్వర్యము నొసంగును గావున బవిత్రతతో గూడిన కార్యములందు విజయము నొందగోరువారేని వానియందు నీమహాప్రభావముగల నరుణోదయ స్నానమాచరించు దీక్షాపరులు పాల్గొనుట అవశ్యమైయున్నది.

ఈస్నానమునకై హిందువులాచరింపఁదగిన విధానములు లనేకములు కలవు. నిర్మలోదకమునందే ఈస్నానమాచరింపవలెను. ప్రవాహోదకము శ్రేష్ఠతరము తటాకములందలి ఉదకము సామాన్యము కూపములందలి ఉదకము అధమమని ఆయుర్వేదవిద్వాంసుల అభిప్రాయము. ఈస్నానమాచరించుటకుఁ బూర్వము శరీరమునకుఁ జమురునుబూయుట ప్రశస్తము. అట్లుచేయువారి శరీరములోనికి జలము రోమకూపముల నుండి ప్రవేశింపనేరదు. శరీరమందలిమలినము సులభముగా తొలగి పోవును. దేహమిందువలన మృదువుగానుండును. శరీరమునుండి మలినము పోవునని యెంచి నాగరకతాసాంప్రదాయకములైన సబ్బుబిళ్లల నుపయోగింపరాదనియు, అందువలన, శరీరము బీటలువారుననియు, భారతీయులు, గరుకుగానుండు పెసరపిండిగాని పులవపిండిగాని నుపయోగించుట శ్రేష్ఠమనియు, నారోగ్యసుఖములకు మూలమనియు నాయుర్వేదపండితులు వచింతురు. ఈస్నానము సూర్యోదయపూర్వమే ముగియుట ప్రశస్తము. సూర్యోదయానంతర మీస్నానము పైఫలితముల నీయజాలదు.



పూర్వకాలపు హిందువులు అరుణోదయస్నానముచేయు దీక్షాపరులై యుండుటవలన వారు దీర్ఘాయురైశ్వర్యముల నొందుచుండిరి. ఆధునికకాలమందు భారతీయులీదివ్యమైన సదాచారమును యథావిధిగా నొనరింపనందున వీరికల్పాయుష్యము కల్గుచున్నది. దుష్టసంతతి ప్రాప్తించుచున్నది. సకలైశ్వర్యములును నశించుచున్నవి. ద్విజులపవిత్రతనాశనమగుచున్నది. దేశీయుల నవజాతమరణము మెండగుచున్నది. భరతవర్షమున పాడిపంటలు నశించుచున్నవి. బ్రహ్మద్వేష మంకురించుటవలన, బ్రాహ్మణుల కన్నోదకములు లేకున్నవి.

భరతవర్షమునకు భూషణమైన గంగానదీతీరస్థులును గోదావరి, కావేరి, తామ్రపర్ణి మొదలగు నదుల సమీపమందున్న పుణ్యపురుషులును, ఆంధ్రమండలముల "కోనసీమ"ను పావనముచేయుచున్న కౌశికానదీతీరస్థులునగు ద్విజులచ్చట ప్రాతస్స్నానముచేయుచున్నారు. వైనతేయాతీరస్థులైన ముంజవరమందు వర్థిల్లుచున్న వైశ్యులిప్పటికినినరుణోదయస్నానముచేయు దీక్షాపరులై వెలుంగుచున్నందున హిందూధర్మము ఈవిషయమున నింతవఱకుమాత్రమే ఆచరణమందున్నది.

౩. గోమయభస్మధారణము.

అరుణోదయస్నానానంతరము ద్విజులు గోమయభస్మమును దాల్చు టవసరమని గౌతమసూత్రము వివరించుచున్నది. పూర్వాచారపుహిందువు లిప్పటికిని స్నానానంతర మీభస్మమును ధరింతురు. వర్తమానకాలమందు హిందువు లీభస్మము ధరించినవారిని జూచి పరిహసించు దురాచారముతోనున్నందున వారి అల్పాయువునకును, దారిద్ర్యమునకును గారణమైయున్నది. ఈభస్మధారణమును గూర్చి "భస్మోపనిషత్తు" నందు విపులముగా దెలుపఁబడియున్నది.

గోవుశరీరమునందుండు విద్యుచ్ఛక్తియొక్క ప్రభావముచే నీగోమయభస్మముకూడ పవిత్రతతో గూడియున్నది. ఈజంతువు

యొక్క శరీరము విద్యుచ్ఛక్తికి నిలయమని యిదివరకే దెల్పియుంటిమి. ఈమహాశక్తి గోవుశరీరమునుండి లభించు గోమయ, గోమూత్ర, గోదధి, ఘృతక్షీరములందు గూడ చేరియుండును. ఈశక్తి అంటురోగపుపురుగులను, అణువులను, నశింపజేయును. రోగులు వసించు గృహములను గోమయముతో నలుకుటచే నంటురోగములు వ్యాప్తి నొందవు. అంటుకడినప్రదేశము నలుకునపుడును, ఇల్లలుకునపుడును హిందూవనితలు గోమయ ముపయోగించుటవలన, దీనియందుండు విద్యుచ్ఛక్తివలన నాయాప్రదేశములు పరిశుభ్రముగా నుండి, ఆరోగ్యమునకు స్థానములగును. గోమయము జలమందుఁగలిపి వీధియందు జల్లుటచే నచ్చటివిషము లీమహాశక్తివలన జయింపఁబడును. ద్విజులు అపవిత్రతనొందినపుడును, వర్ణభ్రష్టత్వము నొందినపుడును, తేజోబలమును నష్టపోవుదురు. దీనిని గ్రహించుట కేర్పడిన కర్మప్రాయశ్చిత్తము ఈప్రాయశ్చిత్తము జరుగువేళ గోమయ, గోదధి, క్షీరాదులు వయోగింపఁబడును. వీనియందుండు విద్యుచ్ఛక్తి అట్టి వర్ణభ్రష్టత్వము నొంది పవిత్రులుగాగోరువారికి దేజోబలము నిచ్చును. ద్విజుల కీభస్మము అత్యవసరమై యున్నది.

స్నానానంతరము గోమయభస్మమును ధరించువారికి నుత్సాహముకలిగి దీర్ఘాయువు లభించును. స్నానానంతరము శరీరము శీతలముగా నుండును. శీతకాలమందిచలి విశేషముగా బ్రబలును. విద్యుచ్ఛక్తికి వేడిమినిచ్చు స్వభావముకలదు గావున గోమయభస్మము శరీరమునకు వేడిమినిచ్చును గావున స్నానానంతరము చలితోగూడియుండువారు ఈభస్మమును దాల్చినచో వారికి వేడి కలిగి, చలి తగ్గును. రక్తము చురుకుగా బ్రవహించును. ఉత్సాహము కలుగును. దార్ఢ్యమేర్పడును. దేహమందు, చిడుము, దురదలు, చర్మరోగములు మొదలైనవి చేరఁబడనేరవు. శరీరమునకుసోకు విషవాయువు నిర్మలమై



పోవును. బలహీనులును, కురూపులును, ఈభస్మమును దాల్చినయెడల, వారికి దార్ఢ్యముకలుగును. తేజోవికాసముతో శరీర మలరారుచుండును. ఉత్సాహము జనించును. దీర్ఘాయువు కరస్థమగును.

సంసారవంతులగు పురుషులు గోమయభస్మధారణచే ననేక సుఫలితములనొంది, దీర్ఘాయువుతోఁ బ్రకాశింతురు. ఈభస్మమునందుండు విద్యుచ్ఛక్తి శరీరమందు బ్రవేశించినచో ద్విజులు బ్రహ్మవర్చస్సుతోఁ గూడియుందురు. ఈవర్చస్సు ప్రతిరోమకూపమందు బ్రవేశించుటచేఁ బురుషుడు మన్మథుని మించిన లావణ్యవంతుఁడగును. నాతనికి సహజమగు లావణ్యము పూజ్యమైయున్నను, భస్మధారణజనితమైన మహాతేజస్సువలన నాతనిభార్యకు వానియం దనురాగముకల్గును. అనుకూలదాంపత్యము వారిర్వురకును గుదురును. వారందువలన గుటుంబసౌఖ్యముల ననుభవించుచు, నిరంతరోత్సాహవంతులై, దీర్ఘాయురైశ్వర్యసుసంతానములతో వర్ధిల్లుదురు. మరియు, పురుషునికిఁ దగిన బలమున్నచో నాతనికి మితమగు సంభోగవాంఛయే యుండుననియును, నందువలన దీర్ఘాయుర్లాభము కలుగుననియు నాయుర్వేద శాస్త్రజ్ఞులు తెల్పుదురు. మరియు సంసారవంతులగు పురుషులు స్త్రీసాంగత్యమువలన బలమును గోల్పోవుచుందురు గోమయభస్మధారణమును దినమును దీక్షతోఁ జేయుటవలన ననుదినమును బల మధికముగుచుండును గాన సంసారవంతులగు పురుషులకు స్త్రీసాంగత్యజనితముగు బలహీనత జయింపఁబడును. వారందుచే దార్ఢ్యమును రక్షించుకొనుచు దీర్ఘాయువు నొందుదురు.

గోమయభస్మధారణమువలన హిందువులకు భూతప్రేతపిశాచాదులవలన గల్గు భీతి నశించుటవలన నారోగ్యముకల్గి, దీర్ఘాయువు లభ్యమగును. ఈభస్మమందుండు విద్యుచ్ఛక్తి రక్తమునకు బలమిచ్చి, ధైర్యస్థైర్యములను బ్రసాదించును. మరియు నీభస్మము దేవతాప్రీతికర

మును రాక్షసాదులకు భీతికరమునై యొప్పారుచున్నది. దీనిని ధరించి నతోడనే దేవతాకృప కల్గును. వారిహాని శరీరమును దాండవ మాడుచుండును. భూతప్రేతపిశాచాదులు దేవతలుండు తావులను వదలి పోవుటకు యత్నించును. కావున పసిపిల్లలకు నీభస్మమును మంత్రించి వారి ఫాలమందు బెట్టుటవలన దుస్స్వప్నములు కలుగనేరవు. బాలు రకు దృష్టిదోషమును గూడ ఈభస్మధారణము పోగొట్టును. దీనిని దీక్షతో నుపయోగించు హిందువులు, నిశీథమం దెంతదూరమైనను బయ నమై యొంటరిగా బోగలరు. భస్మధారణ మీరీతులచే ధైర్యమును కల్గించి, ఆరోగ్యమును గాపాడుటచే దీర్ఘాయుర్లాభము నొందవీలగును.

గోమయభస్మధారణము బుద్ధిబలమొసంగు సదాచారము. ఇం దలి మహాశక్తివలన రక్తము శుద్ధపడును. దేహమునకు నిర్మలత్వ ము కల్గును. మెదడు, బుద్ధికి నిలయమై యున్నది. ఇచ్చటనుండు నిర్మ లమైన రక్తమువలన నిర్మలచిత్తము కుదురును. అందువలన నాలోచనా శక్తి చక్కగా బ్రసరించును. చిరకాలమునుండియు భస్మధారణము చేయువారి సంతతియగుటచే నీకాలమందు సహితము ద్విజులు సాధార ణముగా కుశాగ్రబుద్ధియుతులై ప్రకాశించుచున్నారు.

ఈభస్మము ధరించుటవలన వశీకరణశక్తి కల్గుటచే దీర్ఘాయువు లభించును. ఈభస్మమును ధరించిన హిందువులు, పూర్వకాలమందు వర్ధిల్లి ఖ్యాతిగాంచి భస్మధారణము గావించుచుండిన శ్రీ శంకరాచా ర్యులు, వశిష్ఠనారదాదులు మొదలగు పుణ్యాత్ములను, సాంబమూర్తిని, భస్మము ధరించిన పితృ, పితామహులను స్మరణకు దెత్తురు. ఇందు వలన భస్మము ధరించిన వారు, దేవ, గురు, పితృభక్తుల నుదయింపఁ జేయుచు, గౌరవింపఁబడుదురు. ఇందువలన వీరు పూనుకొను కార్యము లం దెవరును దిరస్కారభావమును జూపరు. వీరికి జనవశీకరణ మీరీ తిగా కల్గుటచే నుత్సాహవంతులై దీర్ఘాయువు నొందుదురు.



ఈఫలితముల నొందగోరువారు స్వచ్ఛమగు గోమయభస్మ మును ధరించు టావశ్యకము. సాధారణముగా బజారునందులభించు విభూతిపండ్లు నుపయోగించుట పెక్కండ్రహిందువు లాచారమైయున్న ది. ఈవిభూతిపండ్లు సుద్ద, గంజి మొదలగుపదార్థములతో గూడి యుం డును. కావున నీవిభూతిపండ్ల నుపయోగించి భస్మధారణము చేయు చుంటిమని సంతసించుట నిష్ప్రయోజనము. క్రతువు లొనరించి, అను దినము నగ్నిహోత్రకర్మల నాచరించుచుండు, శ్రోత్రియశిఖామణుల వేదికలయొద్ద లభించుభస్మమే శ్రేష్ఠతరమైన గోమయభస్మము. మరి యు, హిందూగృహస్థులు, గోవులకు మలినపదార్థములు ఆహారముగా బెట్టక, స్వచ్ఛముగ మేతవేయుచు, దానిపేడను భూమికి వ్రాలకుండు నట్లు గ్రహించి, భస్మము గావించి, దానిని ధరించుటకూడ ప్రశస్తమే అని ధర్మసూత్రము వివరించుచున్నది.

ఈకాలమున హిందూధర్మమున నభిమాన ముదయింపకమున్ను బాలగంగాధరతిలకు మొదలగ ధర్మశాస్త్రవేత్తలు హిందూధర్మాధిక్య మును దేశీయులకువిశదీకరింపకపూర్వము అబ్రాహ్మణోద్యమము చెన్నరా జధానియందు బ్రతిష్ఠింపఁబడని క్రిందట, విభూతి ధరించువారిని జూచి, పాశ్చాత్యనాగరకతాభ్యాసదోషముచే హిందూధర్మమర్మవిషయమున మూఢులైనహిందువులు పరిహసించుచుండిరి. పలుచోట్ల బ్రాహ్మణు లును, తదితరులును గోమయభస్మధారణముచేయుచు, హిందూసాంప్ర దాయికములగు ఆచారముల ప్రతిష్ఠాపనకుఁ దోడ్పడుచున్నారు.

## —* 4. వస్త్ర ధారణ విధానము. *—

హిందూధర్మయుక్తమైన వస్త్రధారణమగు "పంచెకట్టు"ను బురుషులు ధరించుటవలన వారికి దీర్ఘాయువు కల్గును. ఈవిధమైన వస్త్ర ధారణమందు బట్టయొక్క నాలుగు కొంగులును శరీరము నంటియుం డ నట్లు ముడువబడియుండి, ఐదుచోట్ల బంధము లుండును. అయిదు

బంధములును, పంచకచ్ఛములనియు, నందువలన నీవిధమైన వస్త్రధారణము పంచెకట్టు అనియు పేరొందియున్నది. ఈవిధమైన వస్త్రధారణముతో నుండుట ప్రాచీనహిందువులకేగాక నారద, వశిష్ఠ, విశ్వామిత్రాది ఋషిపుంగవులకును, శ్రీరామ, శ్రీకృష్ణ, పరమేశ్వరాది దేవస్వరూపులకును నాచారమై యున్నది. హిందూజనులుకూడ వస్త్రధారణము గావించునపుడు కొంగులన్నియు శరీరము నంటి యుండునట్లే ధరించుట ప్రాచీనాచారమై యున్నది. వస్త్రము శరీరము నంటియుండునపుడు దేహమందు ప్రవహించుచుండు మహాశక్తులు వస్త్రముల కొసలనుండి ప్రవహించి వ్యర్థము కాకుండుటకై కొంగులను శరీరము నంటియుండునట్లు వస్త్రధారణముచేయుట ఆచారమైయున్నది. కొంగులను ముడువక యుండునట్లుగా వస్త్రమును ధరించువారి శరీరమునుండి మహాశక్తులు నశించుటవలనను బాటపైబడి పోవునప్పుడు కల్మషములంటుకొని అంటురోగోత్పత్తి కవకాశము కల్గుటవలనను అల్పాయువు ప్రాప్తించును. కావున "ఓరగోచులు" పెట్టుకొను ఆధునిక హిందువులకు, దీర్ఘాయువుకలుగుట దుర్ఘటము.

మరియు, శాస్త్రోక్తమైన వస్త్రధారణము చేయుటవలన, వశీకరణశక్తి కలిగి హిందూ స్త్రీ, పురుషులు దీర్ఘాయువు నొందుదురు. వారు జానకి, రుక్మిణి, పార్వతి, శ్రీరాముడు శ్రీకృష్ణుడు నారదాదులు మొదలగువారిని జ్ఞప్తికి దెత్తురు. గౌరవమును బుట్టింతురు. వారికి, దిరస్కారభావముగా నుండువారిని గూడ ఈగౌరవమువలన వశపరచుకొని తమకార్యములను నెరవేర్చుకొనుచు, నుత్సాహముతో గూడియుండి, దీర్ఘాయువు నొందుదురు.

నాగరకతాజనితములగు "పంటలూను" 'జాకెట్టు' మొదలగు వానిని హిందువులుపయోగించినచో, దమ మతవిరుద్ధమైన సాంప్రదాయమునం దభిమానము పుట్టును. ఇదినాస్తికత్వము నలవడ జేయు



ను. దురాచార దుష్టసాంగత్యములు కలుగుట కవకాశ మేర్పడి, దీర్ఘాయువు నొందవీలుకలుగదు.

హిందువులు గూడకట్టు ధరించుట అశాస్త్రీయము. ఈవిధమగు వస్త్రధారణము కర్మలొనరించుట కధికార మీయదని ధర్మము చెప్పుచున్నది. కౌపీనము ధరించి, దానిపైన వస్త్రధారణము చేయుట ప్రశస్తము. స్త్రీలకు గూడకట్టువలన వ్రతములందును, శుభకార్యములందును బాల్గొను నధికారము కలుగదు. కావున తొల్లి శ్రీశంకరాచార్యులువారు గూడకట్టుతో నుండు ఘూర్జరస్త్రీల (Guzerati ladies). వంటకములకు బవిత్రత లేదని చెప్పి, వారిని వెలివెట్టినారు.

శ్వేతవస్త్రమును ధరించు హిందువు లాయుర్వృద్ధినొందుదురు. ఈవస్త్రముయొక్క ధావళ్యము చెడునని, దీనిధరించువారు, జాగరూకులై యుండి కల్మషశరీరములతో నుండువారి నంటరు. అంటుదోషపు బురుగు లుండుచోట గూర్చుండనోపరు. వీరు నిర్మలశరీరముతో గూడి యుండి ఉత్సాహవంతులై దీర్ఘాయువు నొందుదురు.

పరిశుభ్రమైన వస్త్రములు ధరించుటవలన హిందువుల కారోగ్యమును, దీర్ఘాయువును గరస్థము లగును. ఇందువలన నిరంతరము నొకేవస్త్రమును ధరించుటయు, నెరులు గట్టిన బట్టను గట్టుటయు, దమవస్త్రము నొరుల కిచ్చుటయు మొదలగు ఆచారములను వర్జింపవలెను. హిందువులు పట్టుబట్టను ధరించుటయు, దానినే గృహమందు స్త్రీలు కూడ ధరించుచుండుటయు, నతిథుల కిచ్చుచుండుటయు, గ్రామాంతరముల కేగినపుడు నొరుల పట్టుబట్టను ధరించుటయు, నంటుజాడ్యములకు మూలకారణములు. నిర్మలవస్త్రధారణము దోషరహితమై యొప్పారు. ఉత్సాహము నిచ్చి సుబుద్ధు లుదయింపజేయుట వలన నయ్యది దీర్ఘాయుర్దాయసాధనము. వేదశాస్త్ర శ్రౌతపండితు లీరీతిగా వర్తించుచు, దీర్ఘాయుర్లాభము నొందుచుందురు.

## —* 5. ప్రాణాయామము. *—

ప్రాచీన కాలమునుండియు భారతీయులకుఁ బ్రాణాయామము ఇహపర సుఖముల నొసఁగుచున్నది. ఇది ఇహమందు హిందువుల కారోగ్యదాయకము. వారి కిది తపస్సిద్ధివలన లభించు మోక్షపదవికి రాచబాట. భరతవర్షయశస్కరులగు ఋషిశ్రేణ్యు లందరు నీవిద్య యందుఁ బ్రవీణులై యుండిరి. "యోగాభ్యాస" మీ విద్యను గూర్చి విపులముగా దెల్పుచున్నది.

ఈ మహావిద్యవలన హిందువులు దీర్ఘాయుర్మహాలాభము నొందుదురు. ఈవిద్యయొక్క రహస్యము శ్వాసను వశపఱచుకొని దానిని దీర్ఘకాలముపఱకు నాపుటయందున్నది. మానవులెల్లరును, ఊపిరిపీల్చుచు, విడుచుచుందురు. బలహీనులు నిముసమున కనేక సారులు ఊపిరిని విడుతురు. బలవంతులు నిముసమునకుఁ గొలదిసారులే ఉపిరిని విడుతురు. కొందఱు నాలుగైదుసారులు ఊపిరివిడుచుచుండగా మఱికొందఱు ఒకసారే విడుతురు. మొదటివారి కొక నిముసమైనచో, రెండవవారికి నిముసములో నాల్గవవంతు కాలమే అగును. ఈరీతిగా దీర్ఘకాలము శ్వాసను బంధించి, విడుచువారు దీర్ఘకాలము జీవింతురు. స్వల్పకాలములోనే ఊపిరి ననేక సారులు విడుచువారు చిరకాలజీవులు కాజాలరు. ప్రాణాయామ మభ్యసించిన వారందఱును దీర్ఘకాలము శ్వాసను బంధింపఁగలరు; విశేషకాలముపఱకును ఊపిరిని బీల్చునవసరము లేనివారై యుందురు; దీర్ఘాయువు నొందుదురు.

ప్రాణాయామము నభ్యసించువారు శ్వాసను నాశికనుండి క్రమక్రమముగా బీల్తురు. ఇది పూరక మనబడును. ఈశ్వాస వెంటనే విడువఁబడక, సాధ్యమైనంతటి కాలము బంధింపఁబడును. ఇది కుంభక మనఁబడును. కొంత కాలమైన పిమ్మట శ్వాస క్రమక్రమముగా విడువఁబడును. ఇది రేచక మనఁబడును. ఇట్లు చేయుటవలన శ్వాసకోశములు శుభ్రపడును. రక్తము చురుకుగాఁ బ్రవహించును. అందలి దోషము లన్నియు హరించుటవలన సకలరోగములును జయింపఁబడును. ఈవిద్యయందారితేరిన ఋషిపుంగవులు విపినంబులందు గ్రుమ్మరుచు నీరోగులై యుండగలరు. వారికి ప్రాణాయామము ప్రాణమిత్రము. వజ్రకవచము. వారికిని తదితర మానవులకును ముఖ్యభేదము. శాస్త్రోక్తముగా బ్రాణాయామ మభ్యసించువారు పాండు, కుష్ఠు క్షయము, ఉబ్బు, గుల్మాది రోగములను జయింతురు. దీనినాచరించుటకు పూర్వము "యోగాభ్యాసము"ను జక్కగా జదివి, గురువునొద్ద నుపదేశము నొందుట ప్రధానము.

ప్రాణాయామము పట్టుకాలమందు కౌపీనధారణ మత్యావసరము. పంజీ అయినను, జట్టీ అయినను బిగువఁబడు ఈకౌపీనము, ఏడు మూరలు పొడవుగల ముతకగుడ్డ. దీనిని నడుముచుట్టును ద్రిప్పి, బీజములణగునట్లు కట్టుటవసరము. ఇట్లుచేయుటవలన, ఏనుగుబల ముదయించును. బీజములు జారనేరవు. శరీరము చులకనగును. నడకయందు లక్ష్యముండదు. రక్తము గట్టిపడును. వరిబీజపు నొప్పులు తొలగిపోవును. ప్రాణాయామ కాలమందు బీజములు రక్షింపఁబడును.

హిందువులు జపాదు లొనరించు వేళలందు స్థిరబుద్ధితో నుండుట ముఖ్యము. మనశ్చాంచల్యమువలన స్థిరబుద్ధి కలుగనేరదు. ప్రాణాయామము స్థిరబుద్ధిని గుదుర్చు దివ్యాస్త్రము. యోగీశ్వరులు ప్రాణాయామవిద్యవలనే తపస్సునందు విజయము నొందుదురు. గాయత్రీ జపముచేయు హిందువులెల్లరకు నీయభ్యాస మవసరము.

ఈదివ్యమగు విద్య వర్తమానకాలమున నాంధ్రమండలమున నూతనబలముతో వర్ధిల్లునట్లు ఆంగ్లవిద్యాపరిపూర్ణులై, ఖ్యాతిగాంచిన శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు హేతుభూతులైరి. ప్రాచీన హిందూధర్మాభిమానులగు వీరు, గాఢమైనసలిలంబుచే బావనమగు

చున్న రాజమహేంద్రవర వాస్తవ్యులై యిచ్చట 1903 వ సంవత్సరమున "హిందూసమాజము" ను నెలకొల్పిరి. ఈసమాజమునకు విశేషధన మొసంగిరి. ప్రస్తుత మీసమాజము విశేషాభివృద్ధిలో నున్నది. ఈపురమునను్న దొరతనమువారి కళాశాలయందుఁ జిరకాలము వ్యాయామోపాధ్యాయులుగాను నుండి, ప్రాణాయామాదివిద్యలను నేర్పుచున్న ఏలూరి శ్రీరామచంద్రరావుగారికి నీసమాజమువారు తగిన ప్రోత్సాహము నిచ్చుచున్నారు. ఈగ్రంథముయొక్క షష్ఠభాగమున వివరింపఁబడిన సదాచారముల నభివృద్ధిచేయు భారము ఈసమాజము వారు వహించి ఇప్పుడైరోపాఖండవాసులు మున్నగువారు చేయునట్లు ఆంధ్రదేశమం దెల్లెడల మతప్రచారము గావించి హిందూధర్మపునరుద్ధారణ మొనరింతురుగాక. భారతజాతీయవిద్యాభిమానులై నీసమాజస్థాపకులైన శ్రీ సుబ్బారావు పంతులుగారికిఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయువొసంగుగాక.

## —* 6 భగవత్ప్రార్థన *—

భారతీయులెల్లరు ననుదినమును దయామయుఁడగు భగవంతుని ధ్యానించి, మనఃపూర్వకముగ నమస్కరింపవలెను. ఈదేవప్రార్థన నొనరించుటకై హిందువులు నిర్మలదేహములతో నిశ్చలచిత్తముతో నుండుటవసరము. ఈభగవత్ప్రార్థన భారతీయులెల్లరకును ముఖ్యమైనను, ద్విజులందఱకు ప్రత్యేకమైన రీతిగా దీని నాచరింతురు. వీరొనరించు దేవధ్యానము సంధ్యావందనము తదితరులనుదినమును భగవంతుని ప్రార్థింపవలెను.

## —* సంధ్యావందనము. *—

ప్రాచీనకాలమునుండియు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులనుదినమును పాపవిమోచనమునకై త్రికాలములందును నాచరించు కర్మ సంధ్యావందనము. ఇది ద్విజులనిత్యకర్మ. భగవద్ధ్యానపూరితమైన పూట



పూట ప్రాయశ్చిత్తము. సకలైశ్వర్యములకును గల్పవృక్షము. కష్టములను, దునిమి, దీర్ఘాయువొసంగు ప్రత్యక్షదర్శనము. పరలోకసుఖములకు మూలమైన మోక్షపదవి నొసంగుటకు సూక్ష్మమార్గము క్రతువులకన్నను మిన్నయగు దివ్యయోగము.

ఇట్టిదివ్యమైన సంధ్యావందనమును ద్విజులు, ఉపనయనమునాటనుండియు, ఆచరించుట విధియని స్మృతులును, పురాణములును వివరించుచున్నవి. తదితరులవలె తల్లియొక్క గర్భమునుండియేగాక, బ్రహ్మక్షత్రియ, వైశ్యుల ఉపనయనమునాటినుండియు మంత్రములనుండి మరల జనన మొందుదురు గావున వారికి ద్విజులని నామము కల్గియున్నది. ఉపనయనపూర్వము బ్రహ్మ, క్షత్రియవైశ్యులు శూద్రతుల్యులు. ఉపనయనానంతరము సంధ్యావందన మొనరింపని ద్విజుఁడు శూద్రతుల్యుఁడును, దజ్జన్మాంతరమున శునకజన్మమెత్తునని యు, గోభిలస్మృతి తెలుపుచున్నది. ఇట్టివాఁడు సంధ్యావందన మొనరింపక, ఏయితరదానధర్మముల నాచరించియైనను, పుణ్యమునొందఁగోరునేని, నాతఁడు పదివేల వత్సరములు ఘోరనరకము ననుభవించునని నారదాదిస్మృతులు బోధించుచున్నవి. ఈకర్మము వరుసగా మూడుపూటలాచరింపని ద్విజుఁడు చండాలతుల్యుఁడగుయు, ఏడుదినములు వరుసగా నొనరింపని వానికిఁ బునరుపనయనమవసరమనియు, యాజ్ఞవల్క్యస్మృతి బోధించుచున్నది. అట్టివానిదర్శన, స్పర్శనాదులు వర్జనీయములు. ఏలనన, ఆపస్తంబసూత్రమ్. ప్రథమఖండ ద్వితీయప్రశ్నయిట్లు చెప్పుచున్నది.

యథాచండాలోపసర్శనే సంభాషాయాం, దర్శనేచదోషం
తత్రప్రాయశ్చిత్తిరపాము వగాహన ముపస్నానం స్పర్శే
సంభాషాయా బ్రాహ్మణసంభాషా, దర్శనే జ్యోతిషాందర్శనం॥

సంధ్యావందనము సూర్యగ్రహపూజతోఁ గూడియున్న ప్రశస్తమైన కర్మ గాన, దీని ననుదినము నాచరింపని ద్విజుఁడు అనుదినమును

సూర్యునికి బ్రాహ్మణహత్య యొనరించిన పాపము కల్గించునని మనుస్మృతి తెల్పుచున్నది. కనుక ద్విజులు సంధ్యావందనమాచరించుట కర్తవ్యము.

ఈకర్మను యుక్తమైన కాలమునందే యాచరింపవలెను. సంధ్యా కాలము లనగా రేయింబగళ్లు సంధించునపుడు సూర్యుఁడుగాని నక్షత్రములుకాని గన్పింపని సమయమందు నుదయసాయంకాలములం దీకర్మ నాచరింప విధికలదు కావున నిది సంధ్యావందనమని పిలువఁబడుచున్నది. సూర్యుడు శిరస్సుమీఁదకువచ్చు మధ్యాహ్నకాలమందు గూడ ఈకర్మ నాచరింపవలెనని వశిష్ఠులవారు తెల్పుదురు. హిందువులు త్రికాలములందును నీసమయములు దాటినపిమ్మట ఈకర్మ నాచరించునెడల దత్ఫలము శూన్యమగునని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పుచున్నది.

సంధ్యావందన మాచరించువేళ హిందువులు ఆచరింపవలసిన ప్రధాన నియమములను వివరించు టవశ్యకము. భగవద్ధ్యానమగుట వలన నీకర్మ యొనరించునపుడు నిశ్చలమనస్సుతో నుండుట ముఖ్యము. ఇందులకై ప్రాణాయామ మభ్యసించియుండుట ప్రశస్తము. ఈకాలమందు యితరులతో మాట్లాడఁగూడదు. నొక నిశ్శబ్దమైనచోట ఆసీనులై యుండవలెను. భూమిపై గూర్చుండుట యుక్తము. పీటపై గూర్చుని జపతపములు గావించుటవలన దారిద్ర్యము కల్గును. దర్భాసన ముపయోగించుటయే ఆవశ్యకము. అది లేకున్నచో 3 దర్భలను (బర్హిస్సు) తూర్పుదిశకు నగ్రములుండునట్లు పఱచి వానిపై గూర్చున్న యెడల శ్రేష్ఠము. ఈదర్భలు భానుతేజస్సు నాకర్షించి శరీరమందలి రక్తమును శుభ్రపఱచునని ఆయుర్వేదము చెప్పుచున్నది. మధ్యాహ్నము తూర్పునకును, ప్రాతస్సాయంకాలములందు సూర్యునికిని నభిముఖులుగా గూర్చుండి ఈకర్మ నాచరింపవలెను. తడిబట్టతో నీకర్మ నాచరించుట వలన దత్ఫలము రాక్షసుల పాలగును. స్నానము, భస్మ



ధారణ, యుక్తమైన వస్త్రధారణయు నీకర్మ యొనరించుటకు ప్రధానములు. తడిబట్టతో నీకర్మ నాచరించుట కగత్యము కల్గిన యెడ, దానిని సూర్యునికిఁ జూపినయెడల నారఁబెట్టినఫలము కల్గునని కొందఱు మతగురువు లండ్రు. తామ్రకలశ, హరివాణము, ఉద్ధరిణె, కమండలము మొదలగువాని నుపయోగించుట ముఖ్యము. ఆచమనము చేయునపుడు హస్తమునందలి జలము మినుపగింజ మునుఁగునంతటి పరిమాణమును మించియున్నచో నది సురాపానతుల్యమగును. సంధ్యావందనానంతరము పాత్రయందలి జలమును మంచిప్రదేశమందుఁ బరిగ్రహించుట శ్రేష్ఠము. ఈనియమము లన్నియు ధర్మమునం దనేక చోట్ల వివరింపఁబడియున్నవి.

అనుదినమును త్రికాలములందును నీకర్మ నాచరించువానికి దీర్ఘాయురైశ్వర్యంబులు కల్గును. ఈకర్మయందలి మంత్రములు వేదమునుండి గ్రహింపఁబడుటవలన, దీని నాచరించువారు వేదపఠనము యొక్క ఫలముల నొందగలరు. అందువలన దీర్ఘాయురైశ్వర్యంబులు కల్గునని రాఁబోవు పుటలు తెల్పును. బ్రహ్మవర్చస్సును, తేజోబలమును ప్రసాదించి, ఈకర్మ దీర్ఘాయుర్వు నిచ్చును. దారిద్ర్యపీడితుఁడగు వాఁడు యథావిధిగా నీకర్మ నాచరించుచో సుఖమునొందును, దీర్ఘాయువుతోఁ దులతూఁగును. ఈతఁడు పుణ్యపురుషుఁడు. శ్రీవిష్ణు, సాంబమూర్తులను జ్ఞప్తికిఁదెచ్చు దివ్యమూర్తి. ఉత్సాహముతో దీపించు తేజోమూర్తి. సత్యసంధుఁడు. సదాచారసంపన్నుఁడు. మఱియు గాయత్రీజపమువలన నీతఁడు నిరంతర దేవధ్యానముతో గూడియుండు నిర్మలహృదయుఁడు. ఇట్టి దైవారాధనపరునికి, భగవత్కృపచే గుణవతియు, సౌందర్యవతియు, స్వచ్ఛకులోద్భవురాలును నగు సద్భార్య లభించునని పురాణములు బోధించుచున్నవి. సద్భార్య సకలైశ్వర్యంబులకును మూలము. కుటుంబసౌఖ్యముల నొందుటకుఁ బ్ర

ధమకారణము. గృహమున కఖండ భూషణము. అనుకూలదాంపత్యమునకును, సుసంతానఫలమునకును గల్పవృక్షము. పార్వత్యనసూయలతోఁ దుల్యురాలు. సద్వర్తనముచే దాను దీర్ఘాయువు నొంది భర్తకు సర్వసుఖముల నొసంగు పుణ్యభామిని యని స్మృతులు వచించుచున్నవి. ఈకర్మయందు గాయత్రీజపము కూడియుండును. ఇందువలన నపజయము కలుగనేరదు. ఈమంత్రముయొక్క భాగములు చతుర్వేదములనుండియు గ్రహింపఁబడినవి కావున నీజపమువలన చతుర్వేదపారాయణఫలంబును, దీర్ఘాయువునుగల్గి, పాడిపంటలు గృహము నలంకరించి యుండును.

ఈగాయత్రీజపము అక్షరలక్షలు జపించుటవలన త్రిలోకవశీకరంబగునని యార్యులు నుడువుదురు. తొల్లి యొకపేదవిప్రుఁడు పవిత్రతయం దద్వితీయమైన వారణాశి పురంబున వసించుచుండె. ఆతఁడు సద్వర్తనముతో దీపించుచు గంగానదియందు జలకమాడి, అనుదినమును గాయత్రీజప మొనరించుచుండె. కొన్నివర్షంబులు గడచినపిమ్మట అక్షరలక్షలు పూర్తియయ్యెన్, నీతఁడజ్ఞానము లేనివాడై యున్నను, గాయత్రీజనని ఆతనికిఁ బ్రత్యక్షంబై సకలైశ్వర్యములను బ్రసాదించె. ఈవిప్రపుంగవుఁడు అనంతర మత్యంతవైభవమైన సౌధములందు, దారాపుత్రాదులతోఁ జిరకాలము వర్ధిలి మోక్షమునొందె. కావున,

"నగాయత్ర్యాః పరం మంత్రం నమాతుః పరదైవతం"

గాయత్రికన్న నెక్కువమంత్రము లేదు. తల్లికంటె నెక్కువ దైవము లేదని హిందూధర్మము తెలుపుచున్నది.

ఈకాలపుద్విజులు ఇట్టిపవిత్రభావముతో గూడియున్న నీకర్మ నాచరింపక నపజయము, నపమృత్యువులచే జయింపబడుచున్నారు. బ్రాహ్మణుల పవిత్రత నాశన మగుచున్నది. పాప మభివృద్ధియైనది. శ్రోత్రియమాన్యములు ఋణగ్రస్థతచే నొరుల పాలగుచున్నవి. పవిత్రతతో గూడిన



కార్యములందు ఈకర్మ నొనరింపనివారు పాల్గొనుటచే నవి భగ్నమగుచున్నవి. ఆధునిక ద్విజులీకర్మ నాచరించి కృతార్థులగుదురుగాక.

—: 7. ఆయుష్కర్మము :—

క్షౌర మనబడు ఆయుష్కర్మము, ఆయుఃకర్మము అనుపదములనుండి త్పత్తియైనట్లును, నందువలన నీకర్మమునకు నాయువుతో సంబంధముకలదనియుఁ బ్రకటితమగుచున్నది. జ్యోతిష, ధర్మశాస్త్రములు ఈకర్మనాచరించుకొనుటకై మంచిదినములను, చెడుదినములను, సమయములను వివరించుచు, కొన్నిదినములందీకర్మ నాచరించుటవలన నాయుర్వృద్ధియు, దదితరసమయములందాయుర్నాశనమును మొదలైన ఫలములు గల్గునని తెల్పుచున్నవి.

ఈకర్మనొనరించుటకు ప్రశస్తములై ఆయుర్వృద్ధికరమైనవారములు సోమ, బుధలని ఈశాస్త్రములువచించుచున్నవి. ఈవారములందు నక్షత్రదోషమున్నను నీకర్మ నొనరించుకొనవచ్చును. గురువారము గురునికిఁ బ్రీతికరమగుటచే నీదినమున నీకర్మమొనరించువారికి విద్యలంటవు; అంటినను, దుదముట్టవు; తుదముట్టినను, రాణింపవు. శుక్రవారమునాడీకర్మనొనరించుకొను వారి కాయుర్వృద్ధికలిగినను సువాసినీతోబుట్టువులుకలవారు వర్జింపవలెను. నక్షత్రములు ప్రశస్తములైనను శని, మంగళ, ఆదివారములనాడు ఈకర్మనెంతమాత్రమును యొనరించుకొనగూడదు. శనివారము 6 మాసములును, మంగళవారము 3 మాసములును ఆదివారము 1 మాసమును, ఆయుర్దాయమును క్షీణింపజేయునని ఈశాస్త్రములు చెప్పుచున్నవి.

తిథులలో విదియ, తదియ, పంచమి, సప్తములే మంచివి. తదితర తిథులు వర్జింపవలెను. ఏలనన, పాడ్యమి నవములు ధనధాన్యహానియు, చవితిమాతృహానియు, షష్టిభ్రాతృహానియు, అష్టమికుటుంబహానియు, దశమిపుత్రనాశనమును ఏకాదశి, ద్వాదశి, అమావాస్య పౌర్ణ

ములు పుణ్యానాశనమునకు, త్రయోదశి ఆత్మహానియు, చతుర్దశి తోబుట్టువునకు హానియుఁదెచ్చునని శాస్త్రము తెల్పుచున్నది.

నక్షత్రములలో అశ్వ. రో, మృ, పున, పు, ఉ, హ, చి, స్వా, ఉషా, శ్ర, ధ, శ, ఉభా, రేవతులు ప్రశస్తములు. అనూ, మూలలు సామాన్యములు. ఇతర నక్షత్రములు వర్జనీయములు.

మరియు, తిథివార నక్షత్రములు, తారాబలములు మున్నగునవి మంచివైయున్నను, పుణ్య, పర్వ, శుభ, పితృ, మృతాశౌచ, జాతాశౌచ దినములం దీకర్మ వర్జింపనగును.

ఈకర్మ యొనరించుకొనుటకు మంచిసమయము, ఉదయము.

ఆయుష్కర్మము వలన నీఫలితము లేలకలుగును? మనమువసించు భూమిగ్రహములలో నొకటై యున్నది. ఈగ్రహములన్నిటికి నాకర్షణశక్తి కలదు. కావున నొకగ్రహము మరియొకగ్రహమును, ఒకగ్రహముల గుంపు మరియొకగుంపును స్థానమున ననుసరించి యాకర్షించుచుండును. కొన్నిసమయములందు భూమి, తానాక్రమించి యున్నస్థానము యొక్క స్వభావమువలన, నితరగ్రహములచే నాకర్షింపఁబడును. ఈసమయములందు నిందలి, వృక్షములును జంతుజాలములను కూడ నాకర్షింపఁబడును. ఈ ఆకర్షణశక్తి అల్పమైన మానవనేత్రమునకు గోచరింపదు కాని, దీనిఫలితములు పౌర్ణమి, అమావాస్యలనాఁడు మనకుఁ బ్రత్యక్షములగుచున్నవి. ఆతిథులలోఁ బిచ్చివాండ్రకుఁ బిచ్చికళలు హెచ్చగును. వ్యాధిగ్రస్థులకు రోగములుగ్రమగును. పయోధియందు నౌన్నత్యములైన కెరటములు లేచును. పౌర్ణమినాడు విరహిణులకు మదనతాపము వర్ణనాతీతమైయుండును. చంద్రోదయ, చంద్రాస్తమయములందు పోటు, పాటులుకల్గును. గ్రహములఆకర్షణశక్తి తదితర విధములందు, ప్రత్యక్షముగా నుండదు. భూమి ఇతర గ్రహములచే నాకర్షింపబడునపుడు ఆయుష్కర్మమొనరించుచో శరీరమందుఁ బ్రవహించుచుండు విద్యుచ్ఛక్తి వంటి



దివ్యశక్తులు, కేశఖండన సమయమందు ప్రయోగింపబడు లోహపుకత్తి నుండి గ్రహముల ఆకర్షణశక్తిచే లాగివేయబడును. శరీరమప్పుడు తేజోవిహీనతనొంది, దార్ఢ్యమును లావణ్యమును గోల్పోవును. అల్పాయువువంటి నష్టములు ప్రాప్తించును. కావుననిట్టిదినములు దుష్ట, వార, నక్షత్ర, సమయములనియు నాయుష్కర్మము మంచివార, తిథులందే నాచరింపవలెననియు ధర్మము చెప్పుచున్నది.

మంచివార,తిథి, సమయములందాయుష్కర్మమేల ఆయుర్వృద్ధి శిరిసంపదలు, మొదలగు ఫలమునిచ్చును? ఈదినములందు గ్రహచలనమందు భూమి ఆక్రమించియుండు స్థానములయొక్క ప్రభావముచే నితరగ్రహములను, అందలిశక్తులను, భూమియు, నిందలిజంతుజాలములును ఆకర్షించుచుండును. ఈసమయములందు క్షౌరముచేయించుకొను వారి శరీరములోనికి గ్రహములయొక్క మంచిశక్తులు లోహపుకత్తినుండి ప్రవేశించును. అప్పుడుశరీరము జలపూరితమైన నదివలె ప్రశస్తమైన శక్తులతోఁగూడియుండి బల, లావణ్యములతో మెఱయుచుండు. శిరి, సంపద ఆయుర్వృద్ధియు, హస్తగతములైయుండు. క్షురకర్మకొరకు నిట్టి వారతిథి నక్షత్రాదులే శాస్త్రోక్తములైనవై యున్నవి.

ఈరీతిగా నాయుష్కర్మము మంచిదినము లందాయుర్వృద్ధి మొదలగు ఫలములను, చెడుదినము లందాయుర్దాయనాశము మొదలగు ఫలములను నిచ్చునుగావున నీకర్మము ఆయుర్దాయముతో సంబంధము కలదై యున్నది.

భోజనానంతర మీకర్మ నాచరింపగూడదు. ఆసమయమందు శరీరము బల, లావణ్యములతో నతిశయిల్లు. దేహమందు రక్తము చురుకుగాఁ బ్రవహించుచుండు. విద్యుచ్ఛక్తి మొదలగునవి ఆసమయమందాయుష్కర్మ మాచరించుకొనువారి శరీరములనుండి తొలగును. అల్పాయువు ప్రాప్తించును. మరియు, నీకర్మ జరిగిన పిమ్మట స్నాన

ము చేయుట విధియై యున్నది. భోజనానంతరము స్నానాభ్యంగనాదు లొనరించువారి కనారోగ్యము వాటిల్లునని ఆయుర్వేదము చెప్పుచున్నది. రాత్రిపూటయం దీకర్మ నాచరించువారికి క్షౌరపుకత్తివలన నపాయము వాటిల్లవచ్చును. స్నానము చేయుట యవశ్యకమగును; స్నాన మాచరింపనిచో శిరోజములు యొడలు నంటియుండి, ఉత్సాహమును జెఱుచును; ఆహారపదార్థములతో శరీరమందుఁ బ్రవేశించి రోగములఁ దెచ్చి, అల్పాయువును వాటిల్లఁజేయును. మరియు రాత్రిపూట స్నానమాచరించుట అనారోగ్యకరమని ఆయుర్వేదము తెల్పుచున్నది. కావున నీకర్మకై ఉదయమే ప్రశస్తమైన సమయము.

ఈకర్మానంతరము శిరస్సునకుఁ జమురుపూసుకొని స్నానము, చేయునపుడు తులసిచెట్టు మొదట యుండు మృత్తికను శిరస్సునకు బూసికొనుట శాస్త్రము. ఇందువలన శరీరము తేజోవంతమై యలరారు. స్నానము తేజస్సునొసంగును. తులసియందుండు విద్యుచ్ఛక్తియు మృత్తికయందుండు శీతలత్వమును, శిరస్సునకు క్షౌరమువలన గల్గిన మంటను దొలగించును. ఆధునిక హిందువు లీనియమముల నాచరింపక అల్పాయువు నొందుచున్నారు. బ్రాహ్మణులు శ్రోత్రియపు మాన్యములను ఋణగ్రస్తతచేఁ జెరచుకొనిరి. పాశ్చాత్యవిద్యల నభ్యసించుచున్న యువకులును, నుద్యోగియులును, శెలవుదినములని యెంచి శని, ఆదివారములం దీకర్మ నాచరించుకొనుచు, నల్పాయువుచే గెలువబడుచున్నారు. ప్రాచీనహిందువులు, యుక్తకాలములందే నీకర్మ నొనరించుకొనుచు దీర్ఘాయువుతోఁ దేజరిల్లుచుండిరి.

---

శ్రీ

శుభమస్తు

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## ద్వితీయ భాగము.

### హిందువుల భోజనము.

---

ఈభాగమునందు దీర్ఘాయువునుఁ బ్రసాదించు భోజనపదార్థము లెట్టివో, వివరింపబడి యున్నవి. పూర్వకాలపు హిందువులు వానిను పయోగించుటవలన నేల దీర్ఘాయువు నొందుచుండిరో, ఆధునిక భారతీయులు వానిని నుపయోగింపకున్నందున అల్పాయువున కేలఁ జిక్కుచున్నారో సంగ్రహముగా ఇచ్చట వివరింపబడెను. భోజనపదార్థములను గూర్చి వివరించుటకుఁ బూర్వము దీర్ఘాయువు నిచ్చు భోజననియమములను గూర్చి వివరించుట ముఖ్యము.

### —♦ 8. భోజననియమములు. ♦—

హిందువు లీదిగువనియమముల నాచరింపుచు భోజనపదార్థములను స్వీకరింతురేని దీర్ఘాయువు కల్గును:—

1. భోజన మొనరించునపుడు శుచిత్వము ప్రధానము. శరీరము శుభ్రముగా నుంచుటకై స్నానమాచరించి యుండవలెను. భోజనము చేయుట కేర్పడు స్థలము, కూర్చుండు పీటలు, అన్నము దినుట కేర్పడియుండు పత్రములు, పాత్రలు, జలమును ద్రావుటకు నియమింపబడిన కలశలును, నిర్మలముగా నుండుట యవశ్యకము. మలినశరీరులను గాని, తడితరులను గాని భోజనకాలమందు ముట్టుకొనరాదు. ఆహారపదార్థములు శుచిగానుండవలెను. వానిని తయారుచేసి వడ్డించువారు నిర్మలదేహములతోఁ బ్రకాశింపవలెను. భోజనగృహము ప్రాణవాయువుతోఁ గూడియుండుట ముఖ్యము.

2. భోజనము యుక్తకాలమునందే స్వీకరింపవలెను. భోజనము చేయుటకు నాలస్యము చేయుటవలన జఠరము మందగించును. భోజనమాకలిలేనిసమయమందు స్వీకరించినచో, అజీర్ణరోగము కల్గును. ఒక భోజనమునకును రెండవభోజనమునకును, అధమము నాలుగుగంటల వ్యవధి యుండుట అవసరమని ఆయుర్వేదము తెల్పుచున్నది.

3. భోజనపదార్థములు తత్వమున కనుకూలమైనవై యుండుట కర్తవ్యము. చిరకాలమునుండియు హిందువుల కభ్యస్తములైయున్న దంపుడు బియ్యము, వంటఆముదము (శిశువులకు) మొదలగు వానినే స్వీకరించుచు, కాఫీ, ఫ్యాక్టరీబియ్యము, బజారు ఆముదము మొదలగు వానిని వర్జింపవలెను.

4. ఆహారము మితముగా నుండవలెను. అమితాహారము, అజీర్ణరోగోత్పత్తికిం గారణము. దీర్ఘాయువునుం జెరుచు దురభ్యాసము.

5. భారతీయు లుష్ణదేశీయులగుటచే, నిచ్చట ప్రబలుచుండు భానుతేజోజనితమైన తృష్ణను జయించుటకై వీరు పగటిపూట మీగడతోగూడిన పెరుగు నన్నముతోం బుచ్చుకొనుటయు రాత్రిపూటక్షీరము వాడుటయు ఆయుర్వృద్ధికరములనియు నాయుర్వేద మెఱిగించు.

6. భోజనము వివిధరుచులతో గూడియుండవలెను. ఇది యుత్సాహకరమై యుండు. ఇట్టి భోజనమే వేద, శాస్త్ర, శ్రౌత పండితులకు ప్రీతికరము. బాలురకు దార్ఢ్యదాయకము. జామాతల కమృత తుల్యము. బంధు, మిత్రపరివారమున కర్హమైన సత్కారము.

7. భోజనపదార్థములు పూటపూటకును మారుచుండుట వలన దీర్ఘాయువు కల్గును. పగలుపయోగించిన పెండలంకూరయందలి శీతలత్వమును రాత్రి యుపయోగించు అరటికాయకూర యందలి వేడి అణచును. ఒకపూటయందు స్వీకరించిన పనసకాయకూర వేడిమిని మరునటిపూటయందు స్వీకరించు నీరువంకాయకూర అణచును. ఈమార్పు



లుత్సాహకారణములు. సమశీతలత్వము నొసగు బరమరహస్యములు.

8. భోజనకాలమునందు నుత్సాహముతో గూడియుండవలెను.

---

### 9. మెట్టభూమిపంటలు—పల్లపుభూమిపంటలు.

మెట్టభూములందు ఫలించుపంటలు వర్షముపై సాధారపడి యుండుటవలన సంవత్సరములో విశేషకాలము, ఈభూములందు, నిలువనీరుండుటకుడు. ఈభూములు వర్షేతరకాలమందు బీటలుతీసి యుండును. భూసారము తొలగకుండును. ఈభూములు దార్ఢ్యవంతమైన మానవశరీరమునుం బోలియుండి, బలముగల పంటనిచ్చును. ఈ పంటలు, మహారుచితో నొప్పారు. వీనిని దినువారు బలలావణ్యములతో మెరయుచు, దీర్ఘాయువునొందుదురు. పూర్వకాలమందు హిందువులు మెట్టపంటయగు జొన్నఅన్నమును దినుచు, దీర్ఘాయువునొందుచుండిరి. ఇప్పటికైనను, మెట్టప్రాంతములందుండు హిందూదేశస్థులు మదపుటేనుగులవలె ప్రకాశించుచున్నారు. ఈభూములందు ఫలించు ఫలములు కూడబలముకలవై మేరలేనిరుచితోనుండును. ఆంధ్రమండలమందు మెట్టభూములున్న రాజమహేంద్రవరము తాలూకాలో ఫలించు బత్తాయిలు, చక్రకేళులును, నిరుపమానమైనరుచితో గూడియున్నవి.

పల్లపుభూములందుం బంటలు కాలువలఆధారముపై ఫలించును. గోదావరి, కృష్ణా, కావేరి, గంగా మొదలగు నదులయొక్క డెల్టాలలోనున్న భూములు సంవత్సరమందెల్లపుడు నీటితోనానుచుండుట వలన నవి ఇవకతోగూడియుండును. ఈభూములయందు సంవత్సరమునకు రెండుమూడుపంటలు పండింతురు. అందువలన భూసారమునశించుచుండును. ఈభూములు నిరంతరము నీటితో నానుచుండుటవలన వాతశరీరముతోగూడియుండువానివలె దౌర్బల్యముకలవై మెట్టభూములకు సాటిరావని వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

పూర్వకాలపు హిందువులకు మెట్టపంటలే ఆధారమైయుండుట

వలన వారు దార్ఢ్యముతో దీపించుచు, వజ్రకాయములవంటి సుసంతతిని బడయుచు, దీర్ఘాయువు నొందుచుండిరి.

## 10. పాతరధాన్యము—పురి, గాదె ధాన్యములు.

హిందూదేశస్థులు ధాన్యము పండినపిమ్మట వానిని పాతర వేయు ఆచారము కలదు. కొందఱు వానిని గడ్డితోఁ దయారైన పురులయందుఁ బోయుదురు. మరికొందఱు ధాన్యమును గాదెలయందుగాని, కొట్లయందుగాని, భద్రపరుతురు.

ఈరీతిగా భద్రపరుపబడిన ధాన్యములలోఁ బ్రశస్తమైనవి పాతరధాన్యము. గ్రామములందలి సేద్యగాండ్రును, భూస్వాములును, తమతమ పొలములనుండి మార్గశిర పుష్యమాసములలో ధాన్యము లిండ్లకుఁ దెచ్చినతోడనే వాని నెత్తైనప్రదేశమందు పాతరవేయుదురు. ఈ ధాన్యము, వైశాఖ, జ్యేష్ఠమాసములవరకును, భూమిలోనే యుండును. పిమ్మట, వానిని దీసి భద్రపరచి, భోజనమునకై యుపయోగించుట ఆచారము. ఈధాన్యము భూమియందు సుమారు 4-5 మాసము లుండుటవలన వానియందుండు దోషములన్నియు హరించునని వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయము. అనుభవనీయులకుఁ దెలిసిన విషయము. ఈధాన్యమునుండి తయారైన బియ్యము జీర్ణశక్తిని బుట్టించును. జిహ్వ కత్యంతప్రీతికరమై యుండి, నానబోసిన అటుకులవంటి రుచితో విలసిల్లు. వ్యాధిగ్రస్థులై, ఔషధసేవ చేయుచుండువారి కీధాన్యము ఆరోగ్యకరము. ఈఅన్నము మేహాదిరోగములను జయించి, స్వల్పకాలములో జీర్ణమగును. ఈఅన్న మెన్నడునుఁ జిముడ నేరదు. కృష్ణామండలమందిట్టి ధాన్యము నుపయోగించుట అనేకులకు ననుభవముగా నున్నది.

పురులు, గాదులు మొదలగువానియందు నిలువయుంచఁబడిన ధాన్యములు సామాన్యపక్షముగానుండి పాతరధాన్యమునకు సాటిరానేరవు. వానివలె దీర్ఘాయువు నీయజాలవు.



## —♦ 11 దంపుడుబియ్యము. ఫ్యాక్టరీబియ్యము. ♦—

భారతీయులాదినుండియు, దంపుడుబియ్యము నుపయోగించుచు దీర్ఘాయువు నాఘ్రాణించుచుండిరి. చిరకాలమునుండియు భారతీయుల కైశ్వర్యదాయకమైయున్న భోజనపదార్థము దంపుడుబియ్యము.

దంపుడుబియ్యము మంచిగుణములతోఁ దేజరిల్లుచున్నది. వీనియందుండు తవుడు నరములకు సత్తువచేయుచు వానికి బలమిచ్చుచుండు పదార్థముల (Phosphates) తోఁ గూడియున్నది. ఈతవుడు ఈబియ్యము యొక్క ఘనతకు మూలకారణము. నరముల నభివృద్ధిచేయు సంజీవి. వానికిఁ బుష్టినొసఁగు అమృతము. మేహశాంతిచేయు మహాప్రసాదము. కొందఱువైద్యులు సత్తువలేనివారిచే నీతవుడు తినిపింతురు. రక్తబలము హృదయబలము మొదలగువానిని వృద్ధిచేయు దివ్యమైన సమర్థతతో నొప్పారునది ఈతవుడే.

ఈదంపుడుబియ్యమునందుండు తవుడుయొక్క ప్రభావముచే బాల్యదశనుండియు, నీఅన్నమును దిను భారతీయులు, అదృష్టవంతులై వర్ధిల్లుదురు. వారికి వయస్సునకుఁ దగినబలలావణ్యములు, జఠరాగ్ని మొదలగు దివ్యఫలితములు అలంకారములై ప్రకాశించుచుండు. సమశీతలత్వమును బ్రసాదించుటయందునీబియ్యము అగ్రస్థానమును వహించు పదార్థరాజములు. శరీరమునందీహేతువుచే మేహ, కుష్ఠు, పాండు ఉబ్బు, శ్లేష్మ, గుల్మరోగములు చేరబడఁజాలవు. కావున, శిరోరోగములు నేత్రకర్ణ, దంతరోగములును నిర్మూలమగును. ఔషధసేవ చేయువారి కీబియ్యము జీర్ణశక్తిని బుట్టించుటయందును, నచిరకాలములోనే రోగములను జయించుటయందును ప్రసిద్ధికెక్కియున్నవి. ఈఅన్నమును బిడికెడు తినునంతటితోడనే అమృతతుల్యమై, అనేకభక్ష్యముల నారగించిన సంతోషముకంటె ఎక్కువ ముదమును బుట్టించును. ఈబియ్యమును బాల్యదశనుండియు నుపయోగించు హైందవులు, నీరోగులై

ఏనుఁగుతొండములఁబోలు జఘనాలతోఁ వర్ధిల్లుచు మన్మథునిమించిన సౌందర్యముతో నతిశయిల్లుచు, మిక్కుటము సంభోగవాంఛకలవారై దార్ఢ్యవంతమైన సుసంతతినిఁబడయుచు దీర్ఘాయువుతో బ్రకాశించుచుందురు. ఈదంపుడుబియ్యము నుపయోగించుటచే నీదివ్యలాభములు కూడ కలుగుచున్నవి:—

1. ధాన్యముదంపుకూలివాండ్రు, శాశ్వతపువృత్తులుకలవారై సుఖమునొందుచు, నుత్సాహముతోఁ గూడియుండి, జారచోరత్వములందు బాల్గొనరు. దేశమునకుఁ బ్రజాశాంతి భూషణమై దీపించుచుండు.

2. ఈకూలివాండ్రు తెల్లవారుజామున వడ్లుదంపునపుడు పాడుశ్రావ్యమైన పాటలు, వారియుత్సాహమునుఁ దెల్పుచు, శయనించియున్నవారి కరుణోదయస్నానార్థమై ఏర్పడిన మేలుకొలుపులవలెనుండి, దేశీయుల సోమరితనమును దున్మి, ఐశ్వర్యదాయకములై యొప్పారు.

3. దంపుడుబియ్యమువలనలభించు చిట్టును, తవుడును బశువులకుఁ గరంబు ప్రీతికరము. ఈపదార్థములు పశ్వాదులకారోగ్యదాయకములై వానికి నుత్సాహమును సమశీతలత్వమును నిచ్చునని వైద్యశాస్త్రవేత్తలు వివరించుచున్నారు. ఇవియొసఁగు ప్రశస్తమైన క్షీరమునుండి తయారగుపెరుగు, నెయ్యి మొదలైనవి దార్ఢ్యదాయకములై హిందువులకు దీర్ఘాయువు నొసంగును. ఈపశువులు వేయుపేడ, పొలముల కెరువుగా నుపయోగించుచో, శ్రేష్ఠమైనపంటలు పండును. దంపుడుచిట్టు, తవుడుతినిన గోవులపేడ, మంచిశక్తులతోఁ గూడియుండి "గోమయభస్మధారణము" చేయువారికిఁ దత్ఫలితముల నొసఁగును. పశువులుకూడ రోగములఁ జిక్కక చిరకాలము సుఖించుచుండు.



ఇట్టిసుఫలితములతోఁ గూడియుండి, భరతవర్షమందలి ప్రజలకును, బశ్వాదులకును దీర్ఘాయువును గల్గించుటకు బ్రధానమైయున్న దంపుడుబియ్యమును ధాన్యపుఫ్యాక్టరీలు సుమారు ఇరువది ముప్పది సంవత్సరములనుండి వ్యాప్తినొందుచు, పట్టణములనుండియు, వ్యాపారస్థలములనుండియు దూరముగా దరుముచున్నవి. ఈఫ్యాక్టరీలు, ఆవిరిసహాయముతో నడుపబడుటచే, కొలదికాలములోనే సులభమైనవెలకు, నెన్నిబస్తాల ధాన్యమునైనను బియ్యముగా మార్పగలవు.

ఈఫ్యాక్టరీబియ్య మనారోగ్యకరమైనవని వైద్యశాస్త్రజ్ఞులు వారించుచున్నారు. వీనిదుర్గుణమునకు రెండుకారణములు కన్పించుచున్నవి. ఈబియ్యమునుండి తవుడు పూర్తిగా తొలగిపోవును. ఈబియ్యపుగింజ తయారగునపుడు విశేషపుఅదటునొంది, దానిసహజమును సుగుణములను గోల్పోయి, మేహరోగోత్పత్తి చేయు దుర్గుణము కలదగునని వైద్యశాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఈబియ్యము తళతళలాడుచు బ్రకాశించుచున్నను, నరములను దయారుచేయుటయందు బ్రసిద్ధికెక్కిన గుణములుగల తవుడులేనిదై యుండును. తవుడులేనందున నీబియ్యముపయోగించువారికి సమశీతలత్వము కలుగనేరదు. దీనియందు కొద్దిగాతవుడున్నను నదివండుటకుఁ బూర్వము నీటితోఁగడుగునపుడు ఈబియ్యమునుండి పూర్ణముగాఁ దొలగిపోవును. ఈబియ్యమీరీతిగాఁ దవుడులేనిదై సమశీతలత్వము నొసంగుసమర్థతలేనిదై మేహాదిరోగములనుగల్గించుచున్నవి. ఈకాలమందు ఫ్యాక్టరీ లభివృద్ధితోఁబాటు మేహాదిరోగములు కూడ ప్రబలుచున్నవి. దీనందేసి శ్లేష్మతత్వములు, మేహనీరు, పైత్యవికారములు మొదలైనవి వృద్ధినొందుచున్నవి. రాఁబోవు "కాఫీ" ప్రకరణమందు వివరింపబడిన మేహజనితములైన దాదాపు అన్నినష్టములను నీఫ్యాక్టరీబియ్యము భారతీయులకు గల్గించుచున్నది. తత్వములుమారుచున్నవి. ఆయుర్వేదపు ఔషధములు

ఈబియ్యమువాడువారికి త్వరలో గుణములనిచ్చుచుండుటలేదు. ఫ్యాక్టరీబియ్యపు అన్నము, పిప్పివలెనుండి ఎంతటిపరిమాణమును దినుచున్నను వెఱ్ఱియాకలిని గల్గించుచునేయుండును. హిందువులనేకులకు నీబియ్యమువలన కడుపులోమంట, గుండెలు పీకుట, మొదలగుజబ్బులు కలుగుచున్నది. ఈఅన్నమును దినుచుండు భారతీయులు తెల్లనిస్వచ్ఛమైన అన్నమును స్వీకరించుచున్నామని గర్వపడుచు, శరీరము మేహాభివృద్ధివలన నొకవైపున పాండించుచుండ దానినారోగ్యసూచకచిహ్నంబుగ మోసఁబోయి "మాకుఁగళవచ్చుచున్నది. మేము తెల్లబడుచున్నాము మాశరీరములు దొరలదేహములవలె తెల్లబడుచున్న" వని అజ్ఞానముచే జెప్పుకొనుచున్నారు. ఈఫ్యాక్టరీబియ్యపుఅన్నము భారతీయులకు పాండు కుష్ఠుమొదలగు రోగములను సులభముగా గల్గించుచున్నవి; దుర్బలులై, పుట్టినాదినుండిన మేహశ్లేష్మతత్వములతోఁగూడియున్న దుష్టసంతతికిమూలమగును. మరబియ్యమునకు, దవుడుకలుపరాదాయని చదువరులు ప్రశ్నింపవచ్చును. అట్లుచేయబూనుకొనుట నెమలియగునను భ్రాంతితోఁ గాకితోకకు జిగురుతో నెమలియీకలంటించినట్లుండును. ఫ్యాక్టరీబియ్యపుగింజదోషపూరితమైయున్నదని వైద్యులు వివరించుచు నౌషధము లిచ్చునపుడు దంపుడుబియ్యపుఅన్నమునే తినుమని సలహాయిచ్చుచున్నారు.

ఫ్యాక్టరీబియ్యము భారతీయుల దీర్ఘాయువును నాశనముచేయుచు నీదిగువ నష్టములను గూడ కల్గించుచున్నవి:—

1. వడ్లుదంపు కూలివాండ్ర జబ్బబలము ఆవిరితో నడుపబడు యంత్రములతోఁ బోరాడజాలనందున ఈకూలివాండ్రు తమవృత్తులను బోగొట్టుకొనిరి. అందువలన దేశమందు జారచోరత్వములు ప్రబలుచున్నవి.



2. వీరు యంత్రముతోఁ బోరాటమునుండి వెనుకంజ వేయుటతోడనే రంగముమీఁదకు నూతనపాత్రము ప్రవేశించెను. ఫ్యాక్టరీయజమానుఁడు, కుబేరుఁడగుచున్నాఁడు. కూలివాండ్రు తమ వృత్తులను, బోగొట్టుకొనుటవలన నీతడు ధనార్జనపరుడగుచున్నట్లు గ్రహించి ఆతనియెడల వైరబుద్ధికలవారై, ఆతని అశ్రేయస్సును గోరుచు, ఘోషించుచుందురు. కుటుంబమునకు బోరును, రాజ్యమునకుఁ గత్తులును, నిర్దోషుల ఘోషయు, దేశారిష్టములని యార్యులు నుడువుదురు. దంపుడు కూలివాండ్ర ఘోషవలన దేశమున కశ్రేయస్సు కలుగకుండునే. పాటకపుజనుల ఆందోళముచే ప్రజాశాంతి భంగపడకుండునే. ధాన్యపు ఫ్యాక్టరీలు భరతవర్షమును దారిద్ర్యమునొడ్డున కీడ్చుకొనిపోవుచున్నది.

3. ఫ్యాక్టరీబియ్యము వలెనే ఫ్యాక్టరీపిట్టును దవుడును రోగములఁ దెచ్చును. పశ్వాదులకు మేహాదిరోగములు కల్గుచున్నవి. వాని క్షీరాదులు దోషపూరితములై యుండి, దేశీయులకు దీర్ఘాయువు నిచ్చు సమర్థతలేనివై యున్నవి. దీని నాహారముగా దిను పశువుల పేడ, భూసారమునకు బలము నిచ్చుటలేదు. పంటలు లెస్సగా ఫలించుటలేదు. గోవులు వీనిని దినుటవలన వానిపేడ సత్తువలేనిదై "గోమయభస్మధారణ", ఫలితముల నిచ్చుచుండుట లేదు.

4. ఫ్యాక్టరీబియ్యము దయారుచేయు యంత్రములు దీర్ఘాయువును జెరచుచున్నవి. వీనియందు పనిచేయువారు చిట్టు, దూగర మొదలగువానిని పీల్చి, శ్వాసకోశములను జెఱచుకొని క్షయ మొదలగు రోగముల జిక్కుదురు. ఈయంత్రముల ప్రాంతమందు, నిలువనీరు, అనారోగ్యకరమై, దానిని పీల్చువారి కల్పాయువు దెచ్చుచుండు. ఫ్యాక్టరీలను విశేషధనవ్యయముతోఁ భారతీయులు తెప్పించుటవలన లక్షల కొలది ధనము నాశనమగుచున్నది.

5. ధాన్యపు ఫ్యాక్టరీలవలన బియ్యముతయారై ఇతర దేశములకు ఎగుమతిచేయబడును. ఈదేశమునందుసరకు తగ్గును. అప్పుడు ధర లుహెచ్చును. శాశ్వతము ఆదాయముకలవారు కష్టపడి, ఉత్సాహము లేనివారగుదురు.

6. ఫ్యాక్టరీబియ్య ముపయోగించువారికి నౌషధసేవ నిరుప యోగమై యుండును. అట్టివారు తమలోపమును నీవిషయమును గ్రహింపక నాయుర్వేదపు ఔషధములు గుణమిచ్చుట లేదనుట అవివేకము.

7. ఫ్యాక్టరీబియ్యముతో నన్నప్రదానము చేయువారికి బుణ్య నాశనమై దారిద్ర్యము ప్రాప్తించును. సమారాధనములందు ననేకులీ అనారోగ్యకరమైన అన్నముదిని రోగములం జిక్కుదురు. ఈరోగ ములకుమూలకారకులు తత్సమారాధన కర్తలగుటచే వారి పుణ్యము నాశనమగును.

కావున ఆధునికభారతీయులు ధాన్యపుఫ్యాక్టరీలను నెలకొల్ప టయు, ఫ్యాక్టరీబియ్యపు అన్నమును దాముతిని, ఆతవుడు పశువులకు వేయుటయు నల్పాయుర్దాయము నాటిల్లచేయును. పూర్వకాలపు హిందువులవలె వీరు దీర్ఘాయువునొందగోరుదురేని వారు దంపుడుబియ్యము నాశ్రయించు టావశ్యకమై యున్నది.

## 12. కాఫీ.

ప్రాచీనహిందూసాంప్రదాయమున కన్యమై, పాశ్చాత్యనాగరకతాభ్యాసజనితమగు కాఫీస్వీకరించు వాడుక ఆసేతుహిమాచలదేశమందు నాధునిక భారతీయులలో నాగరకత నాలింగనము చేసిన ప్రతిహిందువునకును శల్యగతమై యున్నది. పట్టణములును, వ్యాపారస్థలములును పాశ్చాత్యసంపర్కముతోఁగూడియుండుటచే నీప్రాంతవాసులకు గ్రామములందు వసించువారికంటె మెండుగానుండు ఆచారము కాఫీ స్వీకరించుట. నాగరకులగు రాజాధిరాజులును, రాయబారులును,



సన్యాసులును, కూలివాండ్రును నీపానమునకలవడిరి. కాఫీత్రాగుటయు దాని నొరులకొసంగుటయు, గౌరవసూచకమైయున్నది. విద్యార్థులెల్లరకును ప్రాతఃకాలమందు దంతధావనాదులకన్న నీపానము ముఖ్యమై యున్నది. ఉద్యోగస్థుల కీపానము స్నానసంధ్యావందనాదులకుం బ్రత్యామ్నాయముగానున్నది. హిందూగృహములకు శుభకార్య, ఉత్సవసమయములందే తెంచు బంధుమిత్రపరివారమునకు కాఫీ యొసంగి సత్కరించుట ఆచారమైయున్నది. హిందూనారీమణులు, ఉదయముననే కాఫీ తయారుచేసి, దానిని గ్లాసులందుంచి, సూర్యోదయాత్పూర్వమందుగూడ మేల్కొనక శయనించుచుండు తమవల్లభుల పాన్పుల నొద్దనిలువబడి, వారుమేల్కొను సమయముఁ కనిపెట్టి హేమభూషణములతో ధ్వనించుచుండు తమకోమలహస్తములతో నాకాఫీగ్లాసు నొసంగుట ఆచారమగుచున్నది. మరియు, నాధునిక హిందూవిద్వాంసులును విరహిణులును, వీణపాటకులును, విశ్వకర్మలును, విప్రులును, విశంతువులును, వీరినిస్ఫురణకు దెచ్చు బోడితలలుగలవిద్యార్థులును స్వీకరించుచున్నది కాఫీ. వైశ్యులును, వేశ్యలును వ్యవసాయదారులును, వకీల్లును, స్వీకరించుచున్నది కాఫీ. మహారాజులును, మావటివాండ్రును, మంగలివాండ్రును, మాలమాదిగలును, స్వీకరించుచున్నది కాఫీ. భజంత్రీలును, శ్రోత్రియులును, క్షత్రియులును స్వీకరించుచున్నది కాఫీ. గొప్పభూస్వాములును, గొడ్లకాపరివాండ్రును, గొల్లవాండ్రును, గుఱ్ఱపువాండ్రును, గారడీవాండ్రును స్వీకరించుచున్నది కాఫీ. జమీందారులును, జంగములును, జూదరులును, జారకాములును స్వీకరించుచున్నది కాఫీ. కాపులును, కరణములును, రెడ్లును, కమ్మవారును స్వీకరించునది కాఫీ. పగడాలవర్తకులును, పగటివేషపువాండ్రును, పరభాగ్యోపజీవులును స్వీకరించుచున్నది కాఫీ. చక్రవర్తులును, చోదరులును, చాకలివాండ్రును, చమారీవాండ్రును స్వీకరించుచున్నది కాఫీ.

ఇంతియగాక లేఁబ్రాయము నుండియు ముద్దుహస్తములతో మెరయుచు సౌందర్యముతో నతిశయిల్లుచు, నాటపాటలయందు దృష్టిగలబాలురును, వృద్ధులును స్వీకరించుచున్నది కాఫీ. ధూమశకటారూఢులై హిందువులు స్వీకరించుచున్నది కాఫీ. పడవలందుఁ బయనమగుచున్నపుడును, మోటారులపైఁబడి పోవుచున్నపుడును హిందువులుస్వీకరించుచున్నది కాఫీ. పవిత్రతతోఁగూడిన ఉపన్యాసములిచ్చుటకుఁ బూర్వము హిందూస్త్రీ, పురుషులపెదవుల నపవిత్రతనొందించుచున్నది కాఫీ. ఈకాలపుహిందువులు శుభ, పుణ్యదినములందును, రాత్రులందును, నశుభసమయములందును, రోగములఁ జిక్కినపుడును నీపానమును జేయుచున్నారు. కాఫీగింజలు బజారులో లభింపనినాడు ఈపానమునకు బానిసలైన హిందువులెల్లరును, తల్లిలేని పిల్లలవలె వర్ణింపనలవికాని కలవరము నొందుచు మతిలేనివారై యొడలెరుంగకుందురు. సర్వకాలసర్వావస్థలందును, నాగరకులగు హిందువు లీపానమును ధారాళముగా జేయుచున్నారు.

ఈపానమును దయారుచేయుటకుపయోగింపఁబడు కాఫీగింజలు ప్రస్తుతము హిందూదేశమందే ఫలించుచున్నను, కాఫీ స్వీకరించుట పాశ్చాత్యులఆచారమైయున్నది. పాశ్చాత్యులు ప్రాచీనకాలమునుండియు, నీపానమును స్వీకరించువాడుకతో నున్నారు. వీరిగ్రంథములను, దేశచరిత్రములను బరికించినయెడల నీఅభ్యాసము వారిప్రాచీనాచారమని బోధపడగలదు. పాశ్చాత్యుల ప్రాచీనాచారము భారతీయుల నవీనాభ్యాసమై యున్నది. పరమపవిత్రమగు ప్రాచీనహిందూదేశచరిత్రములనదగు భారత, రామాయణములందు హిందువు లీయాచారము కలవారని యెచ్చటను వివరింపఁబడియుండలేదు. భరతవర్షమున సామ్రాజ్యాధిపత్యము వహించిన విక్రమార్కుండును, భోజమహారాజు మొదలగు ప్రభువర్యులకాలములందుగాని, మొగలాయిచక్రవర్తులగు



బేబరు, హుమాయూనులకాలములందుగాని భారతీయు లీపానము నెఱుంగరు. మఱియు హిందూదేశీయభాషలన్నిటియందును దీనిని "కాఫీ" "కాఫి" అనియే పిలుచుటవాడుకగాని ఈభాషలందు వేర్వేరు నామములు దీనికిలేవు. ఈఅంశములన్నియు కాఫీవిత్తనమును పాశ్చాత్యులు హిందూదేశమునకు వారిస్వంతఉపయోగమునకై తెచ్చియున్నట్లును, నాటఁగోలె నీచెట్టు హిందూదేశమందుఁ బెరుగుచున్నట్లును, నాగరకతావ్యాప్తివలన నీపానమును భారతీయులు దీక్షతో స్వీకరించుచున్నట్లును, స్పష్టపడుచున్నది.

ఈకాఫీపానము కూడ గింజవలెనే వెఁటుగ నుండును. పైత్యమును బుట్టించును. ఇందుఁ గలుపఁబడు క్షీరము కాకచేసి, శ్లేష్మమును బుట్టించుననియు, చక్కెర క్రమముగా శరీరమందుఁ దీపిపాలును హెచ్చించుననియు, కాఫీ త్రాగుటవలన ఆకలి అణగి ఉత్సాహమును జుఱుకుతనమును గల్గుననియు, వాతశరీము కలవారికే సంతోషకరమనియు నాయుర్వేదపండితులు తెల్పుచున్నారు.

ఈగుణములతోఁ గూడిన కాఫీపానము, శీతల, సమశీతల దేశీయులగు పాశ్చాత్యుల కత్యావసరమై యున్నది. వీరు సంవత్సరమందు విశేషకాలము గాఢమైన చలిచే బాధింపఁబడుచుందురు. వారిహేతువుచే శ్వేతరూపులై యున్నారు. చలియొక్క ఉగ్రతను వీరు నిరంతర మెదుర్కొనజూతురు. శ్వేతమునకు విరుగుడు సూర్యరశ్మియగుటచే శ్వేతరోగము కలవారు ప్రభాకరుని కభిముఖులై సూర్యనమస్కారములుచేసి కృతార్థులు గాఁగోరుదురు. శీతలదేశీయులు సతతము సూర్యరశ్మికై తపించుచుందురు. కావున వేసవికాలము వీరికిఁ బ్రాణమిత్రము. ఆత్మబంధువు. ఉత్సాహకారణము. వసంతఋతుసూచకమగు కోకిలస్వరము ఐరోపాదేశమున కుద్యానవనమనబడు మనోహరమైన "లంబార్డీ" మైదానమునందుఁ జెవిసోకినతోడనే నాటిసాయంకాలము

లోగా నైరోపాఖండమందున్న ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు, స్కాట్లండు, రష్యా మొదలగు దేశములందలి ప్రజలెల్లరకును, వార్తాపత్రికలీశుభవార్తను వెదజల్లును. ఈవార్తను ప్రజలు ఎడతెరిపిలేకుండ ఒకచోటనుండి మరియొకచోటికి వ్యాపింపఁజేయుదురు. తంతిఆఫీసులును, ధూమశకటములును, స్టీమరులును, ట్రాముబండ్లును, కిక్కిఱిసియుండును. ఈశుభవార్తవిషయమై టెలిగ్రాములు కురిసిపోవుచు. పాశ్చాత్యులు తమయుత్సాహమును దెల్పుటకై వారి ముద్దులబిడ్డలతో, బంధుమిత్రులతో నానందపరవశులగుదురు. నూతనవస్త్రములను ధరింతురు. విస్కీలు త్రాగుదురు. వారిజిహ్వ కత్యంతప్రీతికరమైన మృగఫలలములతోఁగూడిన విందులను గావింతురు. ఒకరికొకరు స్వాగత మిచ్చుచుందురు. సూర్యరశ్మి విశేషముగా వారి కెప్పుడు లభించునో యని యనుదినమును నిరీక్షించుచుందురు. రవియొక్క దివ్యకిరణములచే వారి యుత్సాహము మేఁలేసదగును. వారి శరీరములు నిరంతరము చలిచే నావృతములై యుండుటచే వేసవికాలమున వారిట్టిముదమును దెల్పుదురు. వారి కిందువలన వేడికల్గించు పదార్థములు భుజించుటయందు ప్రీతి. కాఫీ స్వీకరించుటవలన నందలి క్షీరమును గషాయమును వేడిమి పుట్టించున దగుటచే వీరి కీపాన మత్యంతప్రియము. దీనిని ద్రాగిన తోడనే వారి చలిబాధ యణగును. దేహమందు రక్తము చురుకుగా బ్రవహించును. ఉత్సాహము పుట్టును. బుద్ధి వికసించును. మంచిఆలోచనలు కల్గును. కార్యనిర్వాహకమందు దీక్షకల్గును. విజయము హస్తగతమై యుండును. ఈశీతల, సమశీతలదేశీయులకే గాక, ఇచ్చటనుండి ఉష్ణదేశములకుఁ బోయి వసించువారికి గూడ కాఫీపాన మిట్టిఫలితమే నిచ్చును. కావున కాఫీపానము పాశ్చాత్యుల కత్యవసరము. ఆనందదాయకము.



భారతీయుల కీవిధమగుసుఖము కాఫీ స్వీకరించుటవలన గలుగనేరదు. వీరు వసించు హిందూదేశము భూమధ్యరేఖ (Equator) కు సమీపముగా నుండుటచే, నీలగిరిజిల్లా, హిమవత్పర్వతప్రాంతములవంటి కొన్నిప్రదేశములు తప్ప, తదితరదేశము భాస్కరుని మహోగ్రమైన తేజస్సునకు లోఁబడియుండును. ఈసూర్యతేజస్సువలన భారతీయులు సాధారణముగా చామనచాయతో మెఱయుదురు. భానుని యుగ్రతచే వీరు పగటిపూట ఎడతెగని దేహపరిశ్రమ నొందునపుడు మేనులనుండి చెమ్మట కాలువలుగట్టి ప్రవహించుచుండును. హిందూదేశీయులు ఇందువలన శైత్యోపచారములకై నిరీక్షించుచుందురు. భారతీయులాది నుండియు నరుణోదయస్నాన మాచరించుటకుఁ గారణ మిదియే పగలు ప్రకాశించు సూర్యరశ్మియొక్క యుగ్రత నీరీతిగా నెదుర్కొన యత్నించుటకే గాక భారతమాతయొసఁగు దివ్యపదార్థము లనుభవించుటకై పరమేశ్వరుఁడు హిందువులకై వేసవికాలమును, నుష్ణమును నిర్మించినట్లు గోచరంబగుచున్నది. భారతీయులు ప్రశస్తములగునారికేళములైన గంగాబోళములందలి జలముఁ ద్రావుచుందురు. శైత్యోపచారమై మనోహరమైన పరిమళము విరజల్లు, మంచిగంధము ననుదినమును బురుషులు తిలకముకై ఉపయోగించుచు, స్త్రీ, పురుషులు శయ్యాగృహమందుఁ దమతమ శరీరములకుఁ బూసుకొనుచుందురు. తెల్లచక్రకేళులను విరివిగా స్వీకరింతురు. తాంబూలమున బచ్చకర్పూరము, చలువమిరియముల నుపయోగింతురు. చెఱుకుకఱ్ఱలను దినుచు, నాపానకమును గ్రోలుదురు. పుచ్చకాయలను, మాందీఫలములను భుజింతురు. అనాసపండ్ల నారగింతురు. మృత్పాత్రలందుంచఁబడిన శీతలోదకమును ద్రావుదురు. శైత్యోపచారమగు జిన్నముక్కవంటి పెరుగు నన్నములో గలుపుకొని స్వీకరింతురు. మనోహరములగు గులాబి, మల్లె, మొగలి, సంపంగి, పారిజాతము, పొగడ మొదలైన పుష్పశ్రేష్ఠముల

నాఘ్రాణింతురు. సంవత్సరమందు విశేషదినములు వీరీరీతిగా వర్తించుచు వసంతఋతువునందు దినములందు రెండుమూడుసారులు జలకమాడి, ఆనందపరవశు లగుదురు. ఈవిధముగా శైత్యోపచారములచే, దేహారోగ్యమును రక్షించుకొనుచుండు హిందువులకు నుష్ణపదార్థములు ప్రాణసంకటములుగా నుండును. కాఫీగింజ వేడిచేయుననియు, క్షీరము కాకచేయుననియు, నాయుర్వేదశాస్త్రజ్ఞులు వచింతురు. ఉష్ణదేశీయులై, ఉష్ణము నను దినము నరుణోదయస్నానాదులచే జయింపగోరు భారతీయులకు, కాఫీపానము వారిదేహములందు ప్రవేశించి వేడిని వృద్ధిచేయుటవలన ననారోగ్యము ప్రాప్తించును. కావున భారతీయులకు కాఫీపానము అనారోగ్యకరము, అనవసరము.

తమకు అనవసరమైన ఈకాఫీపానమున కలవడుటచే భారతీయులకు దేహమందు వేడి జీర్ణించి, మేహాదిరోగములు కలిగి దీర్ఘాయువీరీతిగా నశించునని ఆయుర్వేదపండితులు వచించుచున్నారు:—

1. ఈమహోష్ణతవలన శరీరమందు నానావికారములును బుట్టును. పైత్యించి, దేహమందంతటను దురదలు, మంటలు కలిగి, ఉత్సాహహరణమగుటచే దీర్ఘాయువు కడుదూరమగును.

2. మహోష్ణతవలన రక్తము పలుచనై, దౌర్బల్యమంకురించును. వీర్యనష్టము గలుగును. దుర్బలులకు విశేష సంభోగవాంఛ యుండుననియు, బలవంతులకు మితముగ కామమే యుండుననియు నాయుర్వేదనిపుణుల యభిప్రాయము. కావున కాఫీ అభ్యాసము వలన కలుగు దుర్బలత్వమును, వీర్యనష్టమును, దీర్ఘాయువునుఁ జెరచును.

3. రక్తము పలుచనగుటవలన శిరోరోగము లంకురించును. తలవెండ్రుకలు నెరియును. బాల్యమందు ఇట్టిమార్పు కలుగుటవలన కళాకాంతులు నశించును. మరియు తలవెండ్రుకల కుదుళ్లు పటుత్వము లేనివై, ఊడిపోవును. తలయందు, పఱద, చుండ్రు మొదలగు వికారము లుద్భవించి, ఉత్సాహమును జెఱచును. యౌవన మీరీతిగా చెడుటచే, దీర్ఘాయువు లభింపదు.



4. మహోష్ణతవలన నేత్రరోగములు కూడ కల్గునని ఆయుర్వేదవైద్యులు తెల్పుదురు. నేత్రమందలి బహుసున్నితముగానుండు దృష్టియంత్రములు, శిరస్సునందుండు వేడియొక్క ఉగ్రతను భరింపజాలక క్రమముగా చెడును. నేత్రరోగములగు దురదలు, మంటలు మొదలైనవి జనించి అకాలపుచత్వారము ప్రాప్తించును. ధనవ్యయముతోఁగూడిన సులోచనములవసరమగును. హిందూయువజనులు ధరించు ఈసులోచనములు బంగారుతో దయారైనను, నివి వారి నాశికలకును గన్నములకును భారమును గల్గించును. ముఖమండలమునకుఁ గళంకమునే దెచ్చి సహజలావణ్యమును జెఱచును. ఇట్టికళంకముతో గన్పడు హిందూస్త్రీ, పురుషులు తమతమ సతీపతులకుఁ దగిన యనురాగమును గల్గింపనేరరు. అందువలన ననుకూలదాంపత్యము కుదరజాలదు. ఆయుర్వృద్ధి కలుగదు.

5. మహోష్ణతవలన కర్ణరోగములగు చెవులో హోరు, చీము కారుట, పోటు మొదలైనవి పుట్టును. ఉత్సాహము నశించును.

6. ఈమహోష్ణతవలన దంతవాతము పుట్టును. పండ్లనుండి, చీము, రక్తము కారును. వాని పటుత్వము చెడును. కఠినమైన భోజనపదార్థములను దినుటకు గష్టమగును.

7. హిందూవిద్యార్థులకు మెదడుజ్వరములు పుట్టి, ప్రాణాపాయము కలిగించుచున్నవి.

8. మహోష్ణతవలన మనశ్శాంతి చెడి, ఆలోచనశక్తినశించుటవలన బుద్ధిబలము, దీర్ఘాయువును తొలగుచున్నవి.

9 కాఫీత్రాగుటవలన కలుగువేడివలన దేహమందుబుట్టుజాడ్యము

తనము నరములకెక్కుడు పనినిచ్చును. అవి అసాధారణగమనికకలవై బింకము, పట్టుత్వములేనివై దౌర్బల్యమును దెచ్చును.

10 దేహమందలి నరములును, రక్తమును దుర్బలత్వమునకు లొంగుటవలన, కాఫీ స్వీకరించు హిందువులకు రోగోత్పత్తి సులభముగా నగును. ఈఅభ్యాసములేని హిందువుల శరీరము, కోటబురుజువలె బలముతోఁ బ్రకాశించుచు, జబ్బులకుదూరమైయుండి, ఆరోగ్యముతో నలరారు. కాఫీ అలవాటుకలవారిశరీరము వెదురుతడకవలె నంటురోగములకును, విషరోగములకును, దఱుచుగా లోఁబడుచుండును. పూర్వకాలమునుండియు భారతీయులీయలవాటులేనివారై ఉక్కుతునకలవంటి సంతానమును బడయుచు, దీర్ఘాయురశ్వారోహణము చేయుచుండిరి.

11 ఈకాఫీపానమునందున్న వేడిచేయు స్వభావమువలన హిందువులకు దత్వభేదము కలుగుచున్నది. కాఫీగింజవేడిమి కల్గించును. క్షీరముష్ణదాయకము. శ్లేష్మవృద్ధి. ఇందువలన నీఅభ్యాసముకల హిందువులకు సహజతత్వము మారిపోయి శ్లేష్మతత్వముకల్గును. కుళ్లుదగ్గు ప్రారంభమగును. దేహము శుష్కింపఁదొడగును. శరీరమందుండు వేడితో నీశ్లేష్మముచేరియుండుటవలన ద్వంద్వతత్వము ఏర్పడును. ఇట్టి తత్వముగల సంతానమేకల్గును. శ్రోత్రియులకత్యంతప్రీతికరమైన ఆయుర్వేదౌషధములగు కాంతలోహము, బాలసూర్యోదయముమున్నగునవి ఈతత్వముల కుపయోగింపనందున కాఫీ అభ్యాసముకలవారు ఆయుర్వేదశిఖామణుల చెంతనున్నను, వారిచ్చుఔషధముల ఫలితములనొందజాలక, దీర్ఘాయుశ్శూన్యులగుదురు. మరియు వీరిశరీరములందుండు నాడి బరీక్షించుట కష్టము. క్రమమైననాడికి మాఱుగా "దొంగనాడి" అట్టివారికిఁగలదని ఆయుర్వేదనిపుణులువాక్రుచ్చుచున్నారు. ఈనాడి



కల వారారోగ్యవంతులవలెనున్నను, నూతనరోగపీడితులై ఆకస్మికముగ మృతినొందుదురు.

12 కాఫీత్రాగువారికి మహోష్ణతచే, సుఖనిద్ర లభింపదు. ఇందువలన శరీరారోగ్యనాశన మగును.

కాఫీ స్వీకరించు అలవాటుకలవారు, శరీరమందు తీపిపాలుకలవారై దీర్ఘాయువును గోల్పోవుచున్నారు. ఈపానమునందలి చక్కెర దీనిననుదినమును గాని తఱుచుగా గాని త్రాగువారిశరీరమందు బ్రవేశించి, క్రమముగా వృద్ధినొందును. హిందువులనేకులు మితమగు పరిమాణముతోఁ దృప్తినొందక నొకేసారి అర్ధశేరు, శేరున్నర పరిమాణమైన కాఫీ త్రాగుదురు. ఈపానము నుపయోగించువారికి రక్తబలము తగ్గినపిమ్మట మధుమేహము, అతిమూత్రము, మేహరణములు, నారికురుపులు మొదలైనవ్యాధులు కలుగునని ఆయుర్వేదవిద్వాంసులు వివరించుచున్నారు.

హిందూదేశస్థులకు కాఫీపానమువలన జఠరాగ్నినశించుటచే బలము క్షీణించి వారల్పాయువ్వంతులగుటకు మార్గమేర్పడినది. ఈపానమును, హిందువులు తమతత్వములకుఁ దరతరములనుండియు నలవాటుపడియున్నభోజనమునకు మాఱుగా నుపయోగించుటవలన నాకలిపూర్ణముగా జల్లారనేరదు. కాఫీపానము నుపయోగించినవారి కుత్సాహముకలిగినను, నది వారిజఠరాగ్నిని శమింపఁజేయు విధము కాదు. మానవులుభుజించు ఆహారమును జక్కగాహరింపఁజేసి జీర్ణకోశములను శుభ్రపఱచునది జఠరాగ్ని. ఆకలిశక్తినిగల్గించి, శరీరారోగ్యమును రక్షించునది జఠరాగ్ని. ఎట్టికఠినమైన పదార్థములనైన జీర్ణింపఁజేయునది జఠరాగ్ని. ఏదిసుఖదాయకమని తెనాలి రామకృష్ణుఁడు కృష్ణదేవరాయుల కెఱిఁగించి, ఆతని మెప్పింపగల్గెనో అట్టిసుఖవిరేచనముఁ గావించి, శరీరమునకుల్లాస మొసఁగునది జఠరాగ్ని. ఏశరీ

రమందు విశేషముగా జఠరాగ్ని కేదో, ఆశరీరము నీరోగమై చిరకాలము వర్ధిల్లు. ఏశరీరమును జఠరాగ్ని ఎడబాయుట ప్రారంభించునో ఆశరీరము జిహ్వాకు ప్రీతికరమైన భోజనపదార్థములను స్వీకరింపజాలక ఉత్సాహరహితమై, దీర్ఘాయుః పుణ్యక్షేత్రమునకు దూరమైయుండును. పూర్వకాలపుహిందువులు ధర్మయుక్తముగా వర్తించుచు జఠరాగ్నితో విలసిల్లుచున్నందున, వారొకేపర్యాయము విందులయందు సుమారు వీసెడు ఘృతముతో వందలకొలది బూరెల నవలీలగా స్వీకరింపగల్గుచు, వానిని జీర్ణముగావించుకొనుచు నిర్వికారులై ప్రకాశించుచుండిరి. జఠరాగ్ని ననేకకారణములచే బోగొట్టుకొనుటవలన నీకాలపుహిందువులు బూరెలను నొక్కిజిదుపుటకైనను దగినదార్ఢ్యములేనివారైయున్నారు. ఆకలికలిగినవెంటనే యుక్తకాలమందు శరీరతత్వమునకు జీర్ణకాలము నుండియు వాడుకయైయున్న భోజనపదార్థములను, స్వీకరించి, దానిని బూర్ణముగా శమనపరుపవలెను; కాని కాఫీ, గంజాయి, హ్విస్కీ- మొదలగువానిని హిందువులుపయోగించి క్షుద్బాధయొక్క ఉగ్రతను బలవంతముగా నణచుటకు బ్రయత్నింపబూనుట అవివేకము, ఏలనన జఠరము అగ్నిహోత్రమువలె వెలుగుచుండును. అగ్నిహోత్రమునకు యుక్తకాలమందు మంచివంటచెఱకు వేయుటయెట్లవసరమో, జఠరమునకుం గూడ యుక్తకాలమందు శరీరతత్వమున కభ్యస్తమై యున్న పదార్థములను దినుట ముఖ్యము. యుక్తకాలమందు మంచి వంటచెఱకు కగ్నియందుంచనిచో, నిప్పులు నుసిక్రిందమారిపోయి,నిప్పు చల్లారిపోవును. ఆకలికల్గినపుడు జఠరాగ్ని మంచిస్థితిలోనుండును అప్పుడు సాధ్యమైనంత త్వరలోతత్వమునకుజీర్ణకాలము నుండియు నభ్యస్తమైన భోజనముచేయవలెను. భోజనమునకు మారుగా కాఫీపాన మానమయమునందు జేయువారి జఠరము మంచిఆహారముచే శమనింపబడక క్రమముగా నశించును. హిందువులకీరీతిగా కాఫీపానము జఠరాగ్నిని



నాశనముచేయుచున్నందున నాధునిక హిందువులలో నీఅభ్యాసము కలవారు బలలావణ్యశూన్యులై, వికారపుమేనులతోగూడియున్నారు. శీతలదేశీయులగు పాశ్చాత్యులజఠరాగ్ని కాఫీపానమువలన నశింపదే? భారతీయులకేల నశించునని శంకకలుగుట సహజము. వారికీపానము తరతరములనుండియు, నాచారమైయున్నది. భారతీయులకిది నూతనాభ్యాసము. వీరితాతలుగాని, తండ్రులుగాని నీపానమెఱుంగరు. కావున భారతీయుల శరీరతత్వమునకు కాఫీపానము విరుద్ధమైన పదార్థము. మరియు పాశ్చాత్యులు కాఫీపానజనితమైన అగ్నిమాంద్యమును, వారి ధర్మయుక్తమై, హిందూమతాచారవిరుద్ధమైన బ్రాంది, హ్విస్కీలను ద్రాగి జయింపగలరు. కావున హిందువులు కాఫీ స్వీకరింపకుండుట శ్రేష్ఠము.

ఇన్నిరీతులచే హిందువులారోగ్యమును కాఫీపానము జయించుచున్నందున, వీరికి నిరంతరాయసేవ అవశ్యకమగుచున్నది. నూతన రోగములు భరతవర్షమును ముట్టడించుచున్నవి. రోగములన లక్ష్యము లేని భరతవర్షము, రోగపూరితమైయున్నది. కాఫీపానమును భారతీయులు మానుకొనరేని దేశమందలి 100 కి 99 గురు వైద్యుల వ్యాకులతలేనివారగుదురు.

కాఫీపానముహిందువులారోగ్యమునే గాక, వారిమతమునుగూడ చెఱచుచున్నది. కాఫీస్వీకరించు పాత్రలగు గ్లాసులు హైందవసాంప్రదాయకమైన ఝారీ, పంచపాత్రి, కమండలము మొదలైన జాతీయ పాత్రలను మూలపడవేయించుచున్నవి. వివాహసమయములందు జామాతకు మామగారు కాళ్లుకడుగునపుడుపయోగించుచున్నది కాఫీగ్లాసు. దేవాలయములకెపుడేంబోయి అభిషేకములుచేయు సమయమందు హిందువులుపయోగించుచున్నది కాఫీగ్లాసు. మతగురువులపీఠములయొద్ద కన్పించుచున్నది కాఫీగ్లాసు. వీరికి బిక్షలుచేయునపుడు

గృహస్థులువాడుచున్నది కాఫీగ్లాసు. హిందువులు బాటసారులకు దాహమిచ్చునపుడుపయోగించుచున్నది కాఫీగ్లాసు. కుమ్మరులిండ్లయొద్దను, కమ్మరులిండ్లయొద్దను, కన్పించుచున్నది కాఫీగ్లాసు. కన్నెరికపుగదులయందు పగానవచ్చుచున్నది కాఫీగ్లాసు ఈగ్లాసులను విశేషముగా హిందువులుపయోగించుచు, శ్రీశంకరాచార్యులు, నారద వశిష్టాదులును ఉపయోగించిన కమండలములను, కలశలను నుపయోగించమిచే హిందూమతాభిమానము పూజ్యమగుచున్నది. పుణ్యదినములందును, పర్వదినములందును, పితృదేవతాదిదినములందును ఈపానమునుద్రాగుచుండుటచే బవిత్రతనాశనమైపోవుచున్నది. వర్ణజాతినయోనివక్షతయు పుణ్యపాపముల తారతమ్యమును లక్ష్యముచేయక అగ్రజాతివారు వికారపుమేజులతోను, మలినవస్త్రములతోను నీపానముపయోగించుటచే నితరులకు వీరియెడల బ్రహ్మద్వేషమంకురించినది ఈయభ్యాసము బ్రాహ్మణుల స్నానసంధ్యావందనాది ధర్మములను మట్టడించినది. ద్రవపదార్థమగుటచే కాఫీపానము సజాతీయమగు మద్యము కడకుంగూడ నీడ్చుకొనిపోవుచున్నది. ఈరీతిగా హిందువులు అనవసరముగా కాఫీత్రాగుటవలన హిందూమతమును జెఱచుచున్నారు. హిందూమతాచారము చేయువారు 1911 కంటె 1921లో 8,50,000తగ్గిరి.

కాఫీపానమును హిందువులు మానుటవలన వారికి తలనొప్పి, కండ్లుమంటయు మొదలగు వికారములు కలుగకుండునట్లు ఆయుర్వేద వైద్యులుపరిశ్రమలుపడి "ఆరోగ్యవర్ధనీ"యను క్రొత్తచూర్ణమునుగనిపెట్టిరి. ఇది రాజమహేంద్రవరమునందున్న పొన్నాడ భాస్కరము సోదరుల ఆయుర్వేదవైద్యశాలయందు దయారైయున్నది. దీనిని స్వీకరించువారు కాఫీపానము విడనాడుటవలన గలుగు వికారములను జయింతురు. కాఫీపానజనితమైన రోగములనుండి విముక్తినొందుదురు. కాఫీపానమవసరముండదు. శరీరమత్యంతపటుత్వముతో, సౌందర్యముతో



నొప్పారుప్రజల సౌకర్యమునకై దీనిని స్వల్పమూల్యమునకిచ్చుచున్నారు. దీని ననేకులుపయోగించి శీఘ్రకాలములోనే కాఫీపానముచేయు నగత్యము లేనివారైరి. ఆయుర్వేదవైద్యులగు వీరు, హిందువులను కాఫీ అభ్యాసమునుండివిముక్తులు గావింపగంకణము కట్టుకొనుట ఎల్లరకు నుత్సాహ కారణము. హిందూమతోద్ధారణమునకు ఘనసాహాయ్యము

—*13 కాఫీహోటలు.*—

ఈకాలమందు నాగరతావ్యాప్తిచే హిందూదేశమందెల్లెడలను కాఫీహోటళ్లు స్థాపింపబడుచున్నవి. పాశ్చాత్యులుపయోగించు "రిఫ్రెషుమెంటురూమ్సను"బోలియుండునట్లు భారతీయులు వారిపద్ధతుల నాచరింప నత్యాసక్తులై కాఫీహోటళ్లను స్థాపించుచున్నారు. ఈశతాబ్దారంభమునుండియు నీహోటళ్ల సంఖ్యను నాగరకతావ్యాప్తి వృద్ధినొందించుచున్నది. ఈనాగరికతా విజృంభణము హిందువుల ప్రాచీనవృత్తులకు మార్పులు తెచ్చినది. ప్రయాణసాధనము లందమ్మృతమగు క్రొత్తమార్పులు గావించినది. హిందువుల కాలనియమములకు భిన్నములైన పరిస్థితులను గల్గించినది. నాటకాదిప్రదర్శనములను బ్రవేశపెట్టినది. కపట మెఱుంగని పల్లెటూరి సేద్యగాండ్రను గపటపూరితములైన పట్టణముల కీడ్చుకొని వచ్చుచున్నది. స్వాతంత్ర్యపు బీజములను దశదిశలందును విరజల్లుచున్నది. ఈమార్పులవలన హిందువులు తమ గృహములనుండి దూరముగానుండుట తటస్థమగుచున్నందున వీరు క్షుద్బాధ నివారణార్థమై ఏవేని భోజనపదార్థములను భుజించు నవసరము కలుగుచున్నది. అందువలన గత ఇరువది వత్సరములనుండియు నీకాఫీహోటళ్లు భరతవర్షమున నభివృద్ధినొందుచున్నది.

ఈహోటళ్లయందు భోజనపదార్థములు తయారుచేయబడి, హోటల్ యజమానునిచే విక్రయింపబడును. ఈశాలలందు కాఫీపానమేగాక ఆమవడలు, మినపకుడుములు (ఇడ్లీ) నిమ్మకాయరసముతో

వండబడిన గోధుమరవ్వ మొదలైనవి తయారగును. హోటలు కేతెంచువారలకు యజమానుండు వీనిని మూల్యమున కిచ్చును.

భారతీయులు ఈహోటళ్లను స్థాపించి, భోజ్యవిక్రయ మొనరించుటవలన హిందూధర్మవిరుద్ధములైన పనులు జరుగుచున్నవి.

మనుష్యాన్ప్రాణాన్ గంధానన్నం చర్మగవాం
వశాఙ్శ్లేష్మోదకే తోక్మకిణ్వే పిప్పలిమరీచిధాన్యంమాంసమాయుధఙ్ంసుకృతాశాంచ

అని ఆపస్తంభ ధర్మసూత్రం ప్రథమప్రశ్నం, ఏడవపటలమందు వివరింపఁబడియున్నది. ఈశ్లోకము అన్నవిక్రయము చేయుట పాపకార్యమని తెలుపుచున్నది. అన్నవిక్రియముతోఁ దుల్యముకావున భోజ్యవిక్రయము కూడ పాపకార్యమనియు, భోజ్యవిక్రయిదారుఁడగు కాఫీహోటల్ యజమానుఁడు పాతకుఁడనియు, స్పష్టమగుచున్నది. ఈకాలమున నగ్రజాతి హిందువులగు బ్రాహ్మణులు మొదలు సర్వవర్ణస్థులును గాఫీహోటళ్లను స్థాపించి భోజ్యవిక్రయము చేయుచు ధనార్జనపరులగుచున్నారు. ప్రాచీనకాలమునుండియు నన్నప్రదానమునకు వన్నెకెక్కిన భరతవర్షమందు ఈకలికాలములో నన్నవిక్రయముతోఁ దుల్యమైన భోజ్యవిక్రియము జరుగుచున్నది. ప్రాతఃకాలమందు స్నానాదులొనరించి, నిర్మలవస్త్రధారులై కిటకిటలాడుచు దేవాలయములకు జని దేవదర్శనము చేయు భారతీయులు, ఈకాలమందు దంతధావనమైనను యుక్తముగా నొనరింపక, మలినవస్త్రధారులై మందలు మందలుగా బయలుదేరి కాఫీహోటళ్లకుఁ బోయి మహాపాతకుఁడగు తచ్ఛాలాధిపతిమొక్క దర్శనము చేయుచున్నారు. భగవద్ధ్యానతత్పరులై, దేవాలయములందు పురాణశ్రవణసత్కాలక్షేపములు చేయుచుండిన భారతీయులు, ఈకాలమందు నీశ్వరధ్యానశూన్యులై, కాఫీహోటళ్లయందు జారత్వాదిసంబంధమైన దుష్టసంభాషణములొనరించుచున్నారు. శుభకరమనియు, నైశ్వర్యదాయకమనియు, దేవతాప్రీతికరమనియు, హిందువులచే భావింప



బడు దేవతాప్రసాదమును దేవాలయములందు గైకొను భారతీయులు ఈకాలమున నమంగళకరమై, దారిద్ర్యహేతువై ప్రేగులకు భీతికరమైన కుడుములను కాఫీహోటళ్లయందు దినదినమును నుదరపోషణార్థమై తినుచున్నారు. స్నానసంధ్యావందనాదు లాచరించి యుక్తకాలనియమములననుసరించి భోజనపదార్థముల నారగించు ద్విజులు, ఈకాలములో సదాచారనియమశూన్యులై బాటయందుఁబచ్చిక గలచోట్లయందెల్ల పశువులు మేయుచు తెఱంగున పూతముగల పుంటిపైమక్షికము వ్రాలుమాదిరి కాఫీహోటల్ కన్పించుస్థలములందెల్ల స్వల్పాహారములను దినుచున్నారు. ఈరీతులగా కాఫీహోటళ్లవలన నాగరకభారతీయులెల్లరును, పశుప్రాయులగుచున్నారు.

ఈకాఫీహోటళ్లను నాగరక భారతీయులు ఏగి వానియందు స్వల్పాహారములను స్వీకరించుటవలన వీరి దీర్ఘాయువు భస్మీపటలమై పోవుచున్నది. ఇచ్చోట్లు ప్రదేశ, పాత్ర, పదార్థ, పాచక దోషములతో నిండియున్నందున నిట్టి ఫలితము సంభవించుచున్నది.

ఈహోటళ్లయందలి ప్రదేశ మనారోగ్యకరమై యున్నది. ఇవి పట్టణములందును, వ్యాపారస్థలములందును మెండుగా నుండును. ఈహోటళ్లను జేరి దోమలు, ఈగలు మొదలగు కీటకములతోఁ గూడిన మురికినీటి కాలువ లుండును. ఇవి నానావిధకల్మషములతోఁ గూడినవై హోటళ్లయందు దాసీనులైయుండువారి శరీరములపై వ్రాలి వారల యారోగ్యమును జెఱచును. ఇచ్చోట్ల కేతెంచువారియందు నంటురోగములు, చర్మరోగములు కలవా రనేకులుండురు వీరారోగ్యవంతులను స్పృశింతురు. అచ్చటి వాయువు మలినమగునట్లు తమ యూపిరిని విడుచుచుందురు. ఈరోగులు త్రొక్కిన ప్రదేశము నారోగ్యవంతులు పాదరక్షలు లేనివారై త్రొక్కుదురు. వారుకూర్చున్న బల్లలమీఁద ఆరోగ్యవంతు లాసీనులగుదురు. ఈబల్లలు, హిందూగృహములందు భోజ

నకాలమందుపయోగింపబడు పీటలంతె శుభ్రపఱుపఁబడవు. మరియు నీహోటళ్లయందు సాధారణముగా దుష్టవాయువు పోవుటకును, పరిశుభ్రవాయువు ధారాళముగా బ్రవేశించుటకును, దగిన గవాక్షములుండుటసుదు. ఇచ్చట పదార్థములను వండుటకేర్పడుచోటనుండి పొగ స్వల్పాహారములను స్వీకరించువారి కండ్లయందుఁ బ్రవేశించి వారి యుత్సాహమును జెఱచును. ఈవిధమైన ప్రదేశదోషమువలన గాఫీహోటళ్లకుఁ బోవుటచే నారోగ్యము చెడును.

పాత్రదోషమువలన గూడ కాఫీహోటళ్లకేగువారి కారోగ్యము చెడుచున్నది. ఇచ్చటి పాత్రలు మలినముతో గూడియుండును. ఇవి అనుదినమును శుభ్రపఱుపఁబడవు. ఒకవేళ, శుభ్రపఱుపబడినను, వీని నుండి మలినము పూర్తిగా తొలగనేరదు. మరికొన్నిచోట్ల వీనిని తొట్టియందుంతురు. వీని నంటియుండు మలినము తొలగకపూర్వమే కడు తొందరగా జలమందు వీనిని ముంచుట హోటలునందు బనిచేయు వారి ఆచారము. కాబట్టి రోగపీడితుల శరీరములనుండి ప్రవేశించు కల్మషములు, కాఫీగ్లాసులు పళ్లెములు మొదలగువానిని వదలక యంటిపెట్టుకొని యుండును. ఆరోగ్యవంతులు ఈహోటళ్లకేతెంచి యిట్టి దోషములతో నిండియుండు పాత్రలను వీరువారనక నోట గఱచుకొని త్రాగి అట్టిరోగములఁ బాలగుదురు. అంటురోగపుక్రిములు లీవిధముగా కాఫీహోటళ్లయందలి పాత్రలనుండి వ్యాపించును కావున క్రీ. శ 1918 వ సంవత్సరమందు నైరోపామహాసంగ్రామముయొక్క యంత్యావస్థయందు ఇండియాపై బయల్వెడలిన విషజ్వరములు ప్రబలుచున్న కాలమందు బ్రిటిషుదొరతనమువారు కాఫీశాలలకుఁ బోఁజనదని ప్రజల సౌకర్యమునకై భరతవర్షమందు బ్రకటించియుండిరి. ఈహోటళ్లకేగు ఆచారము కలవారు పాత్రదోషముచేఁ దమఆరోగ్యము చెడుచుండుట



గ్రహింపఁజాలక మిక్కిలి జాగరూకతో నున్నను తమకుఁ గుళ్లదగ్గు, క్షయ మొదలగు రోగములు కలుగుచున్నవని విలపింతురు.

పదార్థదోషము ఈహోటళ్లయందు ననేకరీతులుగా నారోగ్యమును జెరచుచున్నది. భోజ్యవిక్రయదారుఁడగు హోటల్ యజమానుని ప్రధానోద్దేశము కొద్దిధనవ్యయముతో శీఘ్రకాలములో, నెక్కువలాభము నొందుట అని సర్వజనవిదితము. కొలదివెలకు లభించు సీకాయపొడినుండి తయారైన కషాయము కాఫీకషాయమునకు మారుగా నీహోటళ్లయందుపయోగింపబడుచున్నది. ఇది కాఫీపొడివలె వెగటుగా నున్నను, మానవుల ఆరోగ్యమును దఱుమును. లాభము నొందుటకై కాఫీహోటల్ యజమానుఁడు సులభమూల్యమునకు లభించు, అనారోగ్యకరమై, రోగపూరితమైన పశువుల క్షీరము నుపయోగించి కాఫీ తయారుచేయును. శుభ్రమగుక్షీర మొకవేళ ఆతనికి లభించినను, నందపరిశుభ్రమైన జలమును గలుపును. లాభమునొందుట ఈతని ప్రధానోద్దేశమగుటచే, భోజ్యములను దయారుచేయుట కీతఁడు కొద్దివెలకు లభించు వేరుశెనగనూనెయు, దుర్గంధమైన ఘృతము నుపయోగించును. ఇచ్చట తయారుచేయబడు మినపకుడుములు (ఇడ్లి) యుక్తముగా వండబడవు. అవి చక్కగా నుడుకకపూర్వమే పాత్రనుండి తీయబడును. దేహారోగ్యకరమై యుండుటకు నవి ఆయుర్వేదము ప్రకారము, రెండుగంటలకాలము సన్నని మంటపై నుడుకవలెను. ఇంతియగాక పదార్థములు తయారైనపిమ్మట యజమానుఁడు వానిని బ్రదర్శించుటచే నానావిధకల్మషముల మీఁదను, ఎంగిలిపాత్రలమీఁదను, మలినదేహుల శరీరములమీఁదను వ్రాలిన ఈగలు, ఈపదార్థములపై వ్రాలి వానిశుభ్రతనుఁ జెఱచును. లాభమునీయుటకై ఈయజమానుడు నిలువసరుకులను మంచిసరుకుల

తో మిశ్రమము చేయును. ఈపదార్థదోష మతిత్వరలో వ్యాధులను బుట్టించును.

ఇచ్చటనుండు పాచకదోషమువలగూడ ఆరోగ్యము నశించును. యజమానుఁడు నౌకర్లచే బనులుచేయించును. వీరంతయును మలిన దేహములతో నుండి స్నానమైననాచరింపక, పదార్థములను వండుదురు. వానిని ముట్టుకొనిశాలకే తెంచినవారలకొసఁగుదురు. మరియు, వీరు. మలినవస్త్రధారులైయుందురు. కొన్ని శాలలందుఁ బాచకులు "బని యనులు" ధరించి, నోటపండ్లుదోముకొనుపుల్లగలవారై కాఫీ మొదలగు వానిని దయారుచేయురుదు. ఇట్టిమలినముతో గూడినవారు ఈహోటళ్ల యందుఁ బానాదులకుపయోగింపఁబడు జలమును ముట్టుకొందురు. ఇట్టిపాచకదోషమువలన దేహారోగ్యముచెడును.

ప్రదేశాదిచతుర్విధదోషములచే గల్గు ఆనారోగ్యము ఈహోటళ్లయందు భుజించువారి ఆయుర్దాయమును నశింపఁజేయును. కాఫీ స్వీకరించుటవలన గల్గునష్టములన్నియు గల్గును. ఆంటురోగములును. నూతనరోగములును, నీహోటళ్లవలన వృద్ధియగుట కవకాశము కలదు. ఈహోటళ్లుయమపురికి రాచబాటలని వక్కాణింపవచ్చును.

ఆనారోగ్యము కల్గించుటవలననేగాక నీహోటళ్లు దుష్టవర్తనమునకుఁ జేయూతనిచ్చి, అధునిక హిందూయువజనుల దీర్ఘాయువును జెఱచుచున్నవి. వీరు హిందూసాంప్రదాయమగుచలిదియన్నమునకుమాఱుగా నీశాలలకేగుచు,నిచ్చటక్రయముయొసఁగినచోభోజ్యములులభించునని గ్రహించి, తలిదండ్రులతో బోరాడియు, ననేకమాయోపాయములును, మోసకృత్యములును నాచరించియు, రొక్కమును దెత్తురు. వీరీరీతిగా చోరత్వాదిగుణములు కలవారై దేవ, గురు పితృభక్తి విరహితులై చిన్నపెద్దతారతమ్య మెఱుంగక, వేదమార్గులను, బరిహసిం



చుచు, హిందుధర్మములను గ్రహింపక, హిందువులయ్యును వాని నాచరింపక దీర్ఘాయురైశ్వర్యముల కెడమగుదురు.

కాఫీహోటళ్లు హిందూమతమును ధ్వంసము చేయుచున్నవి. ఇచ్చోట్లకు నానావిధములైన మనుష్యులు నేతెంతురు. వీనియందుఁ బవిత్రతతోఁ గూడిన హైందవాచారము లాచరింపఁబడవు. గౌరవింపబడవు. వర్ణసాంకర్యమునకు మార్గమిచటనుండియే ప్రారంభమగును. బ్రాహ్మణులశ్రోత్రియ మీహోటళ్లకేగుటవలనసమసిపోవుచున్నది. మరియు, లాభమునొందుటకై చెడుపదార్థముల నుపయోగించి భోజ్యములను దయారుచేయు శాలాధిపతి పాతకుఁడుగాన నీతనిదర్శనము, సకలపుణ్యములను హరించి సకలైశ్వర్యంబులను దొలగిపోఁజేయును. ఈహోటళ్లయందుఁదిననతోడనే వ్యయప్రయాసములకోర్చి సంపాదించిన కాశీరామేశ్వర యాత్రాఫల మంతరించును. ఈశాలలకుఁ జనుట పాశ్చాత్య నాగరకతాభ్యాసజనితము. రోగికపథ్యపదార్థసేవ వంటిది. ద్రవ్యనాశనమునకు బ్రథమఘట్టము. మద్యమాంసాదులు స్వీకరించుటకు బ్రథమసోపానము. బ్రహ్మద్వేషాంకురమునకు బ్రధాన కారణము.

అబ్రాహ్మణోద్యమము ఈసందర్భమున భరతవర్షమునకు గొప్ప లాభమొనరించుచున్నది. స్నానసంధ్యావందనాదు లాచరింపక కాఫీహోటళ్లకు జనుచుండు బ్రాహ్మణవంశజులు నమస్కారార్హులు కారనియు, బ్రాహ్మణులపవిత్రతయే వారియెడల ఇతరజాతులవారికి గౌరవము గల్గించుననియు నీయుద్యమము దెల్పుచున్నది. ఈవిద్యోద్యమము మత్తగజమునకు నంకుశముకైవడి, దురాచారములుఁగల బ్రాహ్మణులకు సదాచారసద్వర్తనములను గల్గించుచున్నది. ఈయుద్యమముదయించిననాటనుండియు ప్రాచీనబ్రాహ్మణాధిక్యమును నిలబెట్టిన ఆచారము లొక్కపెట్టునదీక్షతో నాచరింపబడుచున్నది.

## —* 14. ప్రాతఃకాలభోజనము. *—

హిందువులలో 35 సంవత్సరములు మించిన వయస్సుకలవారందరును దినమునకు రెండుసారులు భోజనముచేయుదురు. వీరు మొదటిసారిపగటిపూటయందు 11–12 గంటలకాలమందును రెండవసారి రాత్రిపూటసుమారు 7–8 గంటలకాలమందును భోజనముగావింతురు. వీరిజఠరాగ్నియందు మార్పుకలుగునని యెడలననుదినము నవసాలకాల పర్యంతము నీరీతిగా వీరు భోజనము చేయుచుందురు.

ఈవయస్సునకు (35) లోపుగనున్న యువజనులును, పిన్నవయస్కులును, విశేషజఠరాగ్నికలవారైనందున వారు దినమునకు మూడుసారులు భుజింతురు. వారికి విశేషమైన జఠరాగ్నియుండుటకుఁ గారణములు రెండుకలవు భరతవర్షముష్ణదేశము. ఇచ్చటప్రబలియుండు మహోగ్రమైన వేడిమివలన కోమలమైన అవయవములుగల యువజనులకు జఠరాగ్నివిశేషముగా నుండును. మరియు, వీరిశరీరములందు శోణితమతిచురుకుగాఁ బ్రవహించును శరీరము 35 సంవత్సరములవఱకును క్రమముగా నభివృద్ధినొందుచుండును. ఈహేతువులచే నిర్ణీతకాలములందు బలమైన ఆహారమును స్వీకరించి జఠరాగ్నిని శమనపరుపవలెను. కావున యువజనులనుదినమును ముమ్మారుభుజింతురు.

వీరు పెద్దలవలెనే అనుదినమును పగలు 12 గంటలకును, రాత్రి 7 8 గంటలకును భుజించు వాడుకకలవారైయున్నను, ప్రతిదినమును 7 గంటలకాలమందుఁ బ్రథమ చేయుదురు. హిందువులుపయోగించు ప్రాతఃకాలభోజనము మూడురకములదై యున్నది. ఇందు మొదటిది వేడియన్నము. రెండవది చల్లనియన్నము. మూడవది తరవాణిఅన్నము. ఈమూడు తెఱంగుల భోజనములును జఠరమును దృప్తినొందించి యువకులకు దార్ఢ్యమొసఁగునవైనను, వేర్వేరుఫలితములనిచ్చును.

ప్రాతఃకాలభోజనమునకుపయోగపడు వేడియన్నము హిందూ



గృహములందు నుదయమున సాధ్యమైనంత పెందలకడనే వండఁబడును. ఇదినిర్మలత్వమునకు మూలము. ఆచారమునకర్హము. వేడిగానుండుటవలన నిదివాతశరీరముకలవాలవారికిఁ నుత్సాహజనకమై యొప్పారు. దీనిని బంగాళదుంప అరటికాయ, పెండలము మొదలగు వేపుడుకూరలు, అప్పడములు, వడియములు మొదలైన పదార్థములతోను, పూసపూసలవలెనుండు నేతితోను, స్వీకరించినయెడల కమ్మదనముతో విలసిల్లుచుండు. ఈభోజనమందుఁ బెసరట్లుపయోగించినయెడల మనోహరముగానుండి మేహపైత్యము. అరుచి, అగ్నిమాంద్యమును జయింపబడి శరీరము తేజోవికాసముతో నలరారు. హిందూగృహములందిట్టి భోజనమును దఱుచుగా నూతన జామాతల కొసఁగుటవాడుక, కాన శ్రేష్ఠతరమైన భోజనమునొందగోరువారు అల్లుళ్లపంక్తికిఁ జేరవలెననెడి లోకోక్తికలదు. వేడిఅన్నపుభోజనముయొక్క యుక్తమగుపరిమాణము త్వరగాజీర్ణమై దీర్ఘాయువును బ్రసాదించును.

హిందువులుపయోగించు చల్లనిఅన్నము గతించినరాత్రిపూటయందు వండబడినదై యున్నది. ఇందుండువేడి, హృదయమునకు నశించును గావున నిదిచల్లనిఅన్నమనియు, జల్దియన్నమనియు బిలువకారణమైయున్నది. చలువచేయునుగావున మేహశరీరముకలవారికిని, సమశీతలతత్వముకలవారికిని ఈఅన్నమును భుజించుట ఉత్సాహకారణము. ఇందుమంచినూనె, ఆవకాయలుపయోగించుట హిందూయువజనుల కత్యంతప్రీతి. వీరు ఈఅన్నమున గ్రామములందు లభించుకమ్మని ఘృతమును, గోదావరి, కృష్ణా. కావేరీ లంకలయందు మేతమేసిన పశువులయొక్కదదియు, గుంటూరు, బెజవాడ, బందరునగరములందును నెల్లూరుమండలమందున్న బుచ్చిరెడ్డిపాలెమునందును విరివిగా దొరకు మీగడతోగూడిన మంచుగడ్డవంటి పెరుగును నుపయోగింతురు. వీరికిందువలన వర్ణనాతీతమైన బలముదయించును. అఖండదార్ఢ్యమేర్పడును.

రోగములు కలుగకఁ జిరకాలము వర్ధిల్లవీలగును. శరీరము శుక్లపక్ష చంద్రునివలె కళాకాంతులతో, వృద్ధినొందును. ఈ చలిదిఅన్నమును దినుటతోడనే నడచి ప్రయాణముచేయుటకుత్సాహకరముగానుండును. ఆంధ్రమండలమున వర్ధిల్లుభూస్వాములగు కమ్మవారును, రెడ్లును, కాపులును నీచలిదియన్నము ననుదినమును స్వీకరించుచు, లక్ష్యములేకుండ ఎండలోనిలువబడిపొలములందు బనిచేయుచు, దీర్ఘాయువునొందువారై తేజరిల్లుచున్నారు. వీరేగాక హిందూ యువజనులును, బసువులకాపరి వాండ్రును నిట్టిప్రాతఃకాలభోజనముచేయుట ప్రాచీనాచారమైయున్నది.

హిందూగృహములందు వాడబడు మూడవవిధమైన ప్రాతఃకాలభోజనము, తరవాణిఅన్నము. దీని నీవిధముగా దయారుచేయుదురు. అన్నము ఉడికినపిమ్మట వార్చబడిన గంజిని శుభ్రపరుపబడిన నల్లమట్టితోఁజేసిన కుండయందుఁ బోసినచోఁ, నొకటిరెండు దినములలో నది పులియును. ఇం దనుదినము అన్నము వేయుచు, గంజి పోయుచు, కుండను శుభ్రపరచు టవసరము. సువాసన విదజల్లుటకై ఇందు పుల్లదబ్బచెట్టుయొక్క ఆకులను వేయుదురు. అన్నము వీనియందు ఊరుట వలన నది పుల్లగానుండును గావున నెల్లూరు, గుంటూరు మండలములందు దీనిని పుల్లని అన్నమని పిల్చుట నాడుక. దంపుడుబియ్యపు అన్నమును, దానిసంబంధమైన గంజియు, నీతరవాణి తయారుచేయుటకుఁ బ్రశస్తములు. ఉష్ణదేశీయులకీతరవాణి మనోహరముగా నుండును గావున దక్షిణహిందూస్థానమందుండు హిందువులే దీని నుపయోగింతురు. ఆంధ్రదేశమందుఁ జిరకాలమునుండియు గోదావరి మండలమున వర్ధిల్లుచున్న కోనసీమఖండగ్రామములగు వానపల్లి, వక్కలంక. గంగలకుర్రుఅగ్రహారం పేరూరులలో నివసించియున్న ద్రావిడులే తరవాణి తయారుచేయుటయందు నేర్పరులని ప్రసిద్ధిగాంచియున్నారు. ఈ ద్రావిడనారీమణులు, తమ ఫాలమునకు నిండుదెచ్చునంతటి కుంకుమ



బొట్టుతో, హిందూధర్మయుక్తమైన బట్టకట్టుతో, వినయసౌశీల్యములతో నత్యంతదయారసముతో, నుదయకాలమందు, దమగృహములకేతెంచిన యువజనమునకును, బాలురకును, తరవాణిఅన్నముతో నాతిథ్యమిచ్చునపుడు అన్నపూర్ణాదేవిని స్ఫురణకుఁ దెత్తురు. వీరు తయారు చేయు తరవాణిని వీక్షించినతోడనే జిహ్వ లేచివచ్చును. ఇది అతి నిర్మలమై, మంచినీటికంటెను దేలికగానుండును. నలపాకభీమపాకములు కూడ వీరొసఁగు తరవాణిదాహమునకు సాటిరావనుట అతిశయోక్తి కాదు. నైజాముదేశీయులును, బొంబాయిదేశస్థులును, దయారుచేయు తీపిపిండివంటలును, నుత్తరహిందూస్థానపు హిందువులు తయారుచేయు గోధుమరొట్టెలును, కోనసీమద్రావిడాంగనలు తయారుచేయు తరవాణికి సాటిరానేరవు. దక్షిణహిందూస్థానమున వైష్ణవులు దద్ధ్యోదనమును, జమురుకాలువలతో గూడిన పులియోరెమును, దయారుచేయుటయందును, మాధ్వులు మధురమైన బొబ్బట్లను, సుగంధమైన ఇంగువనూనెయు, అప్పడముల పిండియు, తయారుచేయుటయందును? స్మార్తులు, ఆమవడలును, బూరెలును వండుటయందును బ్రసిద్ధిగాంచియుండ, కోనసీమ ద్రావిడజనులు మానవజిహ్వాచాపల్యమును సంతుష్టిపఱచు తరవాణిని దయారుచేయుటయం దగ్రస్థానమును వహించియున్నారు. తరవాణి విదాహమునణచును. వడగాడుపుదెబ్బతగిలి శోషిల్లినవారికి సంజీవివలెఁ బనిచేసి శీఘ్రకాలములో స్పృహకలిగించును. కోనసీమద్రావిడస్త్రీపురుషులు పసితనము నుండియు దీనినీ స్వీకరింతురు గావున వారికి బంగారు చాయయు, శరీరపటుత్వమును, దీర్ఘాయుర్మహారాజ్యాధిపత్యమును, గల్గుటకుఁ గారణమైయున్నది. కోనసీమయందలియువజనులనుదినమునుదరవాణియందూరు అన్నమును దిని పోక, కొబ్బరి, పనస, మామిడి మొదలగు తోటలకేగి మధ్యాహ్నము వఱకును నచ్చటతమపనులఁ జక్కబెట్టుకొనుచుందురు. ఈభోజనము

దయమునసే స్వీకరించుచో నెట్టిదేహపరిశ్రమమైన నోర్వశక్యమగును. పండ్రెండుగంటలకు మంచిఆకలికల్గును. జఠరముశుభ్రపడును. దేహారోగ్యము, ఉత్సాహము,కలుగును. దీర్ఘాయువు హస్తగతమైయుండును.

ప్రాతఃకాలభోజనము వలన హిందువుల కీదివ్యలాభములుకల్గును.

1. జఠరము చక్కగా వెలుంగుచు నారోగ్యము కల్గును.

2. అఖండదార్ఢ్య మేర్పడి, శరీరము వజ్రకాయమై, దీర్ఘాయువుతోఁ బ్రకాశించును.

3. స్త్రీ, పురుషులు బల లావణ్యములతో నలరారుచు, వార్ధకమందుసహితము నీరోగమైన, ఉక్కుతునకలవంటి సంతతిని బడయుదురు.

4. 'కాఫీ', "కాఫీహోటల్లకేగుట" మొదలగు దురభ్యాసములు పట్టుఁబడవు.

5. మేహాదిరోగములు, శిరోరోగములు మొదలైనవి శరీరము నంటవు. స్త్రీ, పురుషుల శిరోజములు జరమందుకూడ నలుపురంగుతోఁ బ్రకాశించు.

6. హిందూదంపతుల కనుకూలదాంపత్యము కలుగును.

ప్రాతఃకాలభోజనము (మూడుపూటలు) హిందూధర్మవిరుద్ధమై యున్నది. ఏకభుక్తమే శ్రేష్ఠమని శ్రుతులు చెప్పుచున్నవి. రెండవసారి భుజించుట సామాన్యపక్షమైయున్నది. యువజను లీభోజనము మానుటచే వారిజఠరము చెడును గావున తత్త్వముననుసరించి వారు పైమూడువిధముల భోజనములలో నర్హమైనదాని నారగించు టయుక్తము. జీవపితృలుకాని యువజనులు, పుణ్యా, పర్వ, పితృదినములను వర్జించి, ఇతరదినములందు ప్రాతఃకాలమున స్నానాదు లాచరించి వేడియన్నము నారగించుట మంచిది. ఉపనయనానంతరము ప్రాతఃకాలభోజనము చేయుట అశాస్త్రీయమైనను, మలినవస్త్రములతోఁ, గాఫీహోటల్ల



కేగుటకంటె, దీర్ఘాయువునిచ్చు ఈభోజనమే దివ్యతమమని చెప్పవచ్చును.

—* 15. తాంబూలవిధానము. *—

ప్రాచీనకాలమునుండియు హిందువులు సమస్తశుభకార్యసమయములందును, ఉపయోగించునది తాంబూలము. హిందూగృహములందు బంధుమిత్రపరివారమునకు గౌరవసత్కారార్థ ముపయోగింపఁబడునది తాంబూలము. స్త్రీ, పురుషులు శయ్యాగృహమం దుపయోగించు అమూల్యపదార్థము, తాంబూలము. సకలదేవతాప్రీతికరమై యొప్పారునది తాంబూలము. షడ్రసోపేతంబైన భోజనముతోఁ గూడిన నతిథిసత్కారమునకు వన్నెబెట్టునది తాంబూలము. భోజనానంతరము హిందువులు స్వీకరించునది తాంబూలము. తాంబూలము వేయు హైందవుఁడును, త్రాఁబేలు గలకూపమును, తామరగిల సరస్సును, ధన్యములని పండితోత్తములు వచింతురు.

హిందువులు ప్రశస్తముగా నెంచు ఈతాంబూలమును భోజనానంతరము వేసికొనుట ఆచారము. ఇది తమలపాకులు, పోకచెక్కలు లవంగములు, ఏలకులు, జాపత్రి, జాజికాయ, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, సోపు మొదలైన సుగంధద్రవ్యయుతమై యొప్పారు. సాధారణముగా నితరసుగంధద్రవ్యములున్నను, లేకున్నను, పోకచెక్కలతోఁ గూడియున్న తమలపాకులు, శాస్త్రోక్తమైన తాంబూలమని పరిగణింపఁబడుచున్నది. దీనిని సున్నముతోఁగలిపి యొసఁగుట వాడుక.

తాంబూలము వేసికొనునపుడు ముందుగా పోకచెక్కలు నములుట అశాస్త్రీయము. అల్పాయుర్దాయప్రాప్తము, ఏలనన, గౌతమ సూత్రమిట్లువచించుచున్నది.

అనిధాయముఖే పర్ణం పూగంఖాదతియోనరః
సప్తజన్మసుదారిద్ర్యీయం నాతానారాయణస్మృతిః.

తమలపాకు వేసికొనుటకుఁ బూర్వము చెక్కలు నమలిన యెడల, ఏడుజన్మములు దరిద్రము కలుగును. మరణకాలమందు భగవన్నామ స్మరణస్ఫురింపదు. ఆయుర్వేదముకూడ చెక్కలు ముందు నమలిన యెడల రక్తము విరిగిపోయి పాండురోగోత్పత్తియగునని చెప్పుచున్నది కావున తీరికసమయములందు హిందువులు చెక్కలు నమలుదురభ్యాసమును విడనాడవలెను. తాంబూలకాలమందు దమలపాకులను, చెక్కలతోఁ జేర్చి నమలుటవిధియై యున్నది. ఆకులతోఁగూడిన చెక్కలను నమలిన యెడల ఎంతటిగట్టిచెక్కలైనను సూక్ష్మముగానలుగును. రెండు చెక్కలు నమలుటవలన నిష్ఫలమగును గావున ఒకటిగాని, మూడు గాని, అంతకంటె (ఆకుల సంఖ్యననుసరించి) ఎక్కువచెక్కలనుగాని ఉపయోగించుటయే శాస్త్రము. ఉదయమునందు తాంబూలమందెక్కువ చెక్కలును, మధ్యాహ్నమందెక్కువ సున్నమును, సాయంకాలమందు విశేషమైన ఆకులను ఉపయోగించుట శాస్త్రము.

తాంబూలమందుపయోగింపఁబడు, పరికరములన్నియు శుభ్రముగానుండవలెను. తడితమలపాకు చెవుడు తెచ్చుననియు, అందలికాడ్లు రోగములను దెచ్చుననియు నాయుర్వేదము చెప్పుచున్నది. ఆకులను జక్కగా దుడుచుట ముఖ్యమైయున్నది తమలపాకుయొక్క ఈనెలను దీయకున్నచో విద్యలంటవనియు, సంతానముకలుగదనియు, ఐశ్వర్యమొదవదనియు, కీర్తివిశేషంబులు కలుగవనియు, మొదలుత్రుంపని యెడల రోగములు కలుగుననియు, అగ్రముత్రుంపనిచో, పాపము వాటిల్లుననియు, కాడతీయనిచో బుద్ధినశించుననియు నిర్ణయసింధు పరాశరమాధవీయము మొదలగు ధర్మశాస్త్రములు విశదపఱచుచున్నవి. చెక్కలు పుచ్చువిగానున్నచో రోగములు బుట్టుననియు, రాళ్లున్నసున్నము, వ్యాధులకు మూలమనియు, వైద్యశాస్త్రము తెల్పుచున్నది. ఎండినసున్న ముపయోగించినచో రోగములు కలు



గును. సున్నముంచబడిన ఆకునుపయోగించుచో నల్పాయువు తటస్థించును. చెక్కలను నమలుటకంటె వానిని గత్తిరించి ఆహారమునుపయోగించుట శ్రేష్ఠము. గట్టిచెక్కలను దఱుచుగా నమలుటవలన దంత నేత్రకర్ణరోగములు కలిగి ఉత్సాహహారణమై దీర్ఘాయువు నశించును తాంబూలము విస్తారముగా నుపయోగించుటవలన శరీరము తెల్లపడి అనారోగ్యము వాటిల్లును. లేతతమలపాకులు ఉత్సాహమునిచ్చును. పండుఆకులు వృద్ధులును, బాలింతరాండ్రును ఉపయోగింపనగును.

తాంబూలము నమలునపుడు నోటియందు మొదట ఊరురసము విషతుల్యము; కావున దానినుమియుట కర్తవ్యము. పిమ్మట సుగంధ ద్రవ్యములన్నియు నుపయోగింపవచ్చును.

—♦ పురుష తాంబూలక్రమము ♦—

పురుషులు రెండువంతులు కస్తూరియు, ఒకవంతు పచ్చకర్పూరమును, స్వీకరించుట శాస్త్రము.

—♦ స్త్రీ తాంబూలక్రమము ♦—

స్త్రీలు రెండువంతులు పచ్చకర్పూరమును ఒకవంతు కస్తూరియు, తాంబూలమున బుచ్చుకొనుట ముఖ్యము.

క. మృగమదసౌరభ విభవ
ద్విగుణితఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువవాలుపుదెలుపునొక్కమారుత మొలసెన్. —మనుచరిత్ర.

తాంబూలము ఈసుగుణముల నిచ్చును. :—

నోరు సువాసనతో నొప్పారు. వనితలతో సంభాషించుట కర్హతను గల్గించును. సంతోషముకల్గును. చక్కని వేడికల్గుటచే వాతశరీరుల కుత్సాహకరము. జఠరము చక్కగా బ్రకాశించును. చలువ మిరియములనుపయోగించినచో శుక్లదోషములు హరించును. శరీరము దార్ఢ్యవంతమై యుండి రోగరహితమై వర్ధిల్లుటచే సుసంతానము

కల్గును. అరుచి, క్రిమి మొదలైనవి నశించును. బుద్ధి బలము కల్గును. వాతములు తొలంగును. ఈదివ్యమైన తాంబూలము హిందూగృహస్థులకు నత్యవసరము.

మేహ, పైత్య, పాండురోగులు తాంబూలము నుపయోగింప కూడదు.

కొబ్బరికాయ, మామిడిపండు, వెలగపండు చెఱుకు పానకము, నెయ్యి, పనసపండు, అరటిపండు కల్లు, తేనె—వీనిని తినిన వెంటనే తాంబూలము వేసికొన్నచో, అది విషతుల్యమగును. కావున వీనిలో నేదైనను భుజించిన 1 గంట గడచులోగా తాంబూలము వేసికొనుటవలన దీర్ఘాయువు చెడును. ఈనిబంధనల నాచరించుచు తాంబూలము వేయుట కర్తవ్యము.

## —* 16. కిల్లీలు. *—

ఈకాలమున నాగరకతావిజృంభణమువలన హిందువులు శాస్త్రోక్తమగు తాంబూలపద్ధతుల నెఱుగని దుస్థితిలోనుండి, అశాస్త్రీయముగా తాంబూలము నుపయోగించుచున్నారు. బజారులందు, కిల్లీలు వ్యాప్తమైయున్నవి. వీనిని మూల్యమునకు సాధించి నములుచున్నందున, ఆధునికహిందువుల దీర్ఘాయువు నశించుచున్నది. క్షీరముతోఁ గూడిన కాఫీ త్రాగిన వెంటనే వీరు కిల్లీలు నములుచున్నందున, తాంబూలనిబంధనల నతిక్రమించు అవకాశము కల్గుచున్నది. మఱియు, కిల్లీలు కట్టునపుడు సున్నము సరియైనపరిమాణముకంటె నెక్కువగానుండును. ఆకులనుండి ఈనెలుగాని, కాడలుగాని, మొదళ్లుగాని, అగ్రములుగాని తీయబడవు. లేతతమలపాకులు వస్త్రముతోఁ దుడువఁబడవు. పురుగులతోఁగూడిన ఆకులు నీకిల్లీలయం దుపయోగింపబడును. కిల్లీలలో కుళ్లిన ఆకులు కూడ నుపయోగించుట వాడుక. ఈకిల్లీలు ప్రదర్శించునపుడు ధూళితోఁ గూడినవగును. అంగళ్లయందు వీనిని విక్రయించువారి హస్తములు మలినదోషములతోఁ గూడియుండును. ఈదోషములన్నియు, కిల్లీలను నములువారు గ్రహించి, తాంబూలముయొక్క సుఫలితముల నొందక, రోగములఁజిక్కి, దీర్ఘాయువును గోల్పోవుచున్నారు.



## —♦ 17. సోడా, లిమనేడు. ♦—

పాశ్చాత్యనాగరకతావిజృంభణము వలన ఈద్రవపదార్థములను హిందువులు స్వీకరించుచు దీర్ఘాయుశ్శూన్యులగుచున్నారు. కాఫీహొటళ్లయందుండు చతుర్విధదోషములును, ఈపానీయములకు గూడ కలదు కావున వీనిని హిందువులు స్వీకరించుటచే దీర్ఘాయువు చెడుచున్నది.

ద్విజులు వీనిని స్వీకరించుచు, గౌరవమును గోల్పోయి, బ్రహ్మద్వేషాభివృద్ధికి, ఎడమిచ్చుచున్నారు. దైవకృపచే నబ్రాహ్మణోద్యమ ముదయించి, వీరికి శుచిత్వమును బోధించుచు, హిందూమతోద్ధారణమును గావించుచున్నది.

ద్వితీయభాగము.

సమాప్తము.



శ్రీ.

శుభమస్తు.

# హిందూ ధర్మ పునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## తృతీయ భాగము.

---

### పాత్రములు, కలశములు.

భోజనపదార్థములు తయారుచేయునప్పుడును, వానినుపయోగించునపుడును, పాత్రలు, కలశములు మున్నగునవి అవసరము. ఎట్టివి దీర్ఘాయువు నొసంగునో, ఎట్టివి అల్పాయువు నొసంగునో సంగ్రహముగా నీభాగమునందు వివరింపబడెను.

### —॥ 18 మృత్పాత్రలు. ॥—

వంటచేయుటకై మృత్పాత్రలు ప్రశస్తములగుటచే బూర్వకాలపు హిందువులు వీనినుపయోగించుచుండిరి. ఈపాత్రలు పెళుసుగా నుండి చిరకాలముపయోగింపబడుట కనర్హములైయున్నను, ఇవి ఆరోగ్యదాయకములైనవని వైద్యశిఖామణులు తెల్పుదురు.

మృత్పాత్రలు దేహారోగ్యకరమై తేజరిల్లుటకుఁ గారణము ప్రత్యక్షముగాఁ గన్పించుచున్నది. మృత్తిక (అనగా నల్లనిబంకమన్ను) సమశీతలత్వము నొసంగుసమర్థతకలదు; దేహమందలి మహోష్ణతను జయించును; చెడురక్తమును బయల్వెడలించును; అందువలన పుండ్లు గడ్డలు,కురుపులు మొదలగువానిని గూడ నివారించును, మేహాదిపైత్య వికారములను నిర్మూలముచేయును; దేహము చులకనగునట్లు, ఉత్సాహమునిచ్చును.



ఇట్టిసుగుణము లుండుటవలన భూమిపైఁ బ్రవహించు ఉదకమును హిందువులు పవిత్రతతో నెంతురు. ప్రవాహోదకము భూసంపర్కముగలదగుటచే నది ఇనుపగొట్టములతో దయారైన కుళాయిల నుండి సూర్యరస్మినొందక బ్రవహించుచుండు జలముకంటె ప్రశస్తము, దీర్ఘాయువును బ్రసాదించు దివ్యసలిలము. పవిత్రతతో నెన్నుకొనబడుటకుఁ బరమరహస్యము. ఈహేతువుచే శైత్యోపచారములకై నిరీక్షించుచు, భానుని ఉగ్రతనోర్వలేక యత్నించుభారతీయులు మృత్పాత్రయందలి ఉదకమును ద్రావుచుందురు.

మృత్పాత్రలతోఁ దయారైన వంటకము, మేహశాంతిని చ్చును సమశీతలత్వమును గుర్చును. దేహపటుత్వము నిచ్చును. పైత్య రోగములను జయించును. చిన్ననాటనుండియు హిందూబాలురకు జనని మట్టిపాత్రతో వండినఅన్నమును బెట్టుటచే వారు దీర్ఘాయువు నొంద వీలుగల దార్ఢ్యముతో వర్ధిల్లుచుందురు. మేహ, వాత, పైత్యరోగములఁ జిక్కినవారు, బాలెంతరాండ్రును, ఈఅన్నమును దినినచో సమశీతలత్వము కలిగి అచిరకాలములోనే ఆరోగ్యము సమకూరును. రక్తబల మధికమగును. దీర్ఘాయువు కలుగును.

హిందూగృహములందు, మృత్పాత్రలు భోజనపాత్రలకే గాక, ఇతరకాలములందు గూడ ఉపయోగింతురు. తరవాణికై నుపయోగింపఁబడునది మృత్పాత్ర. ఊరగాయలు చక్కనికమ్మదనముతో విరాజిల్లుటకుఁ గారణము మృత్పాత్ర. హిందూగృహములందనుదినము,-పచ్చికబయళ్లయందు మేత మేయుచు వాలములను దిప్పుకొనుచు, రమ్యమైన లేడిపిల్లలను బోలియుండు దూడలతోఁ గన్నులపండువుసేయుచుండు పశ్వాదులొసంగు క్షీరమునుండి-హిందువులు, పెరుగు, వెన్న, నెయ్యి తయారుచేయుట కుపయోగించునది మృత్పాత్ర. కడుభక్తితో సులభముగా బుణ్యముసంపాదించుటకై భరతవర్షవైశ్య

లు, రాచబాటలపై నెలకొల్పు చలివేంద్రములందు మనోహరమైన మజ్జిగ తేటను భద్రపఱచుట కవశ్యకమైయున్నది మృత్పాత్ర. ఇట్టి ప్రభావముగల మృత్పాత్రను బూర్వకాలమందువలె వంటచేయుటకునాగరకతాదోషముచే నాధునికు లుపయోగింపమిచే, దీర్ఘాయువు వారికి చెడుచున్నది.

## —♦ 19 తామ్రకలశము ♦—

జలపానముచేయునపుడు తామ్రపాత్ర లుపయోగించు హైందవులు దీర్ఘాయువు నొందుదురు. పూర్వకాలపు హిందువులు ఇట్లాచరించుచు నీదివ్యలాభ మొందుచుండిరి. నాగరకతాదోషముచే, రాగిఝారీ, కమండలము, హరివాణము మొదలైనవి మూలపడినవి.

రాగిలోహమునందు ప్రశస్తమైన రోగమును జంపుగుణము కలదు. కావుననే ఆయుర్వేదమును, మనుయాజ్ఞవల్క్యాదిస్మృతులును జలపానమునకై రాగికలశములు ప్రశస్తములని వివరించుచున్నవి. రాగిలోహము పురుగును జంపును. ఇందువలన శరీరమునందలి విషకల్మషములు నశించును. క్రిమి, అరుచి, మేహ, కుష్ఠు, పాండు, ఉబ్బు, గుల్మములును, తజ్జనితములగు రోగములును, అణగును. సర్వవిధములగు వాతములును హరించును. దేహమునకుఁ జక్కని వేడిమి నిచ్చును. అజీర్ణము పరువిడును. రక్తము చురుకుగాఁ బ్రవహించును. శరీరమునకుఁ గాంతికల్గును. ఉత్సాహమును బ్రసాదించును. అందువలన తామ్రకలశోదకమును ద్రాగుదీక్షాపరులు దీర్ఘాయువు నొందుదురు. ఈతామ్రకలశములందుంచబడిన జలము విషరహితమై తేజరిల్లుటచే కలరా, మొదలగు అంటుజాడ్యములును, నేత్ర, కర్ణ, దంతాది రోగములును, అంకురింపజాలవు. స్త్రీ, పురుషులకు జిరకాలము వఱకును, చత్వారబాధ కలుగనేరదు. శిరోజములు దట్టముగా నుండును. వార్ధకమునందుసహితము కేశములు నల్లనిరంగుతో వర్ధిల్లును. తామ్ర



ము శరీరమందలి సకలవిషయములనుహరించుటచే నీకలశోదకముత్రాగుటవలన నిర్మలచిత్తము కల్గును. దయాధర్మసత్యశౌచాదులును, సత్వగుణసంపన్నత్వమును, అందువలన బట్టుపడును. హిందువు లాదినుండియు రాగికాగులయందలి జలమును, స్నానాదుల కుపయోగించుచు, ఈఫలితముల నొందుచున్నారు. జపతపస్సులయములందు తామ్రహరివాణము ఉద్ధరిణె, పంచపాత్రము,కమండలము మొదలగువాని నుపయోగించుచుండిరి. స్త్రీలు తామ్రభరిణెలందుంచిన కాటుకను ధరించి, నేత్రరోగములను జయించుచుండిరి. ఇప్పటికైనను నేత్రరోగచికిత్సలకై తామ్రముతోఁ గూడియున్న మైలతుత్తరపు (Copper sulphate) కణికె లుపయోగింపబడుచున్నవి. కుక్కకాటుయొక్క విషమునకు తామ్రనాణెముతో వైద్యముచేయుట ఆచారమైయున్నది. తామ్రమిట్టి అద్భుతశక్తులతో గూడియున్నందున దామ్రభస్మముతో వైద్యులును, ఋషిపుంగవులును, అనుపానభేదములతో సకలరోగములను గుదుర్పగలరు. కావున తామ్రకలశోదకము స్వీకరించువారి శరీరము రోగరహితమై దీర్ఘాయుఃక్షేత్రమందు వర్ధిల్లు.

ఈదివ్యలోహము సూర్యగ్రహప్రీతికరమై, సకలైశ్వర్యములకును గల్పవృక్షమై దనరారుచున్నది, జపానంతరము తామ్రహరివాణమందలి తీర్థమును స్వీకరించుచో శరీరమందలి రోగములణగుటయేగాక, అకాలమృత్యుహరణమగునని హిందూధర్మము తెల్పుచున్నది. భూతప్రేతపిశాచాదులకు భీతికరమైన లోహమగుటచే భూతవైద్యులు రక్షరేకులకై రాగిరేకుల నుపయోగింతురు. హిందూస్త్రీలు, లక్షవత్తుల వ్రతముచేయు సమయమున రాగికలశలను ధర్మముచేయుట ప్రాచీనాచారము. సకలదానధర్మములందును తామ్రనాణెముగు'డబ్బు' ను జేర్చి సద్బ్రాహ్మణుల కొసంగి, దేవతల ఆశీర్వచనమునొంది సకలైశ్వర్యంబులను బడయుటకు మార్గమని హిందువుల దృఢవిశ్వాసము.

తామ్రమిట్టి సుగుణములతో విలసిల్లుచున్నందున భారతీయులు తమగృహములందు మూలపడియున్న ఝారీ, కమండలము, పంచపాత్ర మొదలగు వాని సతత ముపయోగించుచు, దీర్ఘాయువు నొందుదురుగాక.

### —♦20 బంగారు కలశలు.♦—

లోహరాజమైన బంగారముతో దయారైన కలశల నుపయోగించు సమర్థత ధనాఢ్యులకేగలదు. ఈకలశలందలి ఉదకము ఆరోగ్యవంతులకు దీర్ఘాయువునిచ్చునదైయున్నది.

సువర్ణము దేహమునకు బలమిచ్చును. కాంతినొసంగును. మానవశరీరము మన్మథునివలె దేజరిల్లు. ఈలోహరాజముగల ఔషధములు అద్భుతమైన బలలావణ్యములను ప్రసాదించుచున్నవి. ఆరోగ్యవంతులగు బలహీనులే ఈలోహముపయోగింపనగును. ఈలోహము తామ్రమువలె పురుగును జంపజాలదు.

బంగారుకలశలుపయోగించువారికీహేతువుచే దేహమందు రోగములు నిర్మూలము కాజాలవు. ఆరోగ్యవంతులైనవారికే మేరలేని ఉత్సాహము తేజోబలము మొదలగు దివ్యఫలితము లీకలశ లిచ్చును. బలహీనులై, రోగములేని వారికలశలను జలపానమునకుపయోగింతురేని వారికమితమైన దార్ఢ్యము, శరీరపటుత్వము, రక్తబలము మొదలగు సుగుణము లుదయించి లావణ్యాధికమై దీర్ఘాయువు హస్తగతమై యుండును. హిందుధర్మమునందు నగ్రస్థానము తామ్రకలశకేగలదని స్పష్టపడుచున్నది.

### —♦ 21. అల్యూమినమ్ పాత్రలు, కలశలు. ♦—

భోజనపదార్థములను వండుటకుగాని, ఉంచుటకుగాని, పానాదుల కుపయోగించుటకుగాని ప్రపంచమందలి లోహములలో అధమాధమమైన లోహము "అల్యూమినమై" యున్నది. ఆంధ్రులీలోహ



ము "జర్మనీవెండి" యనియు "మాయ" లోహమనియు వ్యవహరింతురు. పది, పదియైదు వత్సరములనుండి యీలోహపుపాత్రలును, గ్లాసులును ప్రపంచమందెల్లెడలను వ్యాప్తిలోనున్నవి.

ఈలోహము మహోష్ణమనిచ్చును. ఈపాత్రలయందుంచబడిన వెంటనే ఎట్టి నిర్మలమైనపదార్థములైనను దుర్వాసనతో గూడినవై శీఘ్రకాలములో చెడిపోవును. లవణముతో దయారైన భోజనపదార్థము లిందుంచినచో నీలోహము కరగిపోయి పాత్రకు రంధ్రముపడును. ఈపాత్రయందు పరిశుభ్రమైన జలముంచి కొంతదనుకైన పిమ్మట దానిని స్వీకరించుచో నది దుర్గంధముతోఁ గూడియుండును. భోజనపదార్థములను వేరినైన నీపాత్రలం దుంచినయెడల నవి అనారోగ్యమును బుట్టించును. ఈలోహము చెడువేడిమి నొసఁగుచు మేహరోగములను బెంచు రాక్షసి. ఈలోహము శిరోరోగములు, నేత్ర, కర్ణ, దంతరోగములను ఉద్భవింపఁజేయును. రక్తమపరిశుభ్రమగును. మేహాదిరోగము లుత్పత్తియగును, వృద్ధినొందును. కావున వరుసగా మానవులీపాత్రలయందుంచబడిన భోజనపదార్థముల నైదువర్షములు స్వీకరించినచో వారికి మేహముజీర్ణించి కుష్ఠు, పాండు, ఉబ్బు, గుల్మరోగాదు లంకురించునని అమెరికను వైద్యశిఖామణులు పత్రికాముఖమున దాదాపు రెండుసంవత్సరముల క్రిందట ప్రకటించియుండిరి. ఈపాత్రలు హిందూగృహములం దభివృద్ధి గాంచుటతోడనే నూతనరోగములు, నేత్రరోగములు, పైత్యవికారములు మేహాదిరోగములును వృద్ధినొందుచున్నవి.

అల్యూమినమ్ పాత్ర దరిద్రహేతువై యున్నది. ఈపాత్రలుపయోగించు గృహములనుండి సంపద లెడబాయుచున్నవి. ఋణగ్రస్తత పెరుగుచున్నది. ఈకలశలుంచు గృహములందు అశ్రేయస్సు, విలంబములును కలుగుచున్నవి. ఈలోహపుపాత్రల నింటికిఁదెచ్చుట "పెద్దమ్మ" నాహ్వానించుటయే.

హిందూస్త్రీలు ఈపాత్రలయొక్క దౌర్భాగ్యమునకును తేలికకును నచ్చెరువొంది పట్టణములకుగాని, పుణ్యముసంపాదింపగోరి తీర్థయాత్రలకుగాని బోయి వచ్చునపుడు క్రయమిచ్చి కొనుననిదరిద్ర హేతువైన ఈఅల్యూమినమ్‌పాత్ర; జల్తారుగిన్నె లమ్మువారియొద్ద స్త్రీలు మూల్యమిచ్చి కొనునవి జర్మనీవెండిగ్లాసులు; ఆరోగ్యకరమై, ఐశ్వర్యకరమై యొప్పారు తగరపుగిన్నెలతో సమానమైనఖరీదు కలవైనను, తేలికగానుండునని భ్రాంతితో, కాశీరామేశ్వరములనుండి హిందూవనితలు తెచ్చునవి "మాయి" గిన్నెలు; కోటిపల్లి, అంతర్వేది పట్టసము, శ్రీశైలము, భద్రాచలము మొదలైన పుణ్యక్షేత్రములనుండి హిందూకాంతలు తమగృహములకుఁ దెచ్చుచున్నవి దరిద్రహేతువులైన అల్యూమినమ్‌పాత్రలు, గ్లాసులు మొదలైనవి; అనుదినమును హిందూపూజారులు లక్ష్మీకరమైన సింహద్వారములయొద్ద గుమ్మముల నలుకునపు డుపయోగించునది అలక్ష్మీకరమై, అనారోగ్యకరమైన అల్యూమినమ్‌పాత్రయందలి జలము; పసిపిల్లలకు భోజనము పెట్టునపుడు హిందూనారీరత్నము లుపయోగించుచున్నవి అనారోగ్యకరమైన అల్యూమినమ్ పాత్రలు.

దీర్ఘాయురైశ్వర్యంబులందు వాంఛగల హైందవులు ఈఅధమమైన అల్యూమినమ్‌లోహపుపాత్రలను దమయింట నుంచరు. స్పృశింపరు. దర్శింపరు. సమీపింపరు.

తృతీయ భాగము.

సమాప్తము.



శ్రీ.

శుభమస్తు.

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## చతుర్థభాగము.

---

### హిందువుల నివాసస్థలములు.

హిందువులు వసించుస్థలములు మూడువిధములలైయున్నవి. ఇవి వనములు, గ్రామసీమలు, పట్టణములు. ఈభాగమునందు వీనిని గూర్చి వివరించుచు, దీర్ఘాయువెట్లు ఈస్థలములందు వసించుటవలన మార్పునొందునో చర్చింపఁబడియున్నది.

### 22 వనములు.

ప్రాచీనకాలమునుండియు భారతీయులు వనవాసము చేయుచుండిరి. హిందువుని ఆశ్రమములలో నొకటియగు "వానప్రస్థాశ్రమ" మిచ్చటనే గడుపుట విధియనియును యాజ్ఞవల్క్యస్మృతులును, శ్రుతులును వివరించుచున్నవి. ఈవనములు కామక్రోధాదులనుదునిమి, సత్వగుణమును బ్రసాదించు దివ్యప్రదేశములు. దీర్ఘాయువునిచ్చు ప్రశస్తసాధనములు.

వనవాసమనేకరీతులుగా నుత్సాహదాయకమై నతిశయిల్లుచు, దీర్ఘాయువునిచ్చును. ఇచ్చట వచ్చు మలయమారుతములు ప్రాణమునకు ప్రధానములు. వనములందు వ్యాపించియుండు ఫలవృక్షములు, శుకములు, నెమళ్లు, పూబోండ్లకత్యంతప్రీతికరమైన నికుంజపుంజములు, పుష్పవిశేషములుం మున్నగునవి ఉత్సాహకారణములు. చక్రవర్తులకును శ్రీమంతులకును, కష్టసాధ్యమైన యిట్టిదివ్యవిశేషములు, వనవాసస్థులకుఁ గరతలములు.

ఈమనోహరములైన వనములందు పరిశుభ్రమైనజలము లభించును. కందమూలాదులు విరివిగానుపయోగించుటవలన శరీరమారోగ్యముతో నలరారు. ఇచ్చటవీచునిర్మలవాయువు ప్రాణమునకు రక్షణమై రంజిల్లుచుండుటచే యోగీశ్వరులు వాయుభక్షణము చేయుచు జిరకాలము వర్ధిల్లుదురు. వనములందు మనశ్శాంతి విశేషముగాలభించును. ఇది ఏకాగ్రచిత్తమునకు ప్రధానము. ఏకాగ్రచిత్తము శోణితమును శుభ్రపఱచి దీర్ఘాయువు నొసగు మహాయోగము, తపస్సిద్ధికిని, మోక్షసుఖముల నొందుటకును ముఖ్యయంత్రము.

వనవాసస్థులు ధైర్యస్థైర్యపరాక్రమవంతులై విలసిల్లుచు, దీర్ఘాయువు నొందుదురు. ఇచ్చటిక్రూరమృగములు వీరిదరికిఁజేరవు. తొల్లి విశ్వామిత్రాశ్రమంబున వసించియున్న శకుంతలకు, చిఱుతప్రాయమందే సింహములను, ఏనుగులను మర్దించుచుండిన భరతుఁడుద్భవించుటకుఁ గారణము వనవాసప్రభావముకాదే. వనవాసస్థులు పరాక్రమవంతులై దీర్ఘాయువుతోఁ దులతూగుదురు. వారికి దయా, ధర్మ, సత్య శౌచాదులును, సద్వర్తనములును దివ్యభూషణములై ప్రకాశించు.

## —♦ 23 గ్రామసీమలు ♦—

హిందువులు పురాతనకాలమునుండియు గ్రామములందే విస్తారముగా వసించుట వాడుక. ఈగ్రామసీమలారోగ్యమునకును, మనశ్శాంతికిని, సుఖమునకును, నెలవులు. నిరంతరము వేదశబ్దములతోఁ బ్రతిధ్వనించుచుండు పుణ్యక్షేత్రములు. పూర్వాచారపరాయణులై, దార్ఢ్యవంతులై, దయాధర్మసత్యశౌచాదులతోఁ దులతూగుచుండు హిందూగృహస్థులతో మెఱయుస్థానములు. కలకలలాడు స్వరములతో నాటపాటలకుఁ బనుగులెత్తు బాలురతోను, పచ్చికతోఁగూడియున్న రమ్యమైన మైదానములందు, ముద్దులొలుకుచు, దుముకులాడుచుండు



మేకపిల్లలమందలతోను నిండియుండు మనోహరములైన ప్రదేశములు. వయ్యారపునడకతో, లక్ష్మీకరమైన అందెలధ్వనితో, కొలనులనుండి బిందెలతో జలముఁదెచ్చుచుండు పూఁబోండ్లతోను, పెరుగువిక్రయించు గొల్లభామలకేకలతోను, ఆనందము నుదయింపఁజేయు ఆశ్రమములు. దార్ఢ్యదాయకములైన దధి, ఘృతములను, నానావిధఫలములగు భోజనపదార్థములను, సులభమూల్యమున కొసఁగుచు బ్రకాశించు ప్రాంతములు. అతిథిసేవాసత్కారమునకు మార్గదర్శకములై, పుణ్యకార్యము లాచరించు దీక్షాపరులతోఁ దేజరిల్లుచు, హిందువులకు సదాచారములను బోధించుచు, దీర్ఘాయువునొసగు దివ్యస్థలములు.

ఈదీర్ఘాయువు గ్రామస్థులకు నచ్చటనుండు కాళీప్రదేశము వలనను, తక్కువజనసంఖ్యవలనను, లభించును. పల్లెలందు విశేషమైన కాళీప్రదేశమువలన, ఇచ్చటవసించు హిందువులు మలమూత్రవిసర్జన మొనరించుకొనుటకుఁ జక్కనిసదుపాయము లుండును. ఇందువలన అనుమానము కలిగినవెంటనే వీనిని విసర్జించుట కవకాశము మెండుగా నుండుటవలన వానిని బాధింపనగత్యము కలుగదు. ఆరోగ్యము సులభముగా గలుగును. ఈకొందిజనసంఖ్యవలన జనసంపర్కదోషము గ్రామసీమలందుఁ గలుగనేరదు. వాయువుయొక్క శుభ్రతతొలగనేరదు. అంటురోగోత్పత్తికి నవకాశముండదు. ఇచ్చోట్ల సావకాశముతో జపతపములు గావించుకొని, హైందవాచారముల ననుసరించి వర్తించుటకు వీలుకలుగుటచే గ్రామస్థులకు నారోగ్యము లభించి, దీర్ఘాయుర్లాభము ప్రాప్తించును. ఇంతియగాక, కొలఁదిజనసంఖ్యతోఁ గూడియుండు ప్రాంతములగుటచే, గ్రామములు సన్మార్గవర్తులతో మెఱయుచుండును. గ్రామస్థులొనరించు దుష్కార్యములు త్వరలో వెల్లడియగును. పిల్లలును, పెద్దలును చోరత్వమందుగాని, జారత్వమందుగాని, పాల్గొనరు. వారు సంఘబహిష్కారభీతితో మెలఁగుదురు. గ్రామసీమ

లందలి యువజనులును స్త్రీ పురుషులును దేవ గురుపితృభక్తులతో నతిశయించియుండి, సన్మార్గవర్తులై ఉత్సాహము నొందుచు, దీర్ఘాయువుతోఁ బ్రకాశింతురు.

గ్రామమందలి ప్రజలు సన్మార్గులైయుండుటయేకాక పూర్వాచారపరాయణత్వము పల్లెటూళ్లకు భూషణమైయుండుటచే నిచ్చటిప్రజలు దీర్ఘాయుర్లాభ మొందుదురు. ఇచ్చటనుండు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులును దమమతనియమములాచరింతురు స్నానసంధ్యావందనాదులు లొనరింతురు. దేవాలయముల కనుదినము నుదయసాయంకాలములం దేగుదురు. వీరియెడల నితరహిందువులకు గౌరవము కలుగుచుండును. శాస్త్రోక్తమైన సమ్మానమును విప్రవర్గము వారొందుదురు. మరియు దేశీయవిద్యలగు నాయుర్వేదము, వేద, శాస్త్ర శ్రౌతములు నిచ్చోట్ల వృద్ధినొందును. ఈపూర్వాచారములు హిందువులకు దీర్ఘాయువు నిచ్చునవని ఈగ్రంథమందు వివరింపఁబడియున్నది.

దీర్ఘాయువునొందుటకై మనశ్శాంతి అవసరము. ఇది గ్రామస్థులకుఁ గరస్థమైయున్న అమూల్యాభరణము. ఇచ్చట నాగరకశూన్యమైయుండుటచే చిరకాలమునుండియు హిందువుల కభ్యస్తమైన వ్యవసాయమే గ్రామస్థులలో నన్నివర్ణములవారికిఁ బ్రధానవృత్తియైయుండును. ఈవృత్తివలన దేహపరిశ్రమ కలిగి సుసేమారము నాశనమొందును. మనుజుఁడు దార్ఢ్యవంతుఁడై రోగరహితమైన శరీరముతోఁ దేజరిల్లు. పగలెల్ల నీతఁడు పొలమునందు బనిచేసి కడుపార సుఖముగా భుజించుచుఁ, జక్రవర్తిని సహితము మించునంతటి సుఖము నొందునని ఈగ్రంథముయొక్క మూడవపుటయందు వివరించియుంటిని. గ్రామసీమవాసులు ఈహేతువువలన నుత్సాహవంతులై ఆయుర్వృద్ధి నొందుదురు.

గ్రామసీమలందు, ప్రధానమైనవృత్తి వ్యవసాయమగుటవలన నీప్రాంతవాసులు స్వచ్ఛమైన ప్రాణవాయువు నాఘ్రాణించి దీర్ఘాయువు



నొందుదురు. ఈవాయువు పొలములందును, మైదానములందును వీచును. వ్యవసాయదారులు దీని నాఘ్రాణింతురు. గ్రామ మహోన్నత్యములైన గృహములతో నావృతమైయుండనందున బొలములనుండి స్వచ్ఛమైన వాయువు గృహములవైపునకుఁ గూడ వీచుచుండును. గ్రామములు వ్యవసాయదారుల పొలములతో నావృతములై కన్నుల పండువుగా నుండును. పొలములపైనుండి వీచు పరిశుభ్రవాయువు గ్రామస్థులెల్లరు నాఘ్రాణింతురు. ఈవాయువు గ్రామములందలి వీధులందును, వృక్షముల చెంతను, గృహములందును బ్రవేశించి, గ్రామస్థులచేఁ బీల్చబడి రక్తమును శుభ్రపఱచుచు నుల్లాసము నిచ్చును. గ్రామసీమవాసుల కీరీతిగా ప్రాణవాయువు లభ్యమై, దీర్ఘాయువు నొసగును.

ప్రాణవాయువేగాక గ్రామములందు స్నానపానాదులకు వలసిన నిర్మలోదకము విశేషముగా లభించుటవలన, గ్రామస్థుల కాయుర్వృద్ధి కలుగును. గ్రామములందు విశేషజనసంఖ్య యుండనందున నిచ్చటి ఉదకము అపరిశుభ్రపడనేరదు. ఇచ్చట కొలది కూపములే యుండును. గ్రామస్థులు, వీనినుండి నీరు ఊరినతోడనే దానిని తోడి వుపయోగింతురు. ఇట్టి నీరు ప్రశస్తమని వైద్యశాస్త్రము వివరించుచున్నది. గ్రామములందు బావులలోని నీటిపై సూర్యరశ్మి ప్రసరించుచుండును. దాని కాటంకములుగా నౌన్నత్యములైన సౌధములుగాని ఫ్యాక్టరీలుగాని నచ్చట నుండవు. ఇన్నిహేతువులచే గ్రామములందు కూపప్రవాహోదకము నిర్మలమైయుండును. ఈచోట్లవసించువారు దీని నుపయోగించి, దీర్ఘాయువు ననుభవింతురు.

గ్రామసీమలందు నిర్మలోదకమేగాక ప్రశస్తమైన భోజనపదార్థములు లభించుటచేఁ బల్లెటూరివాసము దీర్ఘాయుర్దాయసాధనమై ప్రసిద్ధి కెక్కియున్నది. ఇచ్చట ప్రజలవృత్తి వ్యవసాయమగుటచే గాలి వాండ్రనేకులుండరు. వీరు పగలు పొలములందు బాటుపడి, రాత్రివేళ

లందుఁ బనికలిగినపుడెల్ల వడ్లుదంపుదురు. వడ్లుదంపు వృత్తిగలవారనేకులు పల్లెటూళ్లయందు వసింతురు. ఇచ్చట విశేషమైన ఖాళీప్రదేశములుండుటవలన ధాన్యముదంపుటకు సదుపాయముగా నుండును. ఈధాన్యమును దంపుటవలన లభించు బియ్యము ఆయుర్వృద్ధికరమని ఇదివరలో దెల్పియుంటిమి.

గ్రామసీమవాసులు భోజనపదార్థములలో శ్రేష్ఠతరమైన కూరకాయల నవలీలగ సంపాదింపగలరు గావున వారు దీర్ఘాయువు నాకర్షింతురు. గ్రామములందు వ్యవసాయమెల్లరకుఁ బ్రధానవ్యాపకమగుటచే వీరందరును దమతమపొలములందు ననేకరకములైన కూరలనెల్ల కాలములందును గాపింతురు. వీరిగృహములు వైశాల్యముతో నొప్పారుటచే, ఇండ్లకడగూడ చిక్కుడు, బీర, పొట్ల, వంగ, కాకర, ఆనపకాయలు ఫలించును. ఈకూరలెప్పటికప్పుడు కోయబడినవై, సుగుణములతో నలరారు. గ్రామములందెప్పటికప్పుడు కోయబడిన రసవంతములైన కూరలను, ఫలములును లభించును. వీనియందుండు రసము జీర్ణశక్తిని, ఉత్సాహమును ఆరోగ్యమును బుట్టించుటయందు మెప్పుఁబడసియున్నది. నిలువయుంచబడిన కూరలును, ఫలములును, దమసత్తువను గోల్పోయినవై, రసహీనమైయుండి, శరీరదార్ఢ్యమును, ఉత్సాహమును గల్గింపఁజాలవు. గ్రామసీమలందు లభించుకూరలలోఁ బ్రశస్తమైనది పనసకాయ. ప్రపంచమందలి కూరలలో నీకూర ప్రశస్తమగు రుచికలదగుటచే శాకరాజమని "కోనసీమ" ఖండవాసులు దీనిని వర్ణించుట వాడుక. పనసకాయకిట్టి ప్రాశస్త్యముకలదు కావున పితృదేవతా ప్రీతికరమనియు, ఇట్టిదిలభించినపుడు తద్దినముఁబెట్టుట కర్తవ్యమనియు, హిందూధర్మము వచించుచున్నది. ఈపనసకాయకూరను ఆవపెట్టి వండినయెడల స్వర్గలోకమునందలి అమృతరుచులను మించియుండును. కోనసీమప్రజలు శాకములకు మంత్రియని పిలుచు నీరువంకాయ, అతి



కమ్మదనముతో విరాజిల్లుచుండును. రాజునకుఁగల ఉగ్రతను మంత్రివర్యుఁడెట్లు హితవచనంబులతో డంపివేయునో, అట్లే పనసకాయకూరయందుగల విశేషపువేడిని నీరువంకాయయందుగల శీతలస్వభావము అణచివేయుటవలన, పనసకాయ శాకరాజమనియు, వంకాయ కూరలలో మంత్రియనియుఁ బిలువఁబడుటకుఁ గారణమని యెంచవచ్చును. గ్రామసీమలందెప్పటికప్పుడు కోయబడిన బెండ, గుమ్మడి, కదళీ మొదలగు కూరలును, ఘుమఘుమలాడు సుగంధయుతమైన కొత్తిమిర, ఘాటుతోగూడి నిడివైన పచ్చిమిరపకాయలును, వృక్షము మీఁదపండిన నిమ్మకాయలును ప్రశస్తములైనవి లభించును. ఇవన్నియు యుక్తముగా నుపయోగింపబడినచో నుత్సాహదాయకములై వఱలు. వీనితోభోజనముచేయునపుడు అసాధారణపరిమాణముగల అన్నము భుజింపవీలగును. మరియు గ్రామసీమలు నానావిధఫలములకును బ్రసిద్ధికెక్కియున్నవి. ఇవి చెట్టుమీఁదముగ్గినవే కాని బలవంతముగా కావు గట్టుటవలనగాని లేక ఊదరగొట్టుటవలనగాని పక్వమునొందినవి కావు. స్వతస్సిద్ధముగా పక్వమైనఫలములు, శరీరమునకుత్సాహమునిచ్చును. కావుకట్టుటవలన పండినపండ్లు స్వాభావికమగు రుచిలేనివై యుండును. ఫలములలో శ్రేష్ఠమైనవి మామిడి, టెంకాయ, పనస, బత్తాయిలు. ఈఫలవృక్షములతోపులు "కోనసీమ" యొక్క ఘనతకు ముఖ్యకారణములు. ఈఫలములు, ఈఖండవాసుల భాగ్యమునకును, గోదావరీమండలముయొక్క ఆధిక్యమునకును, ఆంధ్రమండలముయొక్క ఉత్కృష్టతకును పరమరహస్యములు. వసంతఋతువునందీఖండవాసులొనరించు దేవకార్య, అతిథిసత్కార, బంధుమిత్ర ఆదరణ, సమయములందు విరివిగా నుపయోగింపఁబడు దివ్యపదార్థములు. భరతవర్షైశ్వర్యమును బ్రకటించు అమూల్యరత్నములు. ఉత్సాహమును బ్రసాదించి, దీర్ఘాయువు నిచ్చు సువస్తువులు.

గ్రామసీమలందు శ్రేష్ఠతరమైన క్షీరము, దధి ఘృతములును, లభించుటవలన వీనిని సతతము స్వీకరించువారు దీర్ఘాయుర్ఘరీరమందు శాశ్వతనివాస మేర్పరచుకొనగలరు. ఇచ్చటిపశువులకు దార్ఢ్యవంతమైన దంపుడుచిట్టును దవుడును విశేషముగా లభ్యమగును. పొలములందివి ఎప్పటికప్పుడు కోయబడిన ఉలవ, పెసర, మినప, అనపరొట్టలు నమలి మహాదార్ఢ్యముతోఁ దీపించుచుండు. మరియు బీళ్లయందును, చేలగట్లయందును ఫలించు రసవంతమైన పచ్చికఁ దినుచు, గ్రామమందు నిరంతరమును వీచు పరిశుభ్రవాయువును బీల్చుచు, స్వచ్ఛమగు జలపానము చేయుచుండుటవలన గ్రామసీమపశ్వాదులొసఁగు క్షీరము అఖండబలముఁ గల్గించి మానవశరీర ముత్సాహముతోఁ బొరలునట్లు చేయుసమర్థతతో విలసిల్లు. ఈక్షీరము సూర్యగ్రహప్రీతికరమైన క్షీరాన్నము వండుట కర్హమై యుండును. దీనిని హిందూగృహములందు, దయారగు పిండివంటలందు విస్తారముగా వాడుట ఆచారము. ఈక్షీరము దార్ఢ్యము నిచ్చును. వీర్యవృద్ధిని గావించును. కాకచేయును గావున వాతశరీరముకలవారికి నీక్షీర ముత్సాహమును హెచ్చించును. శ్లేష్మముచేయు గుణముకలదగుటచే క్షీరము కాకశరీరముకలవారు విశేషముగా నుపయోగింపగూడదు. ఈక్షీరమును ద్రావి, తాపసోత్తములు అనేకదినములు భోజనము మాని యుండగలరు.

ఈక్షీరమునుండి తయారైన పెరుగు, అతిమాధుర్యము కలదై జిహ్వ లేచివచ్చునంతటి కమ్మనిజిడ్డు కలిగి, దానిని స్వీకరించిన సుమారు పక్షముదినములవఱకు నహోరాత్రములు దాని సుగుణములను జ్ఞప్తికిఁ దెచ్చునంతటి సంతోషము, నూతనశక్తి, ధైర్యసాహసములు శరీరము నాశ్రయించియుండునట్లు చేయును. భోజనపదార్థములలో లోకమందే వస్తువును గ్రామసీమలందు దొరకు పెరుగును మించియుండదు. దీనిరుచి చూచునంతవఱకును మానవుడు ప్రపంచసౌఖ్యముల



ననుభవించెనని చెప్పుటకు వీలుండదు. ఈదధియు, దజ్జనితమగు ఘృతము దేహమున కఖండశక్తి నొసంగి, దార్ఢ్యమును బూరింపఁజేయును. ఎట్టి ఘనకార్యమైన నవలీలతోఁ జేయగల బల ముదయింపఁజేయును. మండువేసవికాలమందు నిసుకపఱ్ఱలఁగూడా ప్రయాణముచేసి డస్సిన బాటసారులకీదధిఘృతము లమృతతుల్యములు. ఘనతృష్ణాతురులకుఁ బ్రాణమిత్రములు. ముద్దుటుంగరముల బోలు కురుల సౌందర్యముతోఁగూడిన పసిబాలురకొలికెల మధ్యనుండి బొటబొటమని స్రవించు బాష్పధారలను వీనిదర్శనము స్తంభింపఁజేయును. ఈపదార్థరాజములు పాశ్చాత్యనాగరకతాసాంప్రదాయములగు కాఫీ, తేనీరు మున్నగువానిని స్వీకరించు అభ్యాసమును హిందూసంఘమునుండి దూరముగాఁ దరిమి, తరిమి, తరిమి హిందూయువజనులకును, పసిపిల్లలకును, దీర్ఘాయువు నొసఁగు ప్రాతఃకాలభోజనమునకుఁ బ్రాణమిచ్చును. వీణాగానము జరుగుచున్నపుడు యౌవనసుందరి యువకులయెదుట నిలచి, నాట్యముచేయునపుడు కలిగించు ఉత్సాహముకంటె మిన్నయగు బరమోత్సాహము ఈదధిఘృతముల భోజనము జనింపఁజేయును. వానప్రస్థాశ్రమమును స్వీకరించి, ఇహలోకసుఖము లశాశ్వతమైనవని సర్వమును త్యజించితిమని విఱ్ఱవీగు సన్న్యాసులకుఁ గూడ ఈదధిఘృతముల దర్శనము, నోరూట లూరింపఁజేయును. పుత్రవాత్సల్యసూచనార్థమై, హిందూజనని దూరదేశముల కేగి తిరిగివచ్చినపుడుగాని, మార్గాయాసము చెందినపుడుకాని, తన పుత్రులకును, అత్తవారింటియొద్దనుండి వచ్చిన తనపుత్రికలకును, ఈపదార్థరాజములతో భోజనము పెట్టువఱకును, ఆమెకు మనశ్శాంతి కలుగనేరదు. ఈపదార్థశ్రేష్ఠములు, హిందువుల భోజనమునం దాద్యంతములం దుపయోగింపఁబడునవి గావున నీవస్తువులులేని ఎట్టి "భారద్వాజాతిథ్య"మైనను రసహీనమైన గానముతీరున, నృపాలుఁడులేని రాజ్యముచందంబున శోభిల్లజాలదు.

బాల్యదశనుండియుఁ బగటిపూటయందు పరిమితమగు పరిమాణముల నన్నమునందుపయోగించు భారతీయోత్తములు, వజ్రకాయములతోఁ, పుష్టియుక్తములైన బిగువుగల దేహములతోఁ, సర్వావయవాభివృద్ధినొంది, దీర్ఘాయువుతో వర్ధిల్లుచుందురు. ఈదధిఘృతములతోఁడి భోజనము ఇహలోకస్వర్గము. అపరిమితారోగ్యసంతతము. నిరుపమాన సంతోషదాయకము. అఖండదార్ఢ్యదాయకము. విశేషమేహశాంతి. సర్వజనవాంఛితము. అతిథిసత్కారార్హము. పితృదేవతాప్రీతికరము. శరీరమునకు లావణ్యమిచ్చు నౌషధములలోఁ బరమౌషధము. ఈవస్తువులతో భోజనముచేయువారును, భోజన మితరులకుఁ బెట్టువారును నిజముగు భాగ్యవంతులు. ఇంటికిఁ బూఁబోడియు, కత్తికి వాడియు, వ్యవసాయమునకు కాఁడియు, సంతర్పణకు గాడియు, చాపునకు వేడియు, సంసారమునకు పాఁడియు ముఖ్యములని ఆర్యులు నుడువుదురు. కావున, ఎంతధనమున్నను, ధర్మమున్నను, పాఁడిపంటలు లేనివారిజీవన మత్యల్పము. గ్రామసీమస్థులకు విశేషముగాఁ బాఁడిపంటలుండును. వారందువలన దీర్ఘాయువునొందు నరోత్తములు.

ఇట్టియోగ్యతగల పాఁడిపంటలయు, కూరలయు, నానావిధఫలవృక్షములయు దంపుడుబియ్యము మొదలగు భోజనపదార్థములయు సమృద్ధిగలవగుటచేఁ బూర్వాచారములకు మార్గదర్శకములగు హిందువులు వసించు గ్రామసీమలు, ప్రాచీనకాలమునుండియు నతిథిసత్కారమునకుఁ బ్రసిద్ధికెక్కినవై హిందూదేశముయొక్క ప్రఖ్యాతికి మూలములై తేజరిల్లుచున్నది. ఇచ్చట జనసంఖ్య తక్కువగానుండుటవలనను, ప్రశస్తమైన సమస్తభోజనపదార్థములును తక్కువవెలకు దొరకుటవలనను బూర్వాచారపరాయణులతోఁ గూడియుండుటవలనను, ఈప్రాంతవాసులు సాధారణముగా దమపొలములందు ఫలించు కష్టార్జితవస్తువులతో, నుత్తమద్రవ్యముతో నాతిథ్య మొసఁగెదరు. గ్రామ



సీమస్థులు మహారుచితో విరాజిల్లువట్టియత్యంత చతురతతోఁ గూరలను వండగలరు. వీరు తయారుచేయు గుత్తివంకాయకూర శాకముతో వండబడినవై రెట్టింపు పరిమాణముగ నన్నమును స్వీకరింపఁజేయును. గ్రామసీమలందు లభించు పెరుగు, నెయ్యి మొదలైనపదార్థరాజములతో నతిథికిఁ గడుపార భోజనముపెట్టు మహాసీయులు భరతవర్షమున గలరు. వీరు ఆసేతు హిమాచలదేశమునకు భూషణములై మహాపుణ్యకార్యము లొనరించిన ఫలము నొంది శాశ్వతకీర్తిని బడయుచుందురు. గోదావరీమండలమున నవశిష్టావైన తేయములకుమధ్యనున్న ఖండమందు వెలసియున్న గన్నవరంగ్రామమందుఁ జిరకాలమువర్ధిల్లి కీర్తిశేషురాలైన శ్రీ డొక్కా సీతమ్మగారు అతిథిసత్కారనిరతురాలై శాశ్వతపుణ్యకీర్తులను సంపాదించిన మహాత్మురాలు. ప్రియవచనములతో దానముచేయుట దుర్లభమని బుధులు వచింతురు. ఈమహాజననియొక్క దానములు ప్రియవచనయుతములై, ఈమెచేయు ఆదరణము నిరుపమానమైయుండెను. ప్రాచీనహిందూమహాయుగము నాటనుండియు నన్నప్రదానమునకు వన్నెకెక్కిన భరతవర్షమందు, రాజాధిరాజులకైన నన్నప్రదానము విషయమున లేని కీర్తిని, శ్రీ సీతమ్మగారు సంపాదించుటకు మూలకారణము, ఈమహాత్మురాలి ఆదరణమే. అతిథులెట్టివారైనను వర్ణ, జాతి, వయోవివక్షత లేకయే వారిని దన గర్భవాసమున బుట్టిన బిడ్డలవలెనెంచుకొనుచు, వారిని నిశీథమందైనను సత్కరింపఁ గుతూహలముతో నుండెను. తనగృహమున కేతెంచు అతిథులు కడుపార భుజించుటయే ఈపుణ్యభామినియొక్క కడుపారభోజనముగా నుండెను. ఈపుణ్యాలలామయొసఁగు దివ్యపదార్థము లమితమైన రుచికలవై, ఎంతటిచతురత వినియోగపరచినను వానిరుచితో సమానముగానుండునట్లు యొవరేరును దయారుచేయజాలరని ఈమె ఆతిథ్యమును స్వీకరించిన పుణ్యాత్ములిప్పటికిని వచింతురు. ఈసాధ్వీమణి,

తనగృహమువైపునకు వైనతేయమునకడ్డముగానున్న అక్కీడక్టుమీదనుండి, ప్రయాణీకులు బయలుదేరవచ్చుట కనుపెట్టినతోడనే వారు తన గృహపావనమొనరింప అతిథులని యూహించుచు, సంతోషభరితురాలగుచుండెను. ఈలోకమాత, తన షష్టిపూర్తియైనపిమ్మట క్రీ శ 1909 ఏప్రిల్ 27 వ తేదిని అస్తమించి భరతవర్షమునకుం దీరని కొఱంతను గల్గించినది. రవి ఎన్నడును అస్తమింపని బ్రిటిషుసామ్రాజ్యమును శ్రీ విక్టోరియా మహారాజ్ఞి పరిపాలించుచుండ, ఆమెయొక్క సమకాలీనురాలగు శ్రీ సీతమ్మగారు శాశ్వతమైన పరలోకసుఖములకు మూలమైన అన్నప్రదానరాష్ట్రమును భరతవర్షమునందుం బాలించుచుండె. ఈపుణ్యాంగనయొక్క అపారకీర్తిని దెల్పుచు, ఈమెకు సప్తమ ఎడ్వర్డుని పట్టాభిషేకసమయమున నొకపట్టా (Sanad) బొసంగబడినది. అన్నప్రదాననిరతురాలైన ఈయింతియొక్క అమోఘభక్తియు, ఓర్పును, బరీక్షింపఁగోరి పరమేశ్వరుం డొకనాడు ప్రచ్ఛన్నవేషధారియై వృద్ధవిప్రరూపముతో నామెయొసఁగు ఆతిథ్యమును స్వీకరింపకం బూర్వము, తన వివాహార్థమై ద్రవ్య మొసంగవలయుననియు, లేకున్న తాను భోజనము చేయననియు దెలిపె. తక్షణ మ యాపుణ్యాత్మురాలు కరుణాసముద్రమగు హృదయముతో, బరిశుద్ధాంతఃకరణముతోఁ దన హేమభూషణమగు కంటె నాతని కర్పించె. ఆకపటవిప్రుడు భోజనముచేయువానివలె నటించి, కంటె నామెకు దాచుమని యిచ్చి, ఆమె ఎదుటనే అదృశ్యుండయ్యె. శ్రీ సీతాదేవిని స్ఫురణకుం దెచ్చు ఈపుణ్యాంగనయొక్క నామము నుచ్చరించుమాత్రముచే దరిద్రులెల్లరును లేమియొక్క పాశములను బటపటమని ద్రెంపగలరు. పరదేశమున కేగినవారు ఈమెయొక్క దివ్యనామమును భక్తితో స్మరింతురేని వారికానాడు శ్రేష్ఠమైనభోజనము లభ్యమగును. దుష్టు లీకొయొక్క వృత్తాంతము నాకర్ణింతురేని వారు సన్మార్గులగుదురు,



కపట, కుటిలబుద్ధులుగలస్త్రీలు, ఈమహానుభావురాలినిగూర్చి వినునంతటనే ధర్మమార్గము కలవారగుదురు. శుభములకుగాని, కార్యసాఫల్యమునకుగాని నెదురుచూచువారలు ఈమెనుస్మరించినతోడనే జయవార్తలాకర్ణింతురు. ఉత్సాహపరవశులై, దీర్ఘాయువునొందుదురు. ఈ పుణ్యభామిని స్వస్థలమైన గన్నవరంగ్రామము పిఠాపురంసంస్థానములో జేరియున్నందున, ఈసంస్థానాధీశులగు శ్రీ రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు మహారాజాగారు సకలదానధర్మములకును మార్గదర్శకులై మహదైశ్వర్యమనుభవించుచున్నారు. శ్రీసీతమ్మగారి మహాయశస్సువలన భరతవర్షమునకును, ఆంధ్రదేశమునకును, పవిత్రమైన వైనతేయాతీరస్థులకును, బ్రాహ్మణజాతికిని, ద్రావిడవంశజులకును, శాశ్వతమైన గర్వకారణము కలిగినది. ద్రావిడవంశజుండును నవనీతమనస్కుండునునై, దక్షిణహిందూస్థానమందు న్యాయశాస్త్రవేత్తయై, ఆంధ్రులగర్వకారణమై, తేజరిల్లుచున్న శ్రీ పేరి నారాయణమూర్తిగారి జన్మస్థలమైన పేరూరు ఏఖండమునగలదో, అట్టి కోనసీమగర్భమందు వెలయుచున్న గంగలకుర్రు అగ్రహారవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ శ్రీ తాతా కామేశ్వరశర్మగారికి వారసత్వమువలన శ్రీ సీతమ్మగారియొక్క అన్నప్రదానమను మహాభూషణము సంక్రమించి వారిగృహము నలంకరించియున్నదని చెప్పవచ్చును. శ్రీ శర్మగారు శ్రోత్రియబ్రాహ్మణశేఖరుడు. అఖండదేవతార్చనాధురంధరుడు. బ్రహ్మవర్చస్సుతో బ్రకాశించు తేజోమూర్తి. సతతము దేవధ్యానముతో విరాజిల్లు విప్రపుంగవుడు. అనుదినమును, రెండుపూటలందును వేద, శాస్త్ర, శ్రౌతపండితులను దనయుభయపార్శ్వములనుంచుకొని వారితో భోజనముచేయు దీక్షాపరుడు. అన్నప్రదానమున వీరి కమృతపానము. వీరి గృహమునకనుదినమును నాతిథ్యము స్వీకరించువారిలో నవనాగరకులు గన్పించుట దుర్లభము. శ్రీ శర్మగారి శ్రోత్రియాచారములవ

లన హిందూధర్మాచరణముఁజేయు దీక్షాపరులే వీరిని నిర్భయముగా దర్శింపసాహసులు. శర్మగారు దయారసముతోఁ దులతూగుచు నెల్లరను సమభావముతోఁ జూచు సాత్వికపురుషులు. నిర్మలహృదయులు. వీరు గొప్పభూంసతిదారులగుటచే, తమగృహములకే తెంచిన అతిథులకు కాలమునను సరించి వారికి లభ్యమగు పనస, మామిడి, టెంకాయఫలముల నొసఁగుటయందు విరామముఁజెందని ధర్మాత్ములు. వీరనుదినమును జేయు అన్నప్రదానము వస్త్రములతో గూడియుండి, శ్రీ సీతమ్మగారి ఖ్యాతిని దెలుపుచున్నది. వీరిగృహమందు వేదవిద్వాంసు లనుదినమును వేదపారాయణము జేయుచుండుటవలన, వీరు ప్రశస్తమైన వేదోక్తాశీర్వచనము నొందు పురుషశ్రేష్ఠులు. వీరు ప్రాచీనహిందూఆచారము లాచరించు నిగర్వచూడామణులై ప్రకాశించుచుండుటవలన వీరువసించుచున్న కోనసీమఖండము పావనమగుటయును, హిందూసాంప్రదాయములగు కార్యము లుద్ధరింపఁబడుటకును నవకాశము కలుగుచున్నది. శ్రీ శర్మగారికిఁ బరమేశ్వరుఁడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించి, ఖ్యాతితో వర్ధిల్లఁ జేయుచు, ఈశ్వరనామ మెందాక మానవులు స్మరింతురో, అంతదనుక ఈశ్వరశబ్దముతో గూడియున్న వారినామము పృథివిపై వఱలునట్లు కృపయొసఁగుగాక!

గ్రామసీమలందిట్టి దివ్యలాభములు కలుగుచుండ, ఆధునికహిందువులు గ్రామములను విడనాడఁదొడఁగుచున్నారు. పూర్వకాలపు హిందువులును, ప్రాచీనాచారములం దభిమానులును గ్రామములు వదలక, నచ్చటనే వసించుటవలన వారికి దీర్ఘాయువు కలుగుటకు సులభమగుచున్నది.

## —♦24. పట్టణములు.♦—

పట్టణములు, గ్రామములకంటె విశేషమైన విస్తీర్ణతతోను, జనసంఖ్యతోను గూడియుండుటవలన నీచోట్ల వసించువారికి ప్రశస్త



మైన వాయువు, జలము, భోజనపదార్థములును లభింపజాలవు. నిర్మలవాయువుతో నిండియుండు బయళ్లు, పట్టణములకు గడుదూరములై యుండును. ఇచ్చటిజనులందువలన మురుగుదొడ్లలోనికిఁ జనునగత్యము కలుగును. ఒకయింటిమురుగుదొడ్డి, మరియొకయింటివంటయింటిని జేరియుండును. దుర్గంధములపై వ్రాలిన కీటకాదులు, భోజనపదార్థములపై వ్రాలును. ఈదొడ్లలోనికి బోవువారు దుర్గంధముల నాఘ్రాణింతురు. గర్భిణులిందువలన దుష్టసంతతిని బడయుదురు. పల్లెటూళ్లనుండి ఇచ్చోట్ల కేతెంచు సేద్యగాండ్రును, వేదశాస్త్రపండితులును మలవిసర్జన మొనరింప వీలులేనివారై మిక్కిలి కష్టింతురు. పట్టణములందు ప్రజలొకరునిడిచిన దుర్వాయువును మరియొకరాఘ్రాణింతురు. ఇట్టిపనులు అంటురోగోత్పత్తికి మూలములు. మరియు, ఈపట్టణములందు సౌధముపై సౌధము చేరియుండును. కూపములు సూర్యరశ్మిని యుక్తముగా నొందజాలవు. ఇట్టిజలము ప్రశస్తముకాదని వైద్యులు వివరింతురు. ప్రవాహోదకముకూడ పట్టణములందుఁ ద్వరలోనశుభ్రమగుచుండును. ఇంతియగాక పట్టణములు కుళాయిలతో గూడియుండును. వీనిచెంత నుండు నిలువనీరు త్వరలోఁ బోజాలదు. ఇందువలన, కుళాయిలుగల పట్టణములందుబోదకాళ్లు కానవచ్చుచున్నవి. పట్టణవాస్తవ్యులు తమకు అద్దె (బాడుగ) వచ్చునని ఎంచి ఖాళీప్రదేశములందెల్ల గదులు కట్టింతురు. ఇందువలన వడ్లుదంపుటకు దగిన సౌకర్యములు పట్టణములందుండుటలేదు. ఈప్రాంతవాసులు దంపుడుబియ్య ముపయోగింపజాలరు. జనసంకీర్ణమై యుండుటవలన పట్టణము లీరీతిగా దీర్ఘాయువును జెరచుచున్నవి.

పట్టణములు పరిశ్రామికవృత్తులకు నిలయములు. ఈచోట్ల వసించువారు, గ్రామస్థులవలె రసవంతములై, ఎప్పటికప్పుడు కోయబడిన కూరలను, ఫలములను సాధింపజాలరు. వీరికి వ్యవసాయము

సాగుట దుస్తరము. హిందూగృహములకు నమూల్యమైనపాడిపంటలు నగరవాసులకు సమకూరజాలవు. దుర్వాసనతో గూడిన పెరుగుమాత్రమే వీరికి మూల్యమునకు లభించును. ఇందువలన పట్టణములు, అతిథి సేవాసత్కారము చేయు ప్రదేశములు కావు. ఈప్రాంతవాసులు ఫ్యాక్టరీ బియ్య ముపయోగించుచు నల్పాయువునకుం జిక్కుచున్నారు.

పట్టణవాసులకు విశేష వ్యాపకము లుండుటవలన మనశ్శాంతి కలుగనేరదు. వారిమనస్సు ఆందోళముతో గూడియుండును. వారి కనుమానము కల్గినప్పుడెల్ల మలమూత్రవిసర్జన మొనరించు అవకాశము కలుగదు. ఇది, అల్పాయువునకు రాచబాట. ఇచ్చటిప్రజలు చేయు దుష్కార్యములు త్వరగాబయటం బడజాలవు. జారచోరత్వములు ప్రబలుట కవకాశము [illegible]. సంఘబహిష్కారభీతి పట్టణములందు శూన్యము. దేవ,గురు,పితృభక్తులు ఇచ్చటిజనులకుం బూజ్యములు. దురాచార దుష్టసాంగత్యములు పట్టణవాసులకుం గరస్థములు. ఇవి, అల్పాయువును దెచ్చు భూతములు.

ఆధునికకాలపు హిందువులు, గ్రామసీమలను విడనాడి, వానిని గొడ్డుదిబ్బలగా జేయుచున్నారు. అనారోగ్యకరమైన పట్టణములకు వారు జేరుచున్నారు. కావున వారిదీర్ఘాయువు భస్మీపటలమగుచున్నది.

చతుర్థభాగము.

సమాప్తము.



శ్రీ.

శుభమస్తు.

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## పంచమభాగము.

---

### స్త్రీల ఆభరణాది విశేషములు.

హిందూనారీరత్నములు, తమభర్తలను రంజింపజేయుటకై ఆభరణాదులతో నలంకృతులైయుండుట అవసరమని శ్రుతి, స్మృతులు బోధించుచున్నది. వల్లభులు, తమసతులకు నాభరణములుంచని యెడలం గాంతలు, ఆభరణములతో గూడియుండు అన్యకాంతల పతులపై అనురాగము కలవారై జారత్వమునకు లోబడుదురనియు, అందువలన ప్రతిహైందవునికిని, తనభార్యను నాభరణాదులతో నలంకరింపజేయు బాధ్యతగలదనియు, ధర్మశాస్త్రవేత్తలు వాక్రుచ్చుచున్నారు. ఈకాలమున హిందూకోమలాంగులు, నాగరకతాదోషముచే విడనాడుచున్న ప్రధానమైన ఆభరణములను గూర్చియు, అలంకారములను గూర్చియు ఈభాగమున జర్చింపబడును. ఇందలి కడపటి రెండు అలంకారములును, పురుషులకుంగూడ వర్తించును.

## —♦ 25 అడ్డబాస (బులాకీ) ♦—

ఈ ఆభరణమును హిందూసువాసినులు, చిరకాలమునుండియు నాశికాగ్రమందు ధరించుట నాచారము. ఆంధ్రదేశమున, దీనిని గొందఱు ముంగఱ అనియు, కొందఱు బులాకి అనియు, పిల్చుట ఆచారము. ఈ ఆభరణము సువర్ణ, వైక్రాంత, పుష్యరాగములతోఁ గూడియుండు. దీని చివర ముత్యమును పెట్టుటకు కొండి యొకటి అతకఁబడియుండును. ఇది మంచిముత్యమైనచోఁ బ్రశస్తమని ఈవ్యాసము వ్యక్తము చేయును.

బులాకియనఁబడు ఈ ఆభరణమును ధరించుటవలన హిందూ సువాసినులు దీర్ఘాయువునొందుదురు. ఈ అలంకారము చివరనుండు ముత్యము, స్త్రీలు సంభాషించు (బాసచేయు) నప్పుడు వారిపెదవులపై బడుచు, వారిబాసకు అడ్డువచ్చుచుండును, కావున దీనికి అడ్డబాస యని నామముకలిగెనని పండితోత్తములు తెల్పుచున్నారు. ఇట్లు, హిందూకాంతలు మాట్లాడునపుడు, ఈ అలంకారము వారికి మితభాషులుగా నుండుట ఆవశ్యకమని బోధించుచుండును. వారుసద్వర్తనలగుదురు; శ్వాసను అనవసరముగా విడువరు. ఇందువలన వారికి శ్వాసను బంధించుటవలన గలుగులాభము లన్నియు, 86 వ పేజీలో ప్రాణాయామసందర్భమున వివరించినట్లు కలుగును. దీర్ఘాయుర్లాభ మొదవు.

హిందూకాంత లీయాభరణమును ధరించుటవలన దంపతు లిద్దరకును దీర్ఘాయువు లభించును. మానవు లారోగ్యవంతులైయుండుటకుఁ బ్రాణవాయువు నాఘ్రాణించుచు, బొగ్గుపులుసువాయువు నెంతమాత్రము పీల్చకూడదు. బొగ్గుపులుసుగాలిని పీల్చుచుండుటవలన రక్తముచెడి, క్షయ, కుష్ఠము మొదలగు రోగము లంకురించుటయేగాక, ప్రాణాపాయముకూడ వాటిల్లును. క్రీ. శ. 1757 వ సంవత్సరమున సురాజడౌలా కాలమందు జరిగిన కలకత్తా "బ్లాకుహోలు"ను, 1921 వ వత్సరమున దక్షిణహిందూస్థానమున ధూమశకటములందు



బంధింపఁబడిన మాపలాఁ విపత్తును, బొగ్గుపులుసువాయువు నాఘ్రాణించువారికిఁగల్గు అల్పాయువును ప్రకటించుచున్నవి. దంపతులు అభిముఖులై సమీపముగానుండు సమయములందు వారొండొరులు విడుచు దుర్వాయువును వారుతిరిగి పీల్చ నవకాశము కలుగుచుండును. నారీరత్నములు, ఈనాశికాలంకారమును ధరించినచోఁ, రెండుహేతువులచే దంపతులు దుర్వాయువు నాఘ్రాణించుట కవకాశము కలుగదు. స్త్రీలు, ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు చేయునపుడు వారు విడుచు బొగ్గుపులుసుగాలి, నాశికాగ్రమందుండు బులాకివలన నడ్డపఱుపఁబడి, పెక్కు చీలికలు కలదగును. అందువలన, మగఁడు భార్యాభిముఖుఁడై సమీపముగానున్నపుడు, ఆకడిదుర్వాయువు నెంతమాత్రము నాఘ్రాణించుట కవకాశముండదు. మరియు నీయాభరణమందు మంచిముత్యమున్నయెడల, చిల్లగింజ మురికినీటిని దేర్చునట్లు, అది దుష్టవాయువు నెప్పటికప్పుడు పరిశుభ్రముచేయునని ఆయుర్వేదశిఖామణులు విశదపఱచుచున్నారు. ఈ రెండు కారణములవలనను, భార్యాభర్తలిద్దఱును, అభిముఖులై సమీపముగానున్న సమయములందు వారు విడుచుదుర్వాయువును వారు మరల పీల్చుట కవకాశము కలుగనేరదు. ఈ ఆభరణము యొక్క ప్రభావముచే, రాత్రికాలములందు స్వచ్ఛమైన ప్రాణవాయువు నాఘ్రాణించుచు నారోగ్యవంతులై దీర్ఘాయువునొందుదురు. ఇంతియగాక, హిందూనారీమణులు తయారుచేయు భోజనపదార్థములందును, వారొసగు మంచితీర్థములందును నీయలంకారధారణముచే దుర్వాయువు ప్రవేశించనందున నవి ఆరోగ్యకరములై వఱలు. శ్రోత్రియశిఖామణులు, తమస్వహస్తపాకములకంటె సువాసినుల వంటకముల నత్యంతపవిత్రముగా నెంచుచు, వానిని సేవించుచు, పూర్వసువాసినులయొక్కయు, పాచకులయొక్కయు వంటకములను భుజింపకుండుటకు నిదియొక కారణముగా నూహింపవచ్చును. ఈరీతిగా హిందూకాంతలు బులాకి ధరింతురేని దంపతులు, దీర్ఘాయువుతోఁ దులతూగుదురు.

సౌందర్యవిరహిత లగుకాంతలు, ఈఆభరణము నుపయోగించినచో వారలావణ్యముతో మెఱయుచు నుత్సాహవతులై, దీర్ఘాయువు నొందుదురు. సువర్ణ, వైక్రాంతాది మణులతోఁ బ్రకాశించుచు నీయాభరణము హిందూవనితామణియొక్క నాశికాగ్రము నలంకరించుటచే నామెమోము మత్యంత తేజోవిరాజమానమై, చంద్రబింబమువలె బ్రకాశించుచు గన్నులకపండువుగా నుండును. హిందూ నారీరత్నముయొక్క శరీరచ్ఛాయ యెట్టిదైనను, కాంతామణి సహజ మగు సౌందర్యవిశేషముతోఁ దులతూగకున్నను, ఈఅలంకారమును ధరించినతోడనే నామె మోమున కత్యంతశృంగారము కలిగి, యెట్టికొఱత యును గన్పట్ట నేరదు. సౌందర్యవిహీన లగు కాంతలు, ఈఆభరణమును ధరించుటతోడనే వారి కమితలావణ్యవతులను సహితము మించి యుండునంతటి కళ కలుగును. స్త్రీరత్నముయొక్క ముఖమండలము గంధర్వాదిసుందరాంగల సొగసుతో నత్యంతవైభవముతోఁ దేజరిల్లు. అప్పుడు ఆమె భర్తకు నట్టివనితారత్నమందు విశేషానురాగము కలుగును. కుటుంబమునం దాదంపతులకు మనస్సు భేదింపకుండుటవలన వారు నిరంతర సంతోషవంతులై, అన్యోన్యానురాగములతోఁ బ్రకాశింతురు. అనుకూలదాంపత్యము వారికిఁ గుదురును. ఇది ఉత్సాహము నిచ్చును. వైరమున కెడమీయదు. సుసంతానమును బ్రసాదించును. దీర్ఘాయువును సమకూర్చును. మఱియు, హిందూగృహములందు, స్త్రీ సౌందర్యముతో గన్పించుటవలన నెల్లరు నామెను బ్రేమతోఁ జూతురు. ఇందువలన నామె యుత్సాహముతో గూడియుండి దీర్ఘాయువు నొందును. భార్య సౌందర్యముతో గూడియుండుటవలన యోగ్యుడైన భర్తకుఁ బరస్త్రీవాంఛ గలుగనేరదు ; అందువలన నాతడు శరీరారోగ్యమును జెఱచు అంటుజాడ్యములకు మూలమైన జారత్వమును జయించి దీర్ఘాయువుతో దీపించుచుండు. సౌందర్యవిహీనలగు హిందూ



నారులు, ఈనాశికాభరణమును ధరించినచో, వారి కీవిధముగా దీర్ఘాయు రైశ్వర్యంబులు చేకూరును.

సౌందర్యముతోఁ బ్రకాశించు హిందూతరుణీమణు లీయాభరణమును ధరించుటవలన వారిసౌందర్యము వృద్ధినొందుటయేగాక, వారి దీర్ఘాయువు రక్షింపఁబడును. సహజమగు సౌందర్యాతిశయములతో దీపించుచుండు సువాసినులకు నాభరణములు కళాకాంతుల నినుమడి గావించును. సౌందర్యముతో గూడియుండు కోమలాంగులు, ఆభరణములను ధరింపనిసమయములందు నితరులచే వీక్షింపబడినయెడల, వారి శరీరములోనికి దుష్టశక్తులు ప్రవేశించి, ఆరోగ్యమును జెఱచును. మంచిముత్యము శరీరములకు సోకు దుష్టశక్తులను నాశనముచేయు సమర్థతతో నతిశయించియున్నదని ఆయుర్వేదశిఖామణులు తెల్పుదురు మంచిముత్యముతోగూడిన నీఆభరణమును ధరించు పుణ్యలలామలకు సోకు దుష్టశక్తులు నిర్మూలమై, ఆరోగ్యము రక్షింపబడును. కావున సౌందర్యవతులగు హిందూపూఁబోండ్లు ఈవిధముగా నీ అలంకారమును ధరించుటచే దీర్ఘాయువును రక్షించుకొనగలరు.

ఈనాశికాలంకారమును ధరించుట హిందూసువాసినీ లక్షణమగుటచే, కోమలాంగులు బులాకిని ధరించి, సదాచార, సద్వర్తనములు కలవారై గౌరవింపఁబడుచు దీర్ఘాయువు నొందుదురు. ఈదివ్యాలంకారము జగజ్జననులగు పార్వతి, జానకి, రుక్మిణి మొదలగువారు ధరించిరి. వారి విగ్రహము లున్నచోట్లయందెల్లవారీ నలంకారముతో గన్పింతురు. దీనిని ధరించినస్త్రీలు, దేవతాస్వరూపములను జ్ఞప్తికిఁ దెత్తురు. వారియెడల గౌరవము తదితరులకుఁ బుట్టును. అందువలన వారుత్సాహవతులై, వశీకరణశక్తితో మెఱయుచుందురు. వారికి సదాచార, సద్వర్తనము లలవడును. కపటము, కార్కశ్యము, పరదూషణ మొదలగు కలుషములు వారి మనస్సులనుండి తొలగును. వారి పుత్రికలును,

భర్తలును సదాచారసంపన్నులై, దేవభక్తితోఁ దులతూగుదురు. ఈ రీతిగా బులాకిని ధరించు హిందూయువతులు దేవతాస్వరూపములను, పతివ్రతలను స్ఫురణకుఁ దెచ్చుచు, దీర్ఘాయురైశ్వర్యముల ననుభవింతురు.

మంచిముత్యముతోఁ గూడియుండు ఈనాశికాభరణమును ధరించుటవలన హిందూవనితారత్నములకు దీర్ఘాయురైశ్వర్యంబులు హస్తగతములై యుండును. మంచిముత్యము నవరత్నములలో నొకటియై యున్నది. నవరత్నములు నవగ్రహములకును ప్రీతికరమనియు, ఏ గ్రహబలము తక్కువగా నుండునో, ఆ కాలమందా గ్రహమునకుఁ బ్రీతికరమైన రత్నమును ధరించువారికి, ఆ గ్రహమువలన గల్గుదోషములు హరించి, ఆయుర్భాగ్యములు లభించు ననియు, జ్యోతిష, వైద్యశాస్త్రములు వివరించుచున్నవి. ఇందువలననే మహారాజులును, చక్రవర్తులును, శ్రీమంతులును, మంచిముత్యములు మున్నగు నవరత్నములతో గూడిన హారములను ధరించుచు నైశ్వర్యమనుభవించుచు, సకల సంపదలతో వర్ధిల్లుచుండురు. హిందూగృహస్థుల కెల్లరకును, ఇట్టి హారములు ధరించుట ధనవ్యయముతోఁ గూడిన నసాధ్యమైన కార్యమగుటచేఁ బ్రాచీనకాలబుుషిపుంగవులు మంచిముత్యముయొక్క ప్రభావము ననుభవింపఁజేయుటకై వనితల కీయాభరణమును నియమించిరి. ఈ ముత్యముయొక్క మహిమచే అకాలమృత్యువు తొలగును. అందువలన స్త్రీలకు గర్భశోకము, గర్భపాతము మొదలగు నేకకారణములు వాటిల్లవు. గృహమునకు జయమును, అభివృద్ధియు గలుగును. భర్త పూనుకొను కార్యదీక్ష విజయముతోఁ దుదముట్టును. మంచిముత్యములతోఁ గూడిన నీఆభరణమును దీక్షతో ధరించు పుణ్యాలలామ దర్శనార్హురాలు. సాష్టాంగనమస్కారమును గైకొనుట కర్హురాలు. ఈమె నిరంతరోత్సాహవతియై, అనసూయ, పార్వతులతోఁ దుల్యరాలై విలసిల్లుచుండు. మంచిముత్యము గలబులాకిని ధరించుటవలన



హిందూకాంతలు గృహమున కీరీతిగా సర్వసంపదలను, ఆహ్వానించి దీర్ఘాయువు నొందుదురు.

ఇట్టి ప్రభావముతో నొప్పారు ఈదివ్యాభరణముతో నలంకృతులుకాని హిందూవనిత లొనరించు దానధర్మములు నిష్ఫలము లగునని స్పష్టపడుచున్నది. ఈఆభరణము చిరకాలమునుండియు హిందూసువాసినులకు ప్రధానమై యున్నది. జగన్మాత లగుపార్వతి, రుక్మిణి, జానకి మొదలగు దేవతాస్వరూపములును, ప్రతివ్రత లగు ద్రౌపది, సావిత్రి, అనసూయ మొదలగువారును నీయాభరణమును ధరించి యుండిరి. హిందువుల పురాణములందును, నీతిశాస్త్రమునందును, అనేక ఉద్గ్రంథములందును, ఈఆభరణము సువాసినీధర్మములను వర్ణించు సందర్భమున బేర్కొనబడియున్నది. "స్మృతికౌముది" అను ధర్మశాస్త్రము ఈఆభరణమునుగూర్చి విపులముగా జర్చించియున్నది. సువాసిని లక్షణమును వర్ణించునపుడు కాశీఖండమందును, అనేకసత్కవుల గ్రంథరాజములందును, ఈఆభరణము ధరించుట ముఖ్యమని తెలుపబడియున్నది. క్రూరరాక్షసి యగుశూర్పణఖకు నీ అలంకారమును ధరించు యోగ్యత లేకుండునట్లు శ్రీరాముఁడు దాని నాశికను గత్తిరింపించె. శ్రీకృష్ణునికి, మదనబాణపీడితురాలై యొడలెఱుంగని సత్యభామ, రాయబారమంపునపుడు తన చెలికత్తెకుఁ దనవడువారముల యాభరణములను నొసఁగి, అడ్డబాస దీర్ఘాయువునిచ్చు ప్రధానాలంకారమని దాని నర్పింపలేదని "వీధిభాగవతము" సహితము బోధించుటలేదే. కన్యాదానఫలితము నొందుటకై హిందువులు, ఆభరణాలంకృత యగుకన్యకను వరుని కర్పింపవలె నని నిర్ణయసింధు, విజ్ఞానేశ్వరీయము మొదలగు ధర్మశాస్త్రములు వివరించుచున్నవి. ఈవిషయములన్నియు హిందూవనితలు బులాకిని ధరించుట విధి యని తెల్పుచున్నవి. పవిత్రతతో గూడినకార్యము లొనరించునపుడు హిందూ

వనితలు ఈఆభరణమును ధరించవలెనను, వారికి దత్ఫలితము లభింపనేరదు. వివాహసమయమునందు వరుని కెన్నికట్నము లొసంగి వియ్యపురాండ్ర కెన్ని మొహరీలను గానుకలుగా నిచ్చినను, బంధుమిత్రుల నెట్టి మృష్టాన్నముతో సంతుష్టిపఱచినను, శాలువలు, సంభావనలు, నూతనవస్త్రములు, మొదలగువానితోఁ బండితోత్తముల నెంతవైభవముగా సత్కరించినను, వేలకొలది రూప్యములతో భోగముమేళములను బిలిపించి దశదిశలును బ్రాఁకునంతటికీర్తితోఁ బరిణయము గావించినను, ఈమాంగల్యాభరణముతోఁ గూడియుండని కన్యకను దానము చేయుటవలన దత్ఫలమే శూన్యమగును. కావున, హిందూగృహస్థులు తమ కుమార్తెల వివాహసమయములం దీదివ్యాభరణమును వారిచే ధరింపఁ జేయుటయే గాక, కన్యాదానమహోత్సవమందు బాల్గొను ఆకన్యకయొక్క జననిచే గూడ ఈఆభరణమును ధరింపఁ జేతురుగాక.

ప్రస్తుతకాలమందు నవనాగరకతాదోషముచే హిందూసువాసినులు (మంచిముత్యముతో గూడిన) ఈఆభరణముయొక్క ప్రభావమును గుర్తెఱుంగజాలక దీర్ఘాయురైశ్వర్యంబులను నష్టపోవుచుండుట కడుశోచనీయము. వీరు కళావిహీనలై, అమంగళకరములగు ఫాలములతో గనుపట్టుచు నెంతసౌందర్యవతులైనను, సుగంధరాహిత్యమైన పుష్పముతీరున, తమకేదోగొప్పలోపమున్నదని తెలుపుచున్నట్లు గోచరించుచున్నారు. సువాసినులయ్యును, అశుభకరమై, అశ్రేయస్కరమై, వనితామణులకు భరింపనసహ్యమైన పూర్వసువాసినీత్వమును సూచించుచున్నారు; శాంతభావముతో గూడియున్నను వీరు మర్యాదావినయములను సూచింపజాలక భయభక్తులు, సద్వర్తనమును లేనట్టితుంటరి వనితలను బోలియున్నారు; వర్ణాశ్రమధర్మాభిమానశూన్యులైయున్నారు; దుష్టవర్తనము, క్రౌర్యము మొదలగు దుర్గుణములకు లొంగుచున్నారు; కుటుంబముల కశ్రేయస్సు దెచ్చుచున్నారు. వీరి, అశాస్త్రీ



యమైన వర్తనములచే హిందువుల సంసారములు ఋణబాధలచేఁ గ్రుంగిపోవుచున్నది; బ్రాహ్మణమాన్యములు నాశనమైపోవుచున్నవి; గృహకలహములు ద్విజులయం దభివృద్ధినొందుచున్నవి. ఆధునికకాలపు హిందూనారీరత్నము లెన్నిసొగసైనవస్త్రములను ధరించుచున్నను, యథావిధిగా వ్రతములను, పూజలను, దానధర్మములను జేయుచున్నను, అమూల్యాభరణములను ధరించుచున్నను, అఖండమాహాత్మ్యముతో గూడిన ఈఆభరణము నుపయోగింపమిచే గర్భశోక, గర్భపాతము లనుభవించుచు, అకాలపతివియోగము నొందుచు, శరీరారోగ్యము లేనివారై, తమ ధనసంపదలెల్ల నీటిబుగ్గలవంటివని స్పష్టపఱచుచున్నారు. ఇట్టిసువాసినులు కళావిహీనలైయుండి, దారిద్ర్య మనుభవించుచుండుటచే వీరువర్ణకవందనాదుల కనర్హులని ధర్మశాస్త్రకోవిదులై, అనుదినమును శ్రోత్రియులచే స్మరింపబడుచుండు శ్రీముత్తిపర్తి పెదపూర్ణయ్యసిద్ధాంతిగారు ఎఱింగించుచున్నారు. అడ్డబాసధరించు పూబోఁడియు, ఆముదపుదీపము వెలుఁగు హిందూగృహమును, ఐశ్వర్యమనుభవించునని ఆర్యులువచింతురు. ఆధునిక హిందూకాంతలీ ఆభరణమును ధరించుచు సకలైశ్వర్యముల నొందుదురుగాక.

## 26 కంఠాభరణములు.

హిందూస్త్రీజాతులు ధరించు కంఠాభరణములలో బ్రధానమైనవి పగడములయు, మంచిముత్యములయు హారములై యున్నవి. ఇవిదీర్ఘాయురైశ్వర్యములకు మూలములై తేజరిల్లుచున్నవి.

ఈహారద్వయము దేహారోగ్యము, ఉత్సాహము మొదలగువానిని గల్గించి, దీర్ఘాయువునొసఁగును. పగడములును, మంచిముత్యములును మానవశరీరమందుఁ బుట్టురోగములను దఱుమునని ఆయుర్వేదము వివరించుచున్నది. మంచిముత్యములయొక్కయు, పగడములయొక్కయు, చూర్ణము మహౌషధములందుపయోగింపఁబడుచున్నది.

ఈహారములను ధరించుపూబోండ్ల శరీరమందలి రోగములు అణగును. ఈహారములు సౌందర్యవతుల శరీరములకు సోకుదుష్టశక్తులను నాశనముచేయుచు, ఆరోగ్యమును రక్షించును. నారీమణులకళాకాంతుల నభివృద్ధిచేసి వారిదేహములను ప్రకాశవంతములుగా శోభిల్లఁజేయును. ఇట్టివారు పతులను రంజింపఁగల్గి, అనుకూలదాంపత్యఫలము నొందుచు దీర్ఘాయువును బడయుదురు.

పగడములయొక్కయు మంచిముత్యములయొక్కయు, హారములను ధరించువనితల కైశ్వర్యముప్రాప్తించును. ఇవినవరత్నములలో జేరినవైయున్నవి. గ్రహబలము లేనిలోటు, వీనిని ధరించువారిని బాధింపనేరదు. కావున వీనిహారములను కంఠమునకలంకారములుగా నుంచుకొను కామినీరత్నములు సకలైశ్వర్యంబుల నొంది, సర్వశ్రేయస్సుతో వర్ధిల్లుదురు. ఇట్టిదివ్యాంగనలతోఁ గూడియున్న గృహమందుఁ బాడిపంటలభివృద్ధియైయుండి, సకలకార్యములును విజయమునొందును. గృహస్థులెల్లరును దీర్ఘాయువు నొందుదురు.

నాగరకతాదోషముచే నీకాలమున హిందూసుదతులీదివ్యాభరణములను మోటుఅని ఎంచి, వానిని ధరింపకున్నందున వారికి గర్భశోక, గర్భపాతములును, అల్పాయువును దటస్థమగుచున్నవి. బ్రాహ్మణుల మాన్యములు నశించుచున్నవి. కమ్మవారును, రెడ్లును, ఈనవరత్నహారముల నుపయోగించుచుండుటచే వారిగృహములు సకలైశ్వర్యములకును నిలయములై తేజరిల్లుచున్నవి.

## 27 ఒడ్డాణము

వనితలీయాభరణమును దమనడుమున కలంకరింతురు. ఇది బంగారుతోఁ దయారుచేయఁబడును. కొందఱు వెండి రేకుతో గూడ చేయబడిన దానిని ధరింతురు.

స్త్రీల నడుము నలంకరించియుండు నీయాభరణము వారిసౌందర్యమును వృద్ధినొందించి, ఉత్సాహమును నొసఁగి దీర్ఘాయువును బ్రసాదించు



ను. బంగారు రేకుతోగాని, వెండిరేకుతోగాని గూడియున్న ఈఆభరణము, స్త్రీలు ధరించిన వస్త్రమునకు వన్నెనిచ్చును. సౌందర్యవిహీనలుకూడ, దీని ధరించి, తమపతులకు దమపై అనురాగమును బుట్టింపగలరు. అందువలన, అనుకూలదాంపత్యము లభించును. చిరకాలమునుండియు నీఆభరణమును హిందూజనులును, దేవతాస్వరూపములును పతివ్రతలును ధరించుచుండుటచే, ఒడ్డాణముధరించు స్త్రీలు, దేవ, మాతృభక్తులను బుట్టించి గౌరవమునొందుచు, సర్వకార్యములందును విజయమునొందుదురు; ఉత్సాహముకలుగును; దీర్ఘాయువుకరస్థమగును.

ఒడ్డాణమును ధరించు సువాసినులారోగ్యవతులై దీర్ఘాయువు నొందుదురు. బంగారు రేకుతోఁ గూర్చినదై ఈఆభరణము కోమలుల నడుమును సన్నముగానుంచును; ఉదరపొట్టపెరగనీయదు. వనితలకు నడుము సన్నముగానుండుటయే లక్షణమని మహాంకితశేఖరు లనేక సందర్భములలో వర్ణించుట వాడుక. సాముద్రికశాస్త్రముకూడ, సన్ననినడుముతో నుండుటచే స్త్రీలు అనుకూలదాంపత్యముతో మెఱయుచు, ఉత్సాహవతులై దీర్ఘాయువు నొందగలరని వివరించుచున్నది. ఈఆభరణమును దీక్షతో నుపయోగించు కోమలాంగులు సన్ననిబింకముగల నడుముతోఁ బ్రకాశించుచు, నడకయన లత్యము లేకుండును. దార్ఢ్యముదయించును. ఘనమైనకార్యములను శ్రమనొందకయే నెరవేర్పగలరు. సుకుమారము, సోమరితనము మొదలగు దరిద్రహేతువులు దరికిఁ జేరవు. గర్భిణులైయున్న కాలమందు నీఆభరణము దీసివేసినను, అంతకుఁబూర్వమునుండియు దీనిని ధరించువారికి గర్భభారము కలుగనేరదు. సుఖప్రసవము కల్గును. ఉక్కుముక్కల వంటి బలముగల సుసంతతి నట్టితరుణీమణులు బడయుదురు. ప్రసవించినపిమ్మట ఉదరరోగములు కలుగక స్త్రీల కమితారోగ్యమేర్పడి, దీర్ఘాయువు కలుగునని, వైద్యశాస్త్రజ్ఞులు తెలుపుదురు. పురుషునికి "మంజీ" (37 వ పేజిచూడుము) ఎట్టిదో, స్త్రీలకు నొడ్డాణమట్టిదై యున్నది.

ఈఆభరణమును ధరించుట ఐశ్వర్యకరమై యున్నది. సువాసినులీ దివ్యాభరణమును ధరింపనేని, వారు గార్ధభ తుల్యులగుదురని ధర్మశాస్త్రవేత్తలు తెల్పుదురు. పూజాంశ్లోనరించు పూజలును, వ్రతములును, పుణ్యకార్యములును, వారు పాల్గొను శుభకార్యములును, ఈఆభరణమును వారు ధరింపనిచో, నిష్ఫలము లగును. కావున కన్యాదానముచేయు జనని ఈఆభరణమును ధరింపవలెను. సమస్త పుణ్యకార్య,సమయములందును నామె ఈఆభరణముతో గూడియుండవలెనని శాస్త్రజ్ఞు లెంచి గించుచున్నారు. ఈకాలమందు పాశ్చాత్య నాగరికతావ్యాప్తిచే నీదివ్యాభరణమును గొంద ఱచ్చటచ్చట మూలపడవేయుచు, దరిద్రహేతువు లైన ,,గిల్టు" పొదివిన పటకాలను, చర్మపుపటకాలను, ధరించుచున్నారు. లోహరాజమైన బంగారునకు మారుగా వీనిని వాడుట దారిద్ర్యహేతువు. బంగారు శరీరమునకు జక్కని చాయనిచ్చి లావణ్యమును వృద్ధిచేయు నని 90 వ పేజీలో వివరించి యుంటిమి. అట్టిలోహము లభింపనివారు వెండిలోహపు ఒడ్డాణమైన నుపయోగింపవలెను గాని పటకా (బెల్టు) లను ధరించుట దరిద్రహేతువు. అనారోగ్యకరము. హిందూసుందరాంగులు ఈహేమ భూషణము నుపయోగించి, ఐశ్వర్యవతులై దీర్ఘాయువు నొందుదురు.

—( 28. అందెలు )—

హైందవపడతులు చిరకాలమునుండియు, అందెలను ధరించుట వాడుక. సువాసినుల కివి ధరించుట లక్షణమని అనేక గ్రంథరాజములును, పురాణములును విశదీకరించుచున్నవి. దేవతాస్వరూపులు వీనిని ధరించి హిందువులకు బ్రత్యక్షమైనట్లు పురాణేతిహాసములు వ్యక్తపఱచుచున్నవి. 42 వ పుటలో వివరింపబడిన ఇతిహాసమందు గాయత్రి జనని ఘల్లుఘల్లు మను అందెల ధ్వనితో బ్రత్యక్షమయ్యె నని ధర్మశాస్త్రజ్ఞులు తెల్పుదురు. ఈఆభరణములు లక్ష్మీదేవికి బ్రీతికరములై



యొప్పారు. వీనిని ధరించుచుండు కోమలాంగులు సువాసినీత్వమును సూచింపగలరు; వారున్న గృహమునందు శిరిసంపద లభివృద్ధి నొందు; కుటుంబమునం దెల్లరకును దీర్ఘాయువు లభించును.

నాగరికతాదోషముచే నగ్రజాతిహైందవ స్త్రీలు ఈయాభరణములను ధరింపక, దుఃఖాక్రాంతు లగుచుండుట ప్రత్యేక విషయము. వారు గౌరవ, వినయములను బోధింపజాలరు. అట్టివారుండుగృహము నుండి సకలైశ్వర్యములును గ్రమముగా దొలగుచున్నవి. అపజయమును, ఋణబాధలు మొదలగు అరిష్టములు గృహస్థులను పీడించుచున్నవి. అమంగళకరమైన పూర్వసువాసినీత్వమును సూచించు, అట్టి అంగనల వంశములందు నల్పాయువు లోతుగా నాటుకొనుచున్నది.

—( 29. మట్టెలు )—

ప్రాచీనకాలమునుండియు హిందూసుదతులు కాలివ్రేళ్ళకు మట్టెలను ధరించుట ఆచారము. మహాకవు లనేకులు సువాసినుల వర్ణనలందు వీనిని బేర్కొని యుండిరి. భోజరాజీయమున ద్వితీయాశ్వాసమునందు నిట్లు వివరింపబడి యున్నది :—

,,అందెలున్, మట్టెలు దిట్టమై చెలఁగ
మందగతిన్ జని యవ్వనంబునన్."

అందెలవలనే మట్టెలును, ఐశ్వర్యదాయకము లగుఆభరణములై,సువాసినులకు బ్రధానములై యున్నవి. దేవతాస్వరూపులు వీనిని ధరించి యున్నట్లు నిదర్శనములు లున్నందున, కామినీరత్నములు వీనిని ధరించి వశీకరణశక్తితో (34 వ పేజీ చూడుడు) దేజరిల్లుచు, దీర్ఘాయువు నొందుదురు.

శుభకరములై, లక్ష్మీదేవికి గరంబు ప్రీతికరములై, సువాసినీ ధర్మమును సూచించుచు,ఐశ్వర్యమును బ్రసాదించునవైననీమట్టెలు స్త్రీలకు ఆరోగ్యమును రక్షించి, దీర్ఘాయువు నిచ్చుచున్నవి. ఈఆభరణ

ములను గాంతలు తమకాలి బొటనవ్రేలి ప్రక్కనుండు వ్రేళ్ళకు ధరింతురు. ఇందువలన, వారి మర్మస్థలములందలి నరములు సరియైన స్థానములందు జేరియుండు నని వ్యాయామశాస్త్రజ్ఞులు వివరించుచున్నారు. వరిబీజపు నొప్పులతో బాధపడువారు కాలి బొటనవ్రేలునకు రాగి చుట్టును ధరించుటవలనవా రానొప్పులను జయింపగల రనువిషయము మట్టెలు స్త్రీల కొనరించు ననెడి దివ్యఫలితమును ధృవపఱచుచున్నది. కావున మట్టెలను ధరించుటచే కాంతల మర్మప్రదేశములందుండు నరములు సరియైన స్థలముల నాక్రమించి యుండి, వారికి దేహారోగ్యమును రక్షించుచు, గర్భపాతము, కుసుమరోగము మొదలగువానిని గల్గింపక, దీర్ఘాయువు నిచ్చుచుండును. మట్టె లిట్టిప్రభావము కలవగుటచే వానిని వివాహసమయమందుఁ బ్రథమదినముననే పెండ్లికుమార్తెకుఁ బెట్టుట ప్రాచీనాచారము. ఆమెయొక్క నరము లప్పటినుండియుఁ గ్రమమైన స్థలముల నాక్రమింపఁ దొడగును. పూర్వకాలపు వనితలీయాభరణమును దీక్షతో ధరించుచు దీర్ఘాయువు నొందుచుండిరి. ఆధునిక హిందూసువాసినులు, ఈమట్టె లొనరించు మహాలాభ మెఱుంగజాలక, నవనాగరకతాదోషముచే వానిని ధరింపకున్నందున, వారు గర్భపాతాదిరోగములఁ జిక్కి, దీర్ఘాయుశ్శూన్యలగుచుఁ దమ పతులయుత్సాహమును జెఱచుచున్నారు.

## —( 30. పసుపు. )—

హిందూపడతులు ప్రాచీనకాలమునుండియుఁ బసుపును బూసికొనుట ఆచారమై యున్నది. పురుషులకు గోమయభస్మ మెట్టిదో, సువాసినుల కీపదార్థ మంతముఖ్యమైన అలంకారముగా నున్నది.

పసుపు సకలరోగములను జయించి, ఆరోగ్యమును బుట్టించు శక్తితో గూడియున్నందున దీని నుపయోగించు తొయ్యలులు దీర్ఘాయువు నొందుదురు. ఈపదార్థము అంటురోగపు అణువులను జంపు



నని వైద్యశాస్త్రము బోధించును. కావున మశూచి, ఆటలమ్మ మొదలగు అంటువ్యాధుల పుండ్లకును, గజ్జి, తామర మొదలగు చర్మరోగపు పుండ్లకును బసుపు దివ్యౌషధమై యున్నది. ఈపదార్థము శరీరము నీరీతిగా మృదువుగాఁ జేసి, కాంతి నిచ్చి, ఉత్సాహమును బుట్టించును. స్త్రీయొక్క సౌందర్యము వృద్ధినొందును. ఆమె గౌరవమును గల్గించును. పతియు, ఆమెయు ననుకూలదాంపత్య మనుభవించుచు, దీర్ఘాయువుతో నలరారుదురు.

ఈపదార్థము శుచిత్వమునకుఁ బ్రధానమై, ఐశ్వర్యకరమై యున్నది. మైలప్రదేశముపై పసుపునీళ్లు చల్లినతోడనే అది శుభమగు నని యెంచబడుచున్నది. సకలశుభకార్యములందును బసుపు విఘ్నేశ్వరుని బూజించుట హైందవాచారము. వేదోక్తాశీర్వచనసమయమం దుపయోగింపబడునవి, పసుపుతోఁగలుపఁబడిన అక్షతలు. నూతన వస్త్రములనలంకరించునది, ఈదివ్యపదార్థము. సువాసినులకు హిందువు లెల్లకాలములందును నొసఁగుపదార్థములలో ముఖ్యమైయున్నది, పసుపు. ఈశుభకరమైన వస్తువు లక్ష్మీదేవికిఁ గరంబు ప్రీతికరమై యొప్పారుటచే, దీనినిధరించువనితలు ఐశ్వర్యముతో వెలుఁగుదురు.

ఇట్టిప్రభావముతో గూడిన ఈపదార్థమును, ఆధునికకాలపు నారు లనుదినమును స్నానసమయములం దుపయోగించుట విధియై యుండ, వీరు నాగరకతాదోషముచే దేహము బీటలు తీయఁజేయు సబ్బుబిళ్లలనుపయోగించి, అనారోగ్యవతులై దారిద్ర్యమనుభవించుచున్నారు.

## —( 31 కాటుక. )—

సువాసినులు, తమ కనురెప్పలను గాటుకతో నలంకరించుట ప్రాచీనాచారమై యున్నది. ఇది దీర్ఘాయురైశ్వర్యములకు మూలసాధనము.

పూర్వోక్తము, కాటుకను ధరించినయెడల వారి నేత్రములు నిర్మలముగా నుండుటచే, వారుత్సాహవంతులై, ఆయుర్వృద్ధికలవారగుదురు ఈకాటుక ఆముదపుమసితో, రాగిపళ్లెముమీద తయారగుటచేనిందు బురుగును జంపుగుణము కలదు. నేత్రములందు సకలవిషములును నిర్మూలమై, దుర్మాంసాది రోగములు తొలగును. కాటుకయందుఁ బచ్చకర్పూర ముండుటవలన నిది నేత్రములకుఁ జలువజేసి, ఉష్ణదేశీయులైన భరతవర్షస్త్రీలకు నఖండశైత్యోపచారమై, ఉత్సాహముఁ నిచ్చుచుండును. ఈగుణములతో నలరారుటచేఁ గాటుక దృష్టిబలమిచ్చి అకాలపుచత్వారమును దఱుమును. పసిపిల్లలకు హిందూజనని తామ్రిబరిణెయం దుంచబడిన నీకాటుకను నేత్రములకు బెట్టుటవలన వారి దృష్టిబల మధికమై యుండి చత్వార మంకురింప నేరదు. ఈ ప్రశస్తమైన యలంకారము కోమలాంగుల కొలికెలను శుభ్రపఱచి, వానికి రమ్యమైన నలుపురంగు నిచ్చి, ఈ అంగనయనములవలెఁ బ్రకాశింపఁ జేయుచు, వారివల్లభులకు వారిపై ననురాగమును బుట్టించి, అనుకూలదాంపత్యమును సమకూర్చి, సుసంతానమును బ్రసాదించును.

ఈకాటుకను ధరించుట సువాసినీధర్మమై యున్నందున, ఇంతులీయలంకారము నుపయోగించి, సకలైశ్వర్యములను బడయగలరు. వారి జాతు లీయలంకారముతోఁగూడి యుండి, లక్ష్మీదేవి నాహ్వానింతురు వారి గృహములు సర్వసుఖములతోఁ గలకలలాడు చుండును. ఆధునిక హైందవస్త్రీ లనేకులు, పాశ్చాత్యనాగరకతా దోషముచే నీయలంకారము నుపయోగింపక నేత్రరోగములఁ జిక్కి, వైద్యశాలలకు జనుచు, చెడువర్తనములు కలవారై జారత్వముచే జఱుంపఁబడుచు, ఉత్సాహవిహీనలై, దారిద్ర్య మనుభవించుచున్నారు.



## — 32. జుట్టు. —

శిరోజములు హిందూదంపతులకు సామాన్యాలంకారమై యున్నది. స్త్రీలు శిరోభాగమున బూర్ణముగా జుట్టు నుంచుకొనుటయు, పురుషులు శిరస్సుయొక్క వెనుకభాగమునందు గోష్పాదమంతయైనను జుట్టు నుంచుకొనుటయు, హిందూమతాచారమై యున్నది. సువాసినులకును, పురుషులకును, ఈరీతిగా శిరోజము లుండనియెడల వారి కెట్టి పుణ్యకర్మ లాచరించుటకైన నర్హత లేదని ధర్మము వివరించుచున్నది.

హిందూగృహస్థులును, యువకులును, శిరస్సుయొక్క వెనుకభాగమందే జుట్టు నుంచుకొనుచు, ముందుభాగమున నుండు కేశములను ఖండింపఁజేయుటవలన, దీర్ఘాయువు కల్గును. శిరస్సుయొక్క వెనుకభాగమందు జీవనాళ్ళన్నియు సంధించుటచే నిది బహు సున్నితమై యుండును. శయనించియున్నపుడును, శిరస్సును దేనికైనను జేర్చి విశ్రమించినపుడును, ఈశిరోభాగమును జాగరూకతతో రక్షించుట వలన నాయుర్వృద్ధికరము కావున పురుషులీభాగమందు శిరోజము లుంచుకొనుట విధియై యున్నది. వీరనుదినమును స్నానము లాచరించునపుడు, తైలముతో మర్దనాచేయుటకు వీలుగా నుండుటకై శిరస్సుయొక్క ముందుభాగమున నుండుశిరోజములను దీయించుకొనుట ముఖ్యమై యున్నది. సువాసినులనుదినమును శిరస్స్నాన మొనరించిన ఫలము కల్గుటకై వారు కంఠస్నాన మాచరించువేళలందు పసుపు నుపయోగించుట ప్రాచీనాచారమై యున్నది గాన వారు ఇంపుదెచ్చునంతటి శిరోజపుంజముతోఁ గూడియుండుట కర్తవ్యము.

నారీరత్నములు జుట్టునకనుదినమును తైలాదులుపయోగించి, ముడివేయుటవలన, ఉత్సాహముకలవారై దీర్ఘాయువునొందుదురు. వారందుచే నత్యంతసౌందర్యముతో విరాజిల్లుచు, స్వర్గలోకసుందరులనుస్ఫురణకుఁదెచ్చుచు, తమపతులను రంజింపఁగల్గి, అనుకూలదాంప

త్యముతో విలసిల్లుచుందురు. కొందఱుస్త్రీలు, లావణ్యముతో మెఱయుచున్నను, శిరోజములనీరీతిగా శృంగారించుకొనుచు, సౌందర్యముతో నొప్పారుచుందురు. వనితలచ్చటచ్చట, తలకెన్నడును జమురునుపయోగింపక, శిరోజములను దువ్వుకొనక, చెంపలనుండి "షికార్లు" చేయుచుండు వేలతో నసూయతనుబుట్టింతురు. ఇట్టివారిగృహములనుండి ఐశ్వర్యమొక్కత్రుటిలోఁ దొలగిపోవును.

స్త్రీ, పురుషు లిర్వురును జుట్టుముడి వేసికొనుటవలన దీర్ఘాయువు లభించు. శరీరములో ప్రవహించుచుండు మంచిశక్తులు కేశముల కొనలనుండి వ్యర్థమైపోయి, తేజోవిహీనతను దెచ్చుటచే నల్పాయువు వాటిల్లును గావున స్త్రీ పురుష లుభయులును జుట్టుచివర ముడివేయవలెను. ఈహేతువువలననే పూర్వసువాసినులను జ్ఞప్తికిదెచ్చుచుండు బోడితల (క్రాపింగు) లుగల హిందువులు ఈకాలమున నల్పాయుష్మంతులగుటకు మార్గమేర్పఱచుచున్నది. పురుషులు జుట్టుచివర ముడివేసికొననిచో నశుభమును సూచింతురు. ప్రేతకర్మనాచరించు పురుషులును దుఃఖాక్రాంతులైన స్త్రీలును తలవిరియబోసికొనియుందురు. వనితలు శిరోజములను ముడివేసికొననియెడల నపమృత్యువువాటిల్లును. తొల్లి కశ్యపప్రజాపతియొక్క ద్వితీయసతీమణియగు దితీదేవి, అఖండతపంబాచరించు గర్భముదాల్చియున్నసమయమున, జుట్టువిరియబోసికొని నిద్రించుచుండె. మహేంద్రుఁడీకారణముగనిపెట్టి, అమ్మహాదోషమునకుఁ బ్రతిక్రియగా నామెగర్భమందుఁ బ్రవేశించి దానినేడుచిలుకలుగావించె. స్త్రీ, పురుషులు, తలవిరియబోసికొనునపుడు, శిరోజములచివర బల్లి పడినయెడల, మరణము ప్రాప్తించును. ఈబల్లి కేశములచివరనుండు మహాశక్తుల నొకరెప్పపాటులో గ్రహించివేయుననియు నందువలన నల్పాయువు తటస్థించుననియు వైద్యశేఖరులు వివరింతురు. జుట్టుచివర ముడివేయుటవలన దీర్ఘాయురైశ్వర్యంబులు చేకూరును గాన స్త్రీ పురుషులిట్లాచరించి, ఈదివ్యఫలితము నొందవలెను.



జుట్టునుదీసివేసి క్రాపింగులతోఁ గూడియుండు హిందువులకు హైందవాచారమైన జుట్టుతో గూడియున్న ఈశ్వరాదిదేవతల ఆశీర్వచనము కలుగనందున వారొనరించు కర్మలు భగ్నమగును. వారి కార్యసిద్ధి వినాశమొందును వారిఆయుర్భాగ్యము లంతరించును. అపజయము వారిని దరుముచుండును. హిందూయువజనులు క్రాపింగులను విడనాడుటకర్తవ్యము. వారు శాస్త్రోక్తమైన జుట్టునుంచుకొనుటచే శ్రీవిష్ణువు, సాంబమూర్తి మున్నగువారివలె వారు గన్పించుచు, గౌరవమును బడయుచు, ఉత్సాహవంతులై దీర్ఘాయువు నొందుదురు. ద్విజులీరీతిగా వర్తించుచో, బ్రహ్మద్వేషమంతరించును. అబ్రాహ్మణోద్యమము, బ్రాహ్మణులకు సదాచారమగు నీవిధమైనజుట్టుకు భంగపరేని వారుగౌరవము నొందజాలరని బోధించుచు, హిందూసాంప్రదాయమును బ్రోత్సహించుచున్నది.

## —♦ 33 తిలకము ♦—

ప్రాచీనకాలమునుండియు, హిందూసువాసినులకును, గృహస్థులగు పురుషులకును, యువకులకును, ముఖమండలమున దిలకము ధరించుట ఆచారమైయున్నది. ఇది పవిత్రతకు మూలము. శుభకరమైన కార్యములొనరించుటకుఁ బ్రధానము. అనుదినమును హిందువులకు శుచిత్వమును బోధించుచుండు దివ్యమైన అలంకారము.

హిందూస్త్రీ పురుషుల కీతిలకము రక్తమును శుభ్రపఱచి, ఆరోగ్యము నర్పించి, దీర్ఘాయువును సమకూర్చును. హిందూధర్మమునందు కస్తూరి, చందనము, కుంకుమ, సిరిచూర్ణము, మంచిగంధము మొదలగు సుగంధద్రవ్యములతో స్త్రీ, పురుషులు తిలకమును ధరింపవలెనని విధింపఁబడి యున్నది. ఈవస్తువు లన్నియు మానవశరీరమునకుఁ దగిలినతోడనే రక్తశుద్ధి చేయును. ఉత్సాహము నిచ్చును. ఆరోగ్యమును గల్గించును. వీనితోఁ గూడినతిలకమును దీక్షతో ధరిం

చువారి రక్తము నిర్మలమై యుండి, కుశాగ్రబుద్ధి కలుగును. సాత్విక గుణము, ధర్మము మొదలగు భూషణములు శరీరము నాశ్రయించి యుండును. ఇవన్నియు దీర్ఘాయుస్సుగంధముతో నలరారుచుండు ఉద్యానవనములు.

దీక్షతోఁ దిలకమును ధరించు హిందూస్త్రీ, పురుషులు దేవ, గురు, భక్తులను గల్గించి వశీకరణశక్తితోఁ గూడియుండి. ఉత్సాహవంతులై దీర్ఘాయువు నొందుదురు. పురుషులు నామము దాల్చి, శ్రీమహావిష్ణువును స్మరణకుఁ దెత్తురు. మంచిగంధయుతమైన బొట్టును ధరించి సాంబమూర్తివలె తేజరిల్లుదురు. స్త్రీలు, కస్తూరి, కుంకుమతిలకములను ధరించి, పార్వత్యనసూయలవలె నతిశయించి యుందురు. వారియెడల నితరులకు దేవ, గురు, మాతృభక్తు లుదయించును; అట్టివారు గౌరవము నొందుచు జనవశీకరణశక్తితో దీపింతురు. వారి కార్యదీక్ష విజయ మొందును. ఇందువలన వీరుత్సాహపూరితులై దీర్ఘాయువు నొందుదురు. ఆధునికభారతీయు లనేకులు ఈయలంకారమును ధరింపక, సర్వకార్యములందును నపజయముచే గెలువబడుచు నుత్సాహ విహీనులై, అల్పాయువునకుఁ జిక్కుచున్నారు,

ఈదివ్యాలంకారము వర్ణాశ్రమ ధర్మములం దభిమానము పుట్టించును. హైందవునికిని, తదితరులకును నీయలంకారమే భేదమును జూపుటచే దీనిని ధరించువారు, హిందూమతధర్మములం దభిమానులై, దీర్ఘకాలము వర్ధిల్లుదురు.

ఈయలంకారమును స్త్రీ, పురుషుల లావణ్యమును వృద్ధిపఱచుచు, దీర్ఘాయువు నొసంగును. సౌందర్యవిహీన లగు కాంతలు, దీనిని ధరించి, ప్రకాశమానమైన ఫాలములతో వెలుఁగుదురు. వారి పతుల నీరీతిగా రంజింపగల్గి, అనుకూలదాంపత్యముతో వర్ధిల్లుచు, సుసంతానమును బడయుదురు. పురుషులుకూడ ఈయలంకారమును ధరించి



తేజోవంతులై వెలయుచు, గౌరవమును బుట్టించుచు, కార్యసాఫల్యము నొందుదురు.

అనుదినమును దిలకమును ధరించు పుణ్యాత్ములు ఐశ్వర్య మనుభవింతురు. తిలకమున కుపయోగపడు చందనము సూర్యునికిఁ గరంబు ప్రీతికరము. ఈపదార్థమును బొట్టున కుపయోగించువారు తేజోవంతులై సూర్యగ్రహకటాక్షము కలవారై ఎట్టియిక్కట్టుల నైన దాట గలరు. తిలకము భూతములకు భీతికరము. వైద్యులీ హేతువుచే ముఖము నావరించు నంతటిబొట్టుతోఁ గూడియుండి దుష్టగ్రహములను దఱుముదురు. ఈతిలకమున కుపయోగింపఁబడు వస్తువులు దేవతలకుఁ బ్రీతికరమై యొప్పారు. దీక్షతో నీయలంకారముతోఁ గూడియుండు హిందువులు, దేవతల యాశీర్వచన మొంది, దీర్ఘాయురైశ్వర్యంబుల నవలీలగా సాధింతురు. స్త్రీలు, తిలకమును ధరించుచు, మహాలక్ష్మి ప్రసాదముచే గృహముయొక్క శ్రేయోభివృద్ధికి దోడ్పడుచుందురు.

పాశ్చాత్యనాగరకతా దోషముచే నీకాలపు బ్రాహ్మణులు, తిలకమును ధరింపక, శూన్యఫాలములతో గళాకాంతులు లేనివారై, బ్రహ్మద్వేషాభివృద్ధికి నెలవిచ్చుచు, దారిద్ర్యమునకు లొంగిపోయి తాము పాల్గొనిన కార్యములను భగ్నము గావించుచు, ఉత్సాహము చెఱచుకొని, అల్పాయువునకుఁ జిక్కుచున్నారు. ఆధునిక హిందువు లనేకులు ప్రేతకర్మ నాచరించు శూన్యఫాలములతోఁ గన్పట్టక, తిలకమును వారి మతాచారము ననుసరించి ధరించుచు, సర్వసంపదలతో బ్రకాశింతురు గాక.

పంచమ భాగము

సమాప్తము.

---

*

శ్రీ

శుభమస్తు

# హిందూధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

షష్ఠభాగము.

### హిందువుల సత్కాలక్షేపములు.

ఇలపై వర్ధిల్లు మానవులలో ధర్మగుణశీలురలో నగ్రగణ్యుఁడు హిందువుఁడు. ఈధర్మగుణము హిందూశబ్దమందే ఇమిడియున్నది. హిం "హింసా" అనియు, దూ "దూరుఁడు" అనియు, అందువలన హిందువుఁడు ధర్మగుణశీలుఁడనియు, వ్యక్తమగుచున్నది. ఈధర్మగుణము హిందువునియందు సర్వకాలములందును గానవచ్చుచు సద్భూతము లొనరించుచున్నది. తొల్లి క్రీ. పూ. 327 వత్సరమున జీలమ్ నదియొడ్డున గ్రీకుప్రభువర్యుఁడగునలగ్జాండరు హృదయమును జయించినది, హైందవుఁడైన పురుషోత్తమభూపాలుని ధర్మగుణము గాదె. ధర్మశీలు లగుహైందవు లెల్లపుడును శాశ్వతమైన మోక్షసుఖముల నపేక్షించుచు దమ తీరికసమయములందెల్ల తుపాకిఁ జేబూని వనముల కేగి, జీవహింస యొనరింప నొల్లక, పరమేశ్వరసాన్నిధ్య మపేక్షింతురు. ఈభాగమున హిందువు లొనరించు సత్కాలక్షేపములను గూర్చి వివరించుచు, అవి దీర్ఘాయురైశ్వర్యముల కెట్లు తోడ్పడునో చర్చింపఁబడియున్నవి.

### — 34. శుభ వార్తలు. —

ఈగ్రంథారంభము నుండియు, ఉత్సాహము దీర్ఘాయువు నొసంగు నని వివరింపఁబడుచున్నది. ఉత్సాహము నొందునపుడు శరీరమందలి



రక్తనాళము తెఱవఁబడియుండు ననియు నాస్థితిలో రక్తము చక్కని జవముతో నిరాటంకముగా బ్రవహించుచుండు ననియు, శరీర మందుచే తేజఃపూరితమై బల, లావణ్యములతోఁ బ్రకాశించు ననియు వ్యాయామశాస్త్రజ్ఞు లెఱింగించుచున్నారు. ఉత్సాహవంతులుగా నుండువారు బలహీను లయ్యును, దార్ఢ్యముతో దీపించుచు, ప్రకాశవంతమైన ఫాలములతో నలరారుదురు. నిరంతరోత్సాహము, ఆరోగ్యదాయకము; శోణితమును శుభ్రపఱచి, దానికి బల మొసఁగు మహౌషధము; దీర్ఘాయుఃపుణ్యక్షేత్రమునకు రాచబాట.

దీర్ఘాయువునకుఁ బ్రధానమైన ఉత్సాహము, శుభవార్తలు వినుచు, శుభకార్యము లొనరించుచు నందు పాల్గొనుచు, శుభకరమైన వస్తువులను రంగస్థలములను వీక్షించుచున్న యెడల సాధ్యమగును. శుభము నితరుల కెఱిగించుటవలన నుత్సాహము కల్గును. ధైర్యస్థైర్యములతో గూడిన విషయముల నాకర్ణించుటయు, మనోహరములైన మైదానములను, నదులను, సౌధములను వీక్షించుటయు, దయాధర్మసత్యశౌచాదు లాచరించుటయు నుత్సాహజనకములై యొప్పారు. విజయవార్తల నాకర్ణించుచుండు దీక్షాపరులు, దీర్ఘాయువునొందు పుణ్యాత్ములు.

ఈదీర్ఘాయువు అశుభవార్తల నెఱింగించుచు, వానినాకర్ణించుచు, అశుభకార్యము లొనరించి, అట్టిప్రదేశములను వీక్షించువారికి లభింపనేరదు. అశుభము, ఉత్సాహమునుహరించు పెనుభూతము. నిరుత్సాహవంతుల శరీరమందలి రక్తనాళములు ముకుళించుకొనియుండు ననియు, రక్తప్రవాహము క్రమముగాక్షీణించుననియు, దేహ మందువలన తేజోహీనతనొంది, దీర్ఘాయువునకుఁ బ్రధానమైయున్న ఆరోగ్యమును గోల్పోవుననియు వ్యాయామశాస్త్రజ్ఞులు బోధింతురు. అశుభవార్తా శ్రవణాజనితమైన తేజోవిహీనతను జయించుటకై, మృతాశౌచ

వార్తలు వినినతోడనే తేజోబలమొసఁగు స్నానముచేయుట ప్రాచీన హిందూఆచారముగానున్నది. అశుభమెల్లపుడును, శరీరారోగ్యనాశనమునకును, దుష్టసంతానమునకును, మూలము.

అశుభవార్తాశ్రవణము, వర్జనీయము. కొందఱాకస్మికముగ నశుభవార్తలువినుటవలన విషాదమునుభరింపజాలక, ప్రమాదము నొందుదురు. తొల్లి, హిందూదేశచరిత్రయందు వీరరసమునకు వన్నెకెక్కిన మహారాష్ట్రవీరుఁడొకఁడు రణమందు హతుఁడయ్యెనని ఆతని జనని, ఆకస్మికముగా వినుటచేఁ దక్షణంబ నామెయుఁ బ్రాణంబు విడచె. కావున, దిక్కులేనివారికిని, ఒంటరులకును, ధైర్యస్థైర్యవిహీనులకును, రోగులకును అశుభవార్తలఁ జెవిసోకనీయకుండుట కర్తవ్యము. ఈసూక్ష్మము, ఆయుర్వేదనిపుణునికి, దెలిసియుండుటచే నాతఁడెల్లపుడును, రోగులకుత్సాహకరములైన విషయములను దెల్పుచు వారి కాయుర్వృద్ధి నొసఁగు భారతీయోత్తముఁడు.

అశుభవార్తలనవసరముగ వినదగదు. భోజనకాలమందీవార్తల నాకర్ణించుటవలన రక్తముయొక్క పటుత్వముచెడుటచే నాహారము జీర్ణకోశమునందుఁ బ్రవేశింపదు. అనారోగ్యము వాటిల్లును. అట్టిసమయములం దశుభవార్తలెఱిగించువారికిఁ బుణ్యనాశనమగును. ప్రయాణసమయమందుఁ దేజోవిహీనతను గల్గించు దుర్వార్తలను వినుట, కార్యవిలంబకరము. సంభోగసమయములం దుత్సాహపూరితులై యుండుట కర్తవ్యము.గాన దంపతులు విచారగ్రస్తులైయున్నపుడుగాని, అశుభప్రదేశమందుగాని, సమయమునందుగాని, చిత్తవికారరహితులైయుండుట ప్రధానము. జనులనేకులు, జాబులం దనవసరముగా నశుభవార్తలను వ్రాయుచుందురు. అశుభవార్తలను శుభవార్తలుండు లేఖయందుఁ జేర్చుట, అమృతభాండమందు విషముకలిపినవిధమగును. తొల్లిటి



నుండియు, అశుభవార్తలుండు లేఖయం దితరవిషయములను జేర్పకుండుటయే ఆచారముగానున్నది. గర్భిణు లశుభవార్తలాకర్ణించుట అనారోగ్యకరము ; శోకించుట, ప్రమాదకరము. కోపించుట దూషించుట, దూషించుకొనుట, క్రౌర్యముపూనుట, మొదలగు దుష్కృత్యములు దుష్టసంతతినిబడయుటకును, గర్భపాతాదిక్లేశములకుఁ జిక్కుటకును మూలములు. శుభవార్తలనువినుచు, దేవ, గురు, పితృభక్తులతో మెలఁగుచు, దయాధర్మసత్యశౌచాదు లాచరించుచుండు గర్భిణులు, సుగుణసంపదలతోఁ దులతూఁగు సుసంతానమును బడయుదురని ధర్మము తెల్పుచున్నది.

కొందఱు, అవసరమున్నను, లేకున్నను, దుర్వార్తలను దెల్పుచుండు దురభ్యాసపరులైయుందురు. దుర్వార్తలను సతతముదెలుపుచుండుటయే, వీరివృత్తి. అశుభవార్తలఁగు వీరికిష్టము, వానికావిపత్తు మొదలైనవి కల్గెనని యెఱిగించుచుండుటయే, వీరిప్రధానవ్యాపకము. నాఁడా ఘోరముజరిగెననియు, నేఁడీసౌధముకూలెననియు మొదలగు విషయములనెఱింగించుచుండుటయే, వీరి కానందదాయకము. దుఃఖవార్తల నొరులకుఁ దెల్పుచుండుటయే వీరికి సంతోషకారణము. దీక్షతో దుర్వార్తలను పల్లెగ్రామములకంటె నెక్కువజవముతో వ్యాపింపఁజేయుటయే వీరిజీవయాత్రయొక్కముఖ్యోద్దేశము. వీరియాహారము దుర్వార్తలను వెదకుటయే. ఈరీతిగా వర్తించువాఁడు, అశుభసూచకుఁడు. కళావిహీనుఁడు. దారిద్ర్యమనుభవించువాఁడు. సతతమాతఁడు కుటిలము, కల్మషము, పరనింద, వంశక్షయము మొదలగు అలక్షణములచేఁ బీడింపఁబడు నరాధముఁడు. ఆతని చెంతకుఁబోఁజనదు. ఆతనిని యమభటునిగఁబరిగణించుచు నాతనిదర్శన, స్పర్శనాదులను వర్జించుట సర్వజనులకునుకర్తవ్యము.

శుభములఁదెల్పుచు, ఆకర్ణించుచు, శుభకార్యములందు బాల్గొనుచు, సువస్తువులను రంగస్థలములను వీక్షింపుచు, సతతము నీశ్వరధ్యానమును స్ఫురింపఁజేయుదివ్యపురుషుఁడు, దరశాస్త్రుఁడు. వందనార్హుఁడు. స్నేహపాత్రుఁడు. సభాపూజ్యుఁడు. పుణ్యపురుషుడు బ్రహ్మవర్చస్సుతోఁ నలరారు సాంబమూర్తితోఁ దుల్యుఁడు. నిరంతర మందహాసభరితుఁడు. ఈతఁడు సకలైశ్వర్యములకుఁ గల్పతరువై, సుసంతానవంతుఁడై, దీర్ఘాయుఃకుసుమముయొక్క సుగంధమును విరజల్లుచు, ఆఘ్రాణించుచుండు నఖండతేజోమూర్తియై విలసిల్లు.

పూర్వకాలపుహిందువులు, శ్రుతి స్మృతులందు వివరింపబడిన విధముగా వర్తించుచు, దీర్ఘాయువు నొందుచుండిరి.

## —♦ 35 పురాణ శ్రవణము ♦—

భారతీయుల పురాణములలోఁ బ్రధానమైనవి భాగవత, రామాయణ, భారతములు. భరతవర్షమందలి విశేషభాగము ఈదివ్యగ్రంథములందలి గాథలకు రంగస్థలమగుటవలనను, వీనియందు బాల్గొను సామ్రాజ్యాధిపతులును, ఇతరపాత్రములును హిందూదేశమందే వర్ధిల్లినవారగుటవలనను, ఈపుణ్యగ్రంథములు భారతీయుల పరమపవిత్రమగు ప్రాచీనదేశచారిత్రములని గ్రహింపవచ్చును. ఇవి భారతీయుల యమూల్యభూషణములైయలరారు. హిందువులకు మేరలేని గర్వకారణములు. భారతీయులకు దేశభక్తినుదయింపఁజేయు ప్రశస్తసాధనములు. భరతవర్ష ప్రాచీనాధిక్యమును దమగర్భమునం దిడుకొని ప్రకాశించు గ్రంథరాజములు. ఆధునిక హిందూగ్రంథకర్తల కావ్యనాటకాది పరిశ్రమలకుఁ బుట్టకోటులు. నిరుత్సాహవంతులకును, క్లేశముయొక్క దాడికి లోబడినవారలకును శరణ్యములు. భక్తాగ్రేసరులకును, తపోధనులకును బ్రాణమిత్రములు. హిందూమతగురువులకు దివ్యాయుధములు.



కామక్రోధములఁజిక్కి, ఇహలోకసుఖముల నాశించువారికిఁ బారమార్థికమును బోధించు గ్రంథరత్నములు. లోభులను దమవీపులపై నెక్కించుకొని దానధర్మకేళలకు సులభముగా గొనిపోవు అశ్వశ్రేష్ఠములు. ప్రాచీనహిందువుల ధర్మమార్గవర్తనములకును, అద్భుతప్రజ్ఞలకును, దీర్ఘాయురైశ్వర్యంబులకును ఈగ్రంథములే ప్రత్యక్షనిదర్శనములు.

ఈపుణ్యగ్రంథములను ఆసేతుహిమాచలదేశీయులలో సకలజాతుల హైందవులును, వయోవివక్షతలేకయే, తమతీరికసమయములందుఁ జదివించుకొనుచు దత్కథాసారము గ్రహించుచుండుట వారి సత్కాలక్షేపమైయున్నది. విజయము నెదురుజూచునపుడుగాని, పారమార్థికకార్యము లొనరించునపుడుగాని, పురాణకాలక్షేపము చేయుట హిందూస్త్రీ, పురుషులకుఁ జిరకాలమునుండియు నాచారమైయున్నది. భరతవర్షమున సంస్కృతభాష అభివృద్ధిలోనున్న కాలమందుఁ బురాణములను జదివి తదర్థముఁ బామరులకుఁ దెల్పుప్రసిద్ధపురుషు లనేకు లుండిరి. ఈకాలమున గోదావరిమండలములో వేదశాస్త్ర, శ్రౌతపండితులైన బ్రహ్మశ్రీ వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు సర్వజనరంజకముగా మహాసభలయందుఁ బురాణములను జదువుటయందు ప్రఖ్యాతి నొందుచు తమస్వస్థలమైన విశ్వేశ్వరాయపురమునకుఁ గీర్తిఁదెచ్చిరి. చక్రవర్తులును, శ్రీమంతులును, అనుదినమును గాలనియమము నేర్పరచుకొని, ఈపురాణకాలక్షేపము చేయుచుందురు. పురాణములలో నాంధ్రభారతమునకుఁగల మాధుర్యము తదితరదేశీయభాషలందలి పురాణములకుఁ బూజ్యమగుటచే, హైందవేతరుఁడగు నైజాము సహితము, ఆకర్ణించుటకాంధ్రభారతమును, రుచిఁజూచుటకు మినపగారెలును లోకమందుఁ బ్రాముఖ్యము వహించినవని చిరకాలముక్రిందట నేనువినినట్లొక ప్రతీతికలదు. సకలజాతుల హిందువులును బురాణముల నత్యంతపవిత్రతతో నెన్నుకొనుచు నవకాశము కల్గినపుడెల్ల నీపుణ్య

కథల నత్యంత శ్రద్ధాభక్తులతో వినుచుఁ దమజన్మములను బావనము చేయఁగోరుచుందురు.

పురాణకాలక్షేపము ఈరీతులచే దీర్ఘాయురైశ్వర్యంబులను బ్రసాదించును:—

1. శుభవార్తలును, బలపరాక్రమశాలుల ధైర్యస్థైర్యసాహసాదికృత్యములును నీపురాణముల కలంకారములుగా నుండుటచే బురాణశ్రవణము నుత్సాహమును బుట్టించి, దీర్ఘాయువు నొసఁగును. శ్రీకృష్ణభగవానుని కృపచేఁ గుచేలుఁడు దారిద్ర్యవిరహితుఁడయ్యెనను విషయము, ఉత్సాహకారణము. దేశనాశన మొనరింపుచుఁ దాపసోత్తములను బీడించు ఘోరరాక్షసులను ఖండించిన, శ్రీరామహనుమదాదుల యద్భుతచర్య లుత్సాహదాయకములు. పరాక్రమశాలియగు భీముఁడు తనయసాధారణప్రజ్ఞచే రాక్షసవీరుఁడగు బకాసురుని బరిమార్చిన తెఱంగును, శ్రీకృష్ణుని కృపచే ద్రౌపదీదేవికి సభయందు మానరక్షణము గావింపఁబడిన విషయమును మున్నగువానినాకర్ణించువారికి మేరలేని ఉత్సాహముకల్గి, ఆరోగ్యమేర్పడి, దీర్ఘాయువు కల్గును.

2. పురాణశ్రవణము సత్సాంగత్య సద్వర్తనములకు మూలమై, దీర్ఘాయువు నొసఁగును. సత్పురుషులెట్టి సుఫలితములను విజయములను నొందిరో, దుష్టులకు దమదుర్బుద్ధులవలనను, దుష్కృత్యములవలనను, ఎలక్షిపాదముగల్గెనో దుష్టుల నాశ్రయించియుండి వారికి హితము చెప్పువారికి నెట్టివిపత్తులు వాటిల్లునో మొదలగు విషయములు పురాణశ్రవణము వ్యక్తముచేయును. ప్రహ్లాదునివృత్తాంతమువలన నైశ్వర్యకాములై దుష్టత్వమాచరించి, ధర్మవిరుద్ధముగా సంచరించువారికి భీతికలిగి, సన్మార్గమలవడును, సత్యవ్రత మాచరించువారికి, ఉత్సాహము కల్గును. సీతాదేవివృత్తాంతము, స్త్రీలకుఁ బాతి



వ్రత్య మలవడఁజేయును. హిందువు లీగ్రంథముల మహిమచే నన్నప్రదాన, వస్త్రప్రదానాదులందును, నీతిమార్గవర్తనమందును, అభిమానముతోఁ దులతూగుదురు. జారచోరత్వములు భయంకరములైనపాపకర్మములని ఈగ్రంథరత్నములు బోధించును. అప్పుడప్పుడు, భగవంతుఁడు నిరుపేదరూపముదాల్చి వర్తించునట్లు, ఈకథలఁ దెలియవచ్చుటచే, గుణవంతులగు నిరుపేదలయందు భయభక్తులును, భూతదయయుఁ బురాణశ్రవణముచే గల్గును. ఈరీతిగా హిందువులు పరద్రోహము, కుటిలత్వము, దుష్టత్వము, అసహనము మొదలగు దుర్గుణములను వర్జించి, సన్మార్గులై, నిరంతరోత్సాహవంతులై, దీర్ఘాయువునొందుదురు.

3. హిందూధర్మముయొక్కయు, భరతవర్షముయొక్కయు నుత్కృష్టతకు మూలములైన వర్ణాశ్రమధర్మములందుఁ బురాణశ్రవణ మత్యంతాభిమానము జనింపఁజేసి, దీర్ఘాయువును సమకూర్చును. ప్రాచీనహిందూమహాయుగమునందీపురాణములందలి విషయములు జరిగియున్నందునను, ఆధర్మయుగమందు భరతవర్షమున వర్ణాశ్రమధర్మము లత్యంతదీక్షతో నాచరింపఁబడుటవలనను, పురాణశ్రవణము, వీని రక్షణచే హిందూదేశముయొక్క క్షేమమునకుఁ బ్రధానమని స్పష్టపఱచును. ఈమహాగ్రంథకాలక్షేపముచే హిందువులకెల్లరకును దమవర్ణములందును, ఆశ్రమములయందును నభిమాన ముదయించును. సూర్యచంద్రవంశ్యక్షత్రియులును, బ్రాహ్మణులును, తదితరులును తమతమధర్మముల నాచరింతురు. ఇవ్వన్నియు దీర్ఘాయుఃపుణ్యక్షేత్రమునకు రాచబాటలు. భారతీయులు యుక్తకాలనియమముల ననుసరించి ఈగ్రంథముయొక్క ప్రథమభాగమందలి కర్మలనాచరింతురు.

4. ఈసత్కాలక్షేపము చేయు దీక్షాపరులకు నేకాగ్రచిత్తము కుదిరి, దీర్ఘాయువు సాధ్యమగును. శ్రీమన్నారాయణుని మహిమ

మీపుణ్యగ్రంథములందు బ్రకటితమగుచుండుటచే, జగద్రక్షకుని స్మరించు నవకాశము, పురాణములఁ జదువువారలకును, ఆకర్ణించువారలకునుఁ గల్గును. భక్తిరసపూరితమైన భాగవతము జదువునపుడట్టి అవకాశము విశేషముగాఁ గల్గును. దేవస్మరణ, క్షణక్షణ ప్రాయశ్చిత్తమనియు, సకలపాపములను హరించి, సర్వకష్టములను దాటించి, కార్యదీక్షయందు విజయము చేకూర్చు మహాస్త్రమనియు, నీతికోవిదులు భాషింతురు. ఈనిత్యవిజయ ముత్సాహము నర్పించును. ఈశ్వరధ్యానము చేయుచుండుటచే మనస్సు పరమేశ్వరునియందు లీనమై, ఏకాగ్రచిత్తము కల్గును. ఇది, శ్వాసబలమును, రక్తబలమును నేర్పరచి, దీర్ఘాయువు నాఘ్రాణింపఁజేయును.

5 పురాణములు చదువు పుణ్యపురుషులు, నిర్మలగాత్రముతో వర్ధిల్లుచు, దీర్ఘాయువునొందుదురు. వారికి వాక్శుద్ధికలుగును; స్వరము మాధుర్యమైననాదముతో నొప్పారు; దేహమందలి అవయవములన్నియుఁ బరిశ్రమ నొందును; రక్తప్రవాహము చురుకుగల దగును. పురాణము చదువుచు జనుల నానందింపఁజేయు పుణ్యపురుషులు, ఈహేతువుచేఁ దేజస్సుతోఁ బ్రకాశించుచు, ఉత్సాహములో నలరారుచు, దీర్ఘాయుశ్లాఘ మొందుదురు.

6, సకలజాతుల హిందువులకును బురాణశ్రవణము వలన సర్వకార్యసాఫల్యమై, శరీరమందలి మహారోగములు సహితము తొలఁగిపోయి, దీర్ఘాయురైశ్వర్యంబులు సిద్ధించును. అనుదినమును స్నానాదులాచరించిన పిమ్మట ద్విజులనేకులు భోజనమునకుఁ బూర్వము భాగవతముగాని, భగవద్గీతలుగాని, సుందరకాండముగాని, శ్రీరాములకు నగస్త్యమునివర్యుఁ డుపదేశించిన ఆదిత్యహృదయస్తోత్రముగాని పారాయణము చేయు వాడుకతోఁ దేజరిల్లుచుందురు. ఈపారాయణములవలన సర్వకార్యసాఫల్యమై, సకలైశ్వర్యంబులును చేకూరు నని



ప్రతి హిందూగృహస్థునకును దెలిసిన విషయము. పురాణకాలక్షేపము దేహారిష్టము లగునట్టిశతలను బరిమార్చి, అకాలమృత్యువును జయించి, దీర్ఘాయువు నొసంగు. తొల్లి, ఆర్యావర్తదేశాధీశుండును, సముజ్జ్వలత్తేజోవిరాజమానచంద్రుండును, నీతిమార్గవర్తనుండును, ధర్మకార్యదీక్షానిరతుండును, దయాళుయుండును, పాండవవంశోద్భవుండును నగు జనమేజయచక్రవర్తి, రాజసూయయాగంబు సేయుచుఁగారణాంతరంబున నుగ్రుండై, సద్బ్రాహ్మణు లగుబదునెనమండ్రు ఋత్విక్కులను వధించె. బ్రహ్మహత్యాదోషం బనునిమ్మహాపాతకంబుచే నాతఁడు కుష్ఠురోగపీడితుఁడై, దుఃఖసాగరంబున మునిఁగి యుండె. ఒకనాఁడు శ్రీవ్యాసులవారు వాని జూచి సర్వంబును నెఱింగిరి. అంతట రాజేంద్రుఁడు తన రోగవిముక్తికై యుపాయం బేదేని దెల్పుమని వేడిన నమ్మునీంద్రుఁడు తాను రచించిన శ్రీమహాభారతము పదునెనిమిది పర్వంబులును నామూలాగ్రంబుగాఁ జదివించి శ్రద్ధాభక్తులతో వినినయెడల బదునెనిమిది బ్రహ్మహత్యలవలన గల్గిన దోషంబును హరించు నని పల్కె. తత్క్షణంబ యానృపాలుఁడు ఋషిశ్రేష్ఠుఁడు సెప్పిన చొప్పున యథావిధిగా భారతము శ్రద్ధతోఁ జదివించి వినుచు, సద్బ్రాహ్మణసత్కారమును, అన్నప్రదానమును గావించుచు, రోగవిముక్తుఁడై కృతార్థత నొంది, చిరకాలము వర్ధిల్లె. కావున రోగులును, విజయము నెదురు జూచువారును బురాణశ్రవణము చేయుచు, అన్నప్రదాన, సద్బ్రాహ్మణసత్కారము లొనరింతురేని వారారోగ్యవంతులై, విజయము నొంది, ఉత్సాహపరవశులగుచు, దీర్ఘాయుర్మహారాజ్యాధిపత్యము వహింతురు,

దీర్ఘాయురైశ్వర్యంబులకు సాధనములలో నొకటియై యున్న పురాణశ్రవణసత్కాలక్షేపము, పూర్వకాలమునుండియు హిందువులు దీక్షతోఁ జేయుచుండిరి. దేవాలయములందుగాని, గ్రామసావళ్లయం

దుగాని, గృహములందుగాని నీసత్కాలక్షేపము సద్బ్రాహ్మణశేఖరులతోఁ గూడియుండి చేయుచుట యిప్పటికిని హైందవు లనేకులకు నాచారము. భరతవర్షమున దేవబ్రాహ్మణభక్తిపరులలోఁ బ్రథమసోపాన మలంకరించియుండి, తమ స్వధర్మ మగువాణిజ్యము నభివృద్ధి పరచుకొనుచుండు వైశ్యులు, పురాణశ్రవణనిరతులలో నగ్రతాంబూలమున కధికారులై తేజరిల్లుచున్నారు. వీరు, ధర్మకార్యములందెల్ల ముందంజ వేయుచుండు పారమార్థికులు; నాగరకతాసాంప్రదాయములను దూరముగా నుంచి, ప్రాచీనహిందూధర్మయుక్తములైన నియమములను ధనవ్యయముతోఁ గాపాడు సాహసులు; తమగృహముల కేతెంచు సద్బ్రాహ్మణులవలన బురాణేతిహాసముల నాకర్ణించుచు, వారిని రిక్తహస్తములతోఁ బోనీయ నొల్లక, తమశక్త్యనుసారము వారిని సత్కరించి, సతతముఁ బుణ్యము సంపాదింప యత్నించు భారతీయోత్తములు; తీరికసమయములం దెల్ల సద్బ్రాహ్మణులచేఁ బురాణములను జదివించుచు, వాని నాకర్ణించుటకు నితరులకుఁగూడ తగిన అవకాశ మిచ్చుచు, తత్ఫలమును సులభముగా సంపాదించు పుణ్యాత్ములు; తమవ్యవహారములను జక్కపెట్టుకొనుటకై సద్బ్రాహ్మణశేఖరులను వేతనము లిచ్చి నియమించి, వారివల్ల పురాణేతిహాసముల నవకాశము కల్గినపుడు వినుచుండు వివేకవంతులు; వర్తమానకాలమందు వృత్తులలో వాణిజ్యము ప్రశస్తమైన దని గ్రహింపఁజేయుచున్న నిర్గర్వచూడామణులు; నాగరకతాదోషముచే నీకాలమున బ్రహ్మక్షత్రియులందు సహితము కానరాని కర్మిష్ఠు లనేకులు వీరియందు కలరు. శృంగారమునకుఁ దగని ప్రాముఖ్య మిచ్చి, జారత్వము నభివృద్ధిచేయుచు, హిందూసంఘమును ధ్వంసము చేయుచున్న నాటకములను బ్రోత్సాహపరుపక, పురాణములనే వృద్ధినొందింపఁ గైకంకణము కట్టుకొనియున్న వైశ్యులు, పూర్వాచారపరాయణత్వముతో



నలరారు ఆధునికభారతీయు లని ప్రకటితమగుచున్నది గాదె. వీరిట్టి దీక్షతో నాసేతుహిమాచలదేశమందుఁ బురాణముల నుద్ధరించుచున్నందున, వీరు దీర్ఘాయురైశ్వర్యంబులతోఁ దులతూగునట్లు పురాణములందలి దేవతల యాశీర్వచనము నొందుదురుగాక.

ఈపురాణములందలి భక్తిశ్రద్ధలు హిందువు లనేకులకు నశించినను, వారియందు నూతనాభిమాన ముదయించుచున్నది. నాగరకతాభివృద్ధి, హిందువుల ప్రాచీనవృత్తులకు మార్పులు తెచ్చి వారిని దీరికసమయములందు రిక్రేషనుమెంటురూమ్సుకును, క్లబ్బులకును, పురమందిరములకును నీడ్చుకొని పోవుచున్నది; దుర్వ్యసనములైన చదరంగాదులయందు వారికి హితము కుదుర్చుచున్నది; ఈశ్వరధ్యానశూన్యుల గావించినది; హ్విస్కీలను, మాంసపు భక్ష్యములను ద్విజులచే స్వీకరింపఁజేయుచున్నది; సంస్కృతభాషను క్షీణింపఁజేసినది; పురాణగ్రంథసారములను జనసామాన్యమునకు బోధపడని పరిస్థితులను గల్గించినది; హరికథలను బ్రవేశపెట్టినది. ఈహరికథలను వినిపించు హరిదాసులు సద్వర్తనపరు లనేకు లీనడుమ బయలుదేరి, ప్రాచీనసాంప్రదాయములైన పురాణశ్రవణమునం దభిరుచి పుట్టించుచున్నారు. వీరిలోఁ బ్రఖ్యాతిపురుషుఁడు నెల్లూరుమండలమున వర్ధిల్లుచున్న కారుమంచిగ్రామవాస్తవ్యులగు శ్రీగౌరవఝ్యుల వేంకటకృష్ణయ్యగారు. ఈతఁడు 5, 6 వర్షములనుండి, ఆంధ్రమండలమున రత్నగర్భ లనదగు కృష్ణాగోదావరీ మండలములందుఁ బుస్తకసాహాయ్యము లేకయే రామాయణాదిపురాణములను పండితపామరరంజకముగా విలసిల్లునట్లు వినిపించుచున్నారు. ఈతఁడు పురాణగ్రంథములలోనుండు ప్రతివిషయమును విశదపరచి వినిపించును. ఈతఁడు హరికథ చెప్పునపుడు నవరసములు నెలకొనుచుండును. నిదురించువారెల్లరును మేల్కాంతురు. అభినయశాస్త్ర మీతనికిఁ గరస్థమైయున్న యభినయశాస్త్రము;

ఈతనికిని దదితర హరిదాసులకును గలముఖ్యమైన భేదము; ఈతని కథకు నిండుదెచ్చి, రక్తి కట్టించు మహాభూషణము; ఈతని కథా కాలక్షేపసమయమున స్వర్గలోకవేశ్యకాంతల నృత్యమును, ఋష్యశృంగుండు, వశిష్ఠుండు, నారదుండు మొదలగు మునీంద్రుల మహిమంబును ప్రత్యక్షముగా గన్నులకుఁ గట్టినట్లు గోచరింపఁజేయు అద్భుతప్రజ్ఞ; ఈతని కాలక్షేపమును నాటకమువలె స్ఫురింపఁజేయు మహాశక్తి. ఈతఁడు గానవిద్యావిశారదుఁడు. దేవభక్తియు, నీతిమార్గమును బోధించుచు, హాస్యశృంగారములకు నవశ్యకమైనచోట మాత్రమే ప్రాముఖ్య మిచ్చుచుండుటచేత నీతని హరికథ భాగవతమేమో అనునట్లు తోఁచును. నాటకాదులందు వాడబడు నూతనపద్ధతుల నీతఁ డప్పుడప్పుడు ప్రదర్శించుచు, తనకథను వినువారిచే నేకగ్రీవముగా దమ జన్మములో నిట్టికథ నెఱుంగ మని మెప్పుఁబడసి, సువర్ణపతకములను సంపాదించె. ఈతఁడు కథ వినుపించునపుడు వినువారల మనస్సు భగవంతునియందే నిలిచి యుండును. ఈతని కథ నాకర్ణించుటకై దశదిశలనుండి మందలుమందలుగా జను లేతెంతురు. ఈతఁడు సదాచారసంపన్నుఁడు. సత్కుల ప్రసూతుఁడు. ఇన్నిసుగుణములు మూర్తీభవించి యుండుటచే నీతఁడు హరిదాసులందును, నాటకప్రదర్శనాచతురులందును, పురాణము చదువువారలందును నగ్రస్థానమలంకరించుచున్నాడు. ఈతనికథవినువారికిఁ బురాణగ్రంథములగు భారతరామాయణములను జదువుటకు నూతనాభిమానము జనించుటచే నీతడు హిందూసాంప్రదాయమైన పురాణముల నుద్ధరించు ప్రసిద్ధపురుషుఁడని ఎంచవచ్చును. కవిశేఖరుఁడగు రవీంద్రనాథుఁడు, ఠాకూరువంశమునకును, భరతవర్షమునకును శాశ్వతకీర్తిని సంపాదించిన తెఱంగున, జ్యోతిశ్శాస్త్రవేత్తయై, పంచాంగములు రచించువంశమునందు జనించి, సుమారు 50 వత్సరములనుండి పంచాంగములకు గ్రంథకర్త



వై తేజరిల్లుచు, అనుదినము నాంధ్రలోకమందుఁ బూర్వాచారపరాయణులచే నీశ్వరనామమువలె స్మరింపఁబడుచుండు పెదపూర్ణయ్యసిద్ధాంతి, శ్రీమత్పిడపర్తివంశమును పావనముచేసిన చందంబున విద్యాశాలలు నెలకొల్పి, ఆంధ్రభాషనుద్ధరించుచు విద్యాభివృద్ధిచేయుట కర్తవ్యమని బోధించుచు యోగ్యమగు వర్తనముతో మెలఁగుచున్న శ్రీరావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరుమహారాజాగారు, దక్షిణహిందూస్థానమున వర్ధిల్లుసంస్థానములలో, పిఠాపురము, ప్రథమస్థానమలంకరించుచున్నదని వ్యక్తముచేయుచు, తమవంశమునకు శాశ్వతమైన యశస్సును దెచ్చినరీతిని, శ్రీవేంకటకృష్ణయాఖ్యుఁడు గౌరావఝ్ఝులవంశమును పావనముచేయుచు, నెల్లూరుమండలమునకుఁ బ్రఖ్యాతిఁదెచ్చుచు, హిందూసాంప్రదాయమైన పురాణములందు నూతనాభిమానము ఈకాలపుటాంధ్రులకుఁ బుట్టించుచున్నాఁడు.

## —* 36. దేవాలయములు. *—

భరతవర్షమందు హిందువులు వసియించు ప్రతిపల్లియందును, పట్టణమందును గన్పించు పవిత్రస్థలము, దేవాలయము. ఈశ్వరుని విగ్రహమును బ్రాచీనకాలమునుండియు హిందువు లిచ్చట పూజించుట ఆచారము. ఆసేతు హిమాచలమై, హిందూమతము వ్యాపించిన ప్రతిప్రదేశమునకును నీపుణ్యస్థలములు భూషణములై యలరారుటచే, దేవాలయములేని గ్రామాదులు కుగ్రామము లనియు, వాసయోగ్యము కానేరవనియు, హిందూధర్మము వచించునట్లు వ్యక్తమగుచున్నది. ఈయాలయములు హిందూమతము నభివృద్ధి చేయు పవిత్రమైన ప్రదేశములు. హిందూసంఘముయొక్క ఆచారములను, నియమములను గాపాడు ప్రశస్తక్షేత్రములు. ఇహలోకకష్టములను దునిమి శాంతిని హృదయమునందు నెలకొల్పు దివ్యాయుధములు. భక్తజనులకును, తపోనిష్ఠాగరిష్ఠులకును వాసయోగ్యములై, ప్రీతికరములైన స్థానములు. హిందువులకు దయాధర్మసత్యశౌచాదు లలవడజేయు సాధనము

లు. దేశారిష్టము లగు మత భ్రష్టత్వము, క్షామము, అగ్నిభయాదులను దూరముగా దరిమి, కుంభవృష్టి యనావర్షములను గురిపించఁజేయు మహిమముతోఁ బ్రకాశించు అస్త్రములు. దేశక్షేమమునకును, ప్రజాశాంతికిని, పాలకపాలితుల అన్యోన్యానురాగములకును నత్యావశ్యకము లగు క్షేత్రశ్రేష్ఠములు. దేశీయులు పూనుకొను కార్యములందు విజయము నొందుటకును, పురములయొక్క క్షేమమునకును దేవాలయము లభివృద్ధియే ముఖ్యము. ఈకాలమందు సహితము నూతనముగు గ్రామనిర్మాణము జరుగునపుడు ఆలయమునకై ప్రత్యేకముగా గొంత స్థలము నియమించి గృహనిర్మాణమునకుఁ బూర్వమే దేవాలయము యొక్క పునాది నేర్పఱచుట వాడుక.

ప్రాచీనకాలమునుండియు హిందువులెల్లరును దేవాలయముల కేగు సదాచారముతోఁ దేజరిల్లుచుండిరి. ఇచ్చటతీరికసమయములందు బ్రాహ్మణులు వేదాధ్యయన, పురుషసూక్త, శ్రీసూక్త నమకచమక పంచాంగశ్రవణాది కాలక్షేపము లొనరించుచుండిరి. వేసవికాలమందు వసంతపూజలు స్వామిసాన్నిధ్యమందే జరుగుచుండెను. సుమారు 50, 60 సంవత్సరముల పూర్వమువఱకును హిందూదేవాలయములు భక్తజనుల ప్రార్థనలతో, తదితరుల నృత్య, గాన, భజనలతో, గంటయొక్క మహాధ్వనితో నుదయసాయంకాలములందుఁ బ్రతిధ్వనించుచుండ, భరతవర్షము సర్వసంపదలతో నిండియున్నపుణ్యభూమియని ప్రసిద్ధికెక్కియుండె.

దేవాలయమున కనుదినము జనుచు దేవదర్శనము చేయుట వలన నీరీతిగా దీర్ఘాయువు లభించును:—

1. దేవాలయముల కనుదినమునుబోయి దేవదర్శనముచేయు హిందువులకు నారోగ్యమేర్పడి, దీర్ఘాయువుకల్గును. హిందువు లీపుణ్యస్థలముల కేగునపుడు నిర్మలదేహముతోఁ బరిశుభ్రమైన వస్త్రములతో గూడియుండుట కర్తవ్యము. శుచిత్వమీరీతిగా వారికిఁ బట్టుపడి, ఆరోగ్యము కల్గును. గర్భాలయమందుఁ బ్రవేశింపకపూర్వము ప్రదక్షిణము ముమ్మారు గావించుట ప్రధానము. ఈసమయమందు నాలయమందుండు పారిజాతము మందారము మొదలగు పుష్పవృక్షములనుండి బయల్వెడలు ప్రాణవాయువు, ఉత్సాహమిచ్చును. దేవసాన్నిధ్యమందు కర్పూరదీపము, సాంబ్రాణి ధూపములు మొదలగు వాని వలన దుర్గంధములణగును. దేవునిఁబూజించునపుడు బిల్వపత్రి, తులసిదళములు మున్నగునవి, ఉపయోగింపఁబడును. ఇవి దేహారోగ్యకరములై వఱలుటచే దేవాలయములకు నిత్యమును జనువారికారోగ్యము కల్గి, దీర్ఘాయువు హస్తగతమగును.

2. ప్రతిదినమును దేవాలయముల కేగువారికి మనోనిశ్చలత్వము కుదురుటచే, దీర్ఘాయువులభించును. దేవదర్శనముచేయుటకుఁబూర్వము, అచ్చటనుండు గంటను ముమ్మారు వాయించుట వాడుక. ఈధ్వని వలన “ఓం” కారశబ్దముజనించును. ఇందువలన మానవహృదయమును బీడించు కష్టములన్నియు మఱవఁబడును. ఉత్సాహముకల్గును. మనశ్శాంతి లభించును. దేవధ్యానమువలన భగవంతునియందే హృదయము లీనమైయుండును. గంటయొక్కధ్వని పిశాచాదులకు భీతికరము. గ్రామములు, భూతాదుల భయము లేకుండ వర్ధిలును. ఈధ్వని దేవతలకు బ్రీతికరమగుటచే దేవతార్చనసమయమందు గంటవాయింపఁబడును. దేవతలఆశీర్వచనముకల్గుటయేగాక మనోనిశ్చలత్వముకలిగి, దీర్ఘాయువు లభించును.

3. ఈసదాచారమువలన సత్సాంగత్య, సద్వర్తనములలవడి, దీర్ఘాయువు సమకూరును. దేవదర్శనముచేయునపుడు కానుకలర్పించుట కర్తవ్యమని హిందూధర్మము వివరించుచున్నది.

"అగ్నిహోత్రిం గృహం క్షేత్రం గర్భిణీవృద్ధబాలకా
రిక్త హస్తేన, నోపేయాత్ రాజానం దైవతం గురుం"

కావున హిందువులు దేవునికి ఫలముగాని, ద్రవ్యముగాని, పుష్పముగాని, తులసిబిల్వదళములనుగాని సమర్పింతురు. ఈఆచారమువలన లోభులకు సహితము దానధర్మములం దభిమాన ముదయించును. లేఁబ్రాయమునుండియు దేవాలయముల కనుదినము జనుచుండు హిందువులు సత్వగుణసంపన్నులై, ప్రకాశింతురు. ఈయాలయములకు సత్పురుషు లనేకు లేతెంతురు. వీరితో మైత్రి సర్వశ్రేయస్కరమై యొప్పారు. దేవాలయముల కేగువారలకు భరతవర్షాధిక్యమునకుఁ గల్పతరువులైన వర్ణాశ్రమ ధర్మాభిమానమును, సద్బ్రాహ్మణపూజయు, అతిథిసత్కారమును బట్టుపడును. భగవద్ధ్యానపూరితులై, ఈసుగుణములతోఁ బ్రకాశించువారికి దీర్ఘాయువు కరస్థమగును.

4. దేవాలయములకేగువారలకు స్వామియొక్క కళ్యాణము సేవలు, సమారాధనములు, వసంతపూజలు మొదలగు కార్యములందుఁ బాల్గొనువాంఛ కలుగును. ఈపుణ్యకార్యములన్నియు జయప్రదముగా నెరవేర్చుటకు గ్రామస్థు లేకీభవించి ధనమును జందాల వలన వృద్ధిచేయుట ప్రధానము. ఈసమయములందుఁ బ్రజలొండొరులకు గలస్వల్పవైమత్యములణగిపోయి, ఐకమత్యము కలుగును. గ్రామస్థుల యైకమత్య ముత్సాహకారణము. దీర్ఘాయుర్దాయసాధనము.

5. హిందువులకు దేవాలయములకుఁ బోవుఆచారము వలన సర్వసంపదలును గల్గి, దేశ మైశ్వర్యముతో, దులతూగును. ఈపుణ్యస్థలములకేతెంచువారు సతతము, పరిశుద్ధాంతఃకరణము గలవారై, ఆనందస్వరూపుడైన భగవంతునియందు ధ్యానముతో విలసిల్లుచు, నిర్మలహృదయులై, బ్రహ్మవర్చస్సుతోఁ దేజరిల్లుదురు. 7, 8 పుటలయందు వర్ణింపఁబడిన సంపదలు భరతవర్షము నాశ్రయించుకొని



యుండును. దేశీయులు పూనిన కార్యములందెల్ల విజయము చేకూరును. వారీవిధములచే నుత్సాహవంతులై దీర్ఘాయువు నొందుదురు.

6. దేవాలయములందు భగవంతుని ప్రత్యక్షమహిమము వ్యక్తపడుటచే, అనుదినమును దేవాలయముల కేగువారికి నాత్మబలము లభించి దీర్ఘాయువు కల్గును. పాపవృద్ధివలన నీశ్వరకటాక్షము శూన్యమై, దేశక్షేమము భంగపడునట్లును, పాడిపంటలు పూజ్యము లగునట్లును, వానలుకురియక ఆకసమునందు సంచరించు పక్షులు మలమల మాడి, ఇలపై బడునంతటి ప్రళయకాలమందు దేవాలయములకేగి హిందువులు శివుని శిరంబుపై సహస్రఘటాభిషేకంబులు చేయుట, ఆచారము. ఈమహాభిషేకము జరుగుచుండు కాలమున నాకసము మీఁద నవమేఘములును గ్రమ్మి, సస్యానుకూలంబుగా వర్షించునని పెక్కెండ్రహిందువుల కనుభవము. మరియు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి మహిమముకూడ భారతీయు లనేకులకుఁ బ్రత్యక్షమగుచున్నది. ఈస్వామికిఁ బ్రాచీనకాలమునుండియుఁ బ్రత్యక్షనిదర్శనములైన స్థానములు దక్షిణహిందూస్థానమున, రెండుకలవు. మదీయజన్మస్థానమై, వశిష్టానదీతీరంబున వర్ధిల్లుచున్న నడుపూడిగ్రామము, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారికిఁ బురాతనకాలమునుండియు నిలయమై యొప్పారు. ఈక్షేత్రము, మదపుటేనుగు తొండములఁబోలు జబ్బలతో దీపించుచు, వేదమంత్రములఁ బఠించు విప్రోత్తములవలనను, దేవతార్చనాదురంధరులవలనను, క్రతువులొనరించిన సోమయాజులవలనను పావనము చేయఁబడిన పుణ్యప్రదేశము; గోదావరిలంకలందు మేయు పశువులొసఁగు ప్రశస్తక్షీర, దధి, ఘృతములతో నన్నప్రదానము చేయు గృహస్థులతోఁ బ్రకాశించు గ్రామసీమ; కోకిలగానముతో ధ్వనించు చూత, కదళీవనములతో నావృతమైన పల్లెటూరు; మనోహరములైన మలయమారుతములవలన "దలపాగాలు" మెలఁగుచుండ.

పొలములందుఁ బనిచేయు సేద్యగాండ్రతోను, దానధర్మశీలులగు భూస్వాములతోను నిండియున్న దివ్యస్థలము. చిరకాలముక్రిందటనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఈగ్రామముయొక్క పశ్చిమదిశయందు వెలసి, గ్రామస్థుల కనేకసమయములందుఁ దన సర్పస్వరూపమును జూపుచు, అంతర్ధానమగుచుండుటచే నాంధ్రమండలమున నీస్థలము "సుబ్బారాయుని నడుపూడి" అని పేరొందియున్నది. ఈస్వామి ఆలయమును నీగ్రామస్థులు విశేషధనవ్యయముతోఁ గట్టించిరి. ప్రతివత్సరమును మార్గశిర శుద్ధపంచమినాఁ డిచ్చట అత్యంతవైభవముతో నీస్వామి కళ్యాణము జరుగును. షష్ఠిదినమున గొప్ప తీర్థమును, రథోత్సవమును జనసంకీర్ణమైయుండునట్లుగా జరుగును. ఆంధ్రమండలమున ననేకచోట్లనుండి యాత్రికులానాఁడిట కేతెంతురు. ఈనడుమ, దుర్మతిసంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి (క్రీ.శ. 8-2-1922)దినమున శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, ఈగ్రామస్థులకుఁ బ్రత్యక్షంబయ్యె. ఆనాటి ఉదయమున, మండపముచెంత గొందఱు పనివాండ్రు మరమ్మతులు చేయుచుండ, ధవళచ్ఛాయయైన సర్పము ఆలయపుతలుపుపైఁ బరుండి, మధ్యాహ్నమువఱకు నచ్చటనే యున్నందున స్వామి నైవేద్యమునకానాఁ డాటంకము కల్గెను. తుదకు గ్రామస్థులందఱును జేరి, స్వామిని బ్రార్థించి, తమ లోపములను మన్నింపుమనినతోడనే వారి యెదుటనే సర్ప మదృశ్యంబయ్యె. ఈస్వామియొక్క మహిమముచే, కర్ణరోగములును, నేత్రరోగములును, పొడలును నివారణమగునని ఆంధ్రుల నేకులకు స్వానుభవమైన విషయము. ఈస్వామియొక్క మహిమము, మలబారుమండలమందలి, ఉడిపి సమీపమున నున్న సుబ్రహ్మణ్యమను క్షేత్రమునఁగూడ మిక్కిలి ప్రత్యక్షముగా నున్నది. దేవాలయములందు భగవంతునిమహిమ మిట్లు గోచరిం



చును. హిందువులు ఈపుణ్యస్థలముల కేగి, దేవభక్తితో మెలఁగుచు ఆత్మబలమును సాధించి, దీర్ఘాయువు నొందగలరు.

7. దేవధ్యానముచేయు దీక్షాపరునికిఁ గుణవతియై, సౌందర్యవతియైన సద్భార్య లభించునని పురాణములు తెల్పును.

8. భక్తజనులగు దేవాలయముల కేతెంచువారల కపమృత్యువు తొలగిపోయి, దీర్ఘాయువు కల్గునని ధర్మము బోధించుచున్నది.

ఇక్కాలంబున దేవాలయముల వైభవము, నాగరకతాదోషముచేఁ దొలగిపోయినది. నాగరకభారతీయు లెల్లరును నీశ్వరధ్యానశూన్యులైరి. దేవాలయములకుఁ జనుదెంచువారిని వీరు పరిహసించుచుఁ దాము దుష్కృత్యముల నొనరింతురు. దేవాలయములకుఁ బోవుటకుమారుగాఁ బ్రదోషకాలమందు-తమపై అనురాగ మెంతమాత్రమును జూపని జారకామినికి వింజామరలు వేయుచుండుటయో, సమారాధనసమయమందు శునకము లుచ్ఛిష్టము నారగించుటకై వేచియుండు పగిది, రిఫ్రెషుమెంటుగదులయొద్ద "యూరోపియనులు" భుజించువఱకును గనుపెట్టుకొనియుండుటయో, కాఫీహోటళ్లు కంటఁబడు చోట్లయందెల్ల, ఉదరమును నింపుకొనుచుండుటయో, క్లబ్బులందును, రీడింగురూములందును జదరంగాది దుర్వ్యసనములఁ జిక్కియుండుటయో, మహనీయమూర్తులైన వేదశాస్త్రశ్రౌతవిశారదులను బరిహసించుటయో—వీరికి వ్యాపకములై యున్నవి. అర్చకుల పవిత్రత పూజ్యమైనది; వారు మలినవస్త్రములతో, క్రాపింగులతో, ఓరగోచులతో, శిగరెట్ల ధూమముతో దేవసాన్నిధ్యమున కేగుచున్నారు. దేవాలయపు వసతుల నభివృద్ధిపరచుట కేర్పడిన ధర్మకర్తలు, పవిత్రతతోఁగూడిన నీసొత్తుల నపహరించి, దేవాలయముల వైభవమును జెఱచుచున్నందున, వీరు వంశాభివృద్ధియు నైశ్వ

ర్యమును గోల్పోవుచు, ఋణగ్రస్తులగుచు, అల్పాయువుతోఁగూడిన దుష్టసంతతిని బడయుచు నపమృత్యువు వాతఁబడుచున్నారు. దేవాలయము లీరీతిగా జనసంచారము లేనివైనవి. అసత్యాధర్మములు ప్రబలినవి. పాడిపంటలు పూజ్యములైనవి.

ఈసందర్భమున వైశ్యులు దేవాలయములను రక్షించుచుండుట మిక్కిలిస్తవనీయాంశము. వీరు, అత్యంత భక్తితో ననుదినమును దేవదర్శనము చేయుచుండు దీక్షాపరులు. ఈవైశ్యులు, దేవాలయములను గట్టించుటయందును, శిథిలమైన దేవాలయముల వైభవము నిలఁబెట్టుటకై విశేషధనవ్యయము చేసి, వానిని బునర్నిర్మాణము చేయించుటయందును, పలుచోట్ల మండపములను, ధ్వజస్తంభములను గట్టించి, ప్రతిష్ఠలు చేయించుటయందును, నత్యంతోత్సాహము, పూనికయు గల హిందూమాతయొక్క ముద్దులబిడ్డలు. "తటాకోదర జలంబులకుఁ బరీవాహంబువోలె సంపాదిత విత్తమునకుఁ ద్యాగమే రక్షణ" మనెడి లోకోక్తియొక్క మర్మమును గ్రహించి, వర్తించుచున్న పూర్వాచారపరాయణులు. దేవకార్యార్థమై విద్యుద్వేగతుల్యమైన జవముతో నొక్క తృటిలో నెంతధనమైనను జందాలవలన బోగుచేయు సమర్థులు. ఎట్టి మహాదశను దామనుభవించుచున్నను, నిర్గర్వచూడామణులై యలరారుచు, తమపదవికి మూలకారణము పరమేశ్వరకృపయే యని యెల్లప్పుడును గ్రహించుశాంతమూర్తులు. ఈవైశ్యులకు దేవాలయమున నత్యంతభక్తి; దేవకార్యమున నపరిమితానందము; దేవాలయమును వీరు వీక్షించినతోడనే భక్తితోఁగూడిన అంజలినిడుదురు; దేవసాన్నిధ్యము వీరి కమృతపానము. భరతవర్షమున వీరి సహాయమే లేకున్నచో, దేవాలయములిప్పటికే పూర్ణగా చెడిపోయియుండును. దేవాలయముల యెడల వీరిట్టిశ్రద్ధాభక్తులతో మెలఁగుచు దేవదర్శనములభింపని దినమునువారు దుర్దినమని భావింతురు గాన వారి



సంపద దినదినాభివృద్ధి గాంచుచున్నది. హిందూదేశమందు వైశ్యులీరీతిగా దేవాలయములకు నిత్యమును జరుగు వానికి రాజపోషకులై రంజిల్లుచుండుటచే, పృథ్విపై వైశ్యసంఘము వర్ధిల్లునంతటివఱకును వీరిని దీర్ఘాయురైశ్వర్యసుసంతానములు పతినెడబాయని సతివలె సతత మాశ్రయించి యుండుగాక!

దేవాలయముల వైభవమును నిలబెట్టుచున్న నిర్మలహృదయుని, కార్యదీక్షాపరుని, స్వార్థత్యాగిని, ఆంధ్రమాత సంపాదింపఁగలిగినది. కృష్ణామండలమునకుఁ బ్రధాన నగరంబైన మచిలీపట్టణ వాస్తవ్యులును, న్యాయవాదులును నగు శ్రీ శ్రీ పల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు దేవాలయముల వైభవమును నిలఁబెట్టు పుణ్యాత్ములైరి. దేవస్థానపు ఆస్తులను ధర్మకర్తలపహరింపకుండునట్లు చేయుటయు, అర్చకులను బవిత్రతతో నుంచుటయు, స్వామి కనుదినమును ధూప, దీప నైవేద్యములు యుక్తముగా జరుగు యేర్పాటులు గావించుటయు మున్నగునవి వీరిప్రధానోద్దేశములు. వీరి పరిశ్రమల వలన జెన్నపురి దొరతనమువారీవిషయమున దగిన శ్రద్ధ వహించి రాజధానియందలి గ్రామోద్యోగీయులందరకును దేవాలయముల స్థితి నిగూర్చి తెలియఁబరుపుమని ప్రకటించుచున్నారు. శ్రీ పంతులుగారి యుద్యమమే ఇట్టిమార్పులకు మూలమగుటచే వీరు హిందూసాంప్రదాయము నుద్ధరించుచుఁ జిరకాలము వర్ధిల్లునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుగాక! 38 వ పుటయందుఁ జేర్కొనబడిన హిందూసమాజమువారును, ఆంధ్రలోకమందలి భాండాగారములవారును చదరంగాదులకు విడనాడి దేవాలయముల కేగుచుందురుగాక!

## 37. వేదపారాయణము.

సద్బ్రాహ్మణశేఖరులు తమ తీరికసమయములందు వేదపారాయణమొనరించుట ఆచారము. సమస్తశుభ, పుణ్యసమయములందును

పఠింపఁబడునది వేదము. సంధ్యావందనము వేదమంత్రములతోఁ గూడియున్నది.

ఈ వేదములు భారతీయుల గర్వకారణములై యలరారు. వేదములు నాలుగనియు నవి ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదములనియు ప్రతిహిందూబాలునికిని దెలిసిన విషయము. ఈ వేదము లాదియందు సృష్టికర్తయగు బ్రహ్మచే నుపదేశింపఁబడెనని ఉపనిషత్తులు తెల్పుచున్నవి. ఈ బ్రహ్మములను నేర్పుచు, నేర్చుకొను వారికే బ్రాహ్మణులని నామముకల్గెను. ఈ వేదములు ద్విజత్వము నొసఁగు పవిత్రమంత్రములు. భారతీయుల కర్మలకివి ప్రధానములు. హిందూమతము నింగికెగయ వేసి దానికగ్రస్థానమిచ్చిన తుంగరాజములు. భరతవర్షాధిక్యమునకు మూలములయిన వర్ణాశ్రమధర్మములను నిర్మించిన మంత్రరాజములు. ఇవి, భారతీయుల కర్మలకెల్ల పవిత్రతనొసఁగు ప్రభావముతోఁ దేజరిల్లు ధర్మములగుటచే వారి కిప్పటికయినను నింతకంటె నెక్కువప్రమాణములైన విద్యలింక లేవు

వేదపారాయణ మాయుర్వృద్ధికరమై యొప్పారు. వేదము పఠించునపుడు శబ్దమేగాక, స్వరము కూడ ప్రధానమై యున్నది. స్వరము ప్రధానముగా నెంచుటవలన బ్రహ్మచే నుచ్చరింపబడిన స్వరమును మార్పకుండుటకని తేటపడుచున్నది. స్వరభేద మర్థభేదమును దెచ్చు. వేదోచ్ఛారణము చేయునపుడు స్వరభేదముండినచో, వేదమంత్రములే యర్థమునకై నియమింపబడెనో, ఆయర్థము చెడకుండును. మరియు, స్వచ్ఛమైన వేదస్వరముతోఁ దులతూగువారికి విద్యుచ్ఛక్తితోఁ గూడిన బ్రహ్మవర్చస్సు శరీరమం దుత్పత్తియై దీర్ఘాయువు కల్గును. కఱ్ఱతోఁ గఱ్ఱ రాపాడునపు డగ్నియుత్పత్తియగు తీరున, ఒక ప్రత్యేకవిధమైన స్వర ముచ్చరించుటకై కంఠమందలి నరము లొకదానితో మరియొకటి చేరి చలించునపుడు విద్యుచ్ఛక్తితోఁ గూడిన



నొకమహాశక్తి, ఉత్పత్తియై మేనంతయుఁ బ్రవహించు. ఇదియే బ్రహ్మవర్చస్సు యనఁబడును. వేదాధ్యయనపరు లీ హేతువుచే కండపుష్టి గల జబ్బలతో విరాజిల్లుచు, చిరకాలము వర్ధిల్లుదురు. అట్టివారు స్వచ్ఛముగ వేదస్వర ముచ్చరించుటవలన, హృద్యమైన కంఠస్వరముతో దీపింతురు. ఆరోగ్యవంతులగుదురు. ఈదివ్యమైన వేదస్వర మాకర్ణించుటవలన నుత్సాహముకలిగి, దీర్ఘాయువు లభించును.

వేదపారాయణము, దేశక్షేమమునకును, సకలైశ్వర్యంబులకును మూలసూత్రము. ఈశ్వరకటాక్షము, వేదోక్తాశీర్వచనముచేఁ గల్గును. దయా ధర్మ సత్య శౌచాదులు దేశము నలంకరించును. ప్రభువును, ప్రజలును, అత్యంతమైత్రితో మెలఁగుదురు. జార చోరత్వములు నాశనమగును. ప్రశాంతి దేశమునందు నెల వేర్పరచుకొనును. పాడిపంట లభివృద్ధియగును. భూతాదులును, అకాలమృత్యువును దేశీయులను బీడింపనేరవు. వర్ణాశ్రమధర్మములు గౌరవింపఁబడును. జనావళినిష్కల్మషహృదయులై ప్రకాశింతురు. జీవనదు లధికములగు ప్రవాహములతోఁ గనులపండువు సేయును. దేశీయులు పూనినకార్యము లెల్ల, విజయముతో నెరవేరును. ప్రజ లెట్టి కొఱఁతయు నెఱుఁగక నైశ్వర్యవంతులై, ఉత్సాహముతోఁ నలరారుచు దీర్ఘాయువు నొందుదురని ధర్మము చెప్పుచున్నది.

దీర్ఘాయురైశ్వర్యములకుఁ బ్రధానమైన వేదపారాయణ మీకాలమున నాగరకతాదోషముచే క్షీణించుటవలన దేశమునకు వేదోక్తాశీర్వచనము కలుగకున్నది. భరతవర్షము, 12, 13 పుటలందు వివరింపఁబడిన దైన్యమునకుఁ జిక్కినది. బ్రహ్మక్షత్రియులు దురాచారపరివర్తులైరి. వీరిని జాత్యత్వము పీల్చి, పిప్పిచేయుచున్నది. శ్రోత్రియపు మాన్యము లంతరించుచున్నవి. బ్రహ్మద్వేషము కలిగినది.

వేదపారాయణము చేయు సద్బ్రాహ్మణశేఖరుఁడు పంచనాగ్నివలెనై తేజరిల్లు. ఈతఁడు వేదపారాయణజనితమైన మహాశక్తిచే బ్రాహ్మవర్చస్సుతోఁ బ్రకాశించు బ్రాహ్మణోత్తముఁడై విరాజిల్లు. ఈతని దేహముయొక్క ప్రతిరోమకూపమందును విద్యుచ్ఛక్తి నిండియుండు. పూర్వాచారపరాయణత్వము, ఈతనికిఁ బ్రధానభూషణమై విలసిల్లుటచే దయా ధర్మ సత్య శౌచాదు లీతని నాశ్రయించియుండు. సదాచారసంపన్నత్వమునకు వన్నెకెక్కియుండి, ఈనరోత్తముఁడు నియమముల ననుసరించి స్నాన సంధ్యావందనాదు లొనరించు దీక్షతో వెలుఁగు. ఇట్టి మహానుభావుని దర్శనము సకలకలుషములను బారదోలును; సంతోషమును బుట్టించును; సర్వకార్యములందును, విజయమును సమకూర్చును. ఈతఁడు బ్రహ్మచే నుపదేశింపఁబడిన వేదములతో మూర్తీభవించియున్నందున నీతనికి "వేదమూర్తి"యని సార్థకనామ మయ్యె. ఇట్టి బ్రహ్మాంశాసంభూతుని దర్శించి నమస్కరించినచో బ్రహ్మను దర్శించి నమస్కరించినఫలము కలుగును. కావున నిట్టిమహనీయు ననుదినమును నమస్కరింపవలెనని ధర్మము తెల్పుచున్నది :—

"తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో
దివేదివే నమస్కుర్యాత్"—ఆరణ్యకమ్.

నమస్కారముచేయుటవలన గలుగు నాలుగుఫలితములును (ప్రజ్ఞ, ఆయుర్దాయము, కీర్తి, బలము) 23 వ పుటలో వివరింపఁబడినవి. వేదమూర్తిని నమస్కరించువారి కిందువలన దీర్ఘాయువు కల్గును.

వేదమూర్తి సంతసించి, ఆశీర్వచించునేని అదియే వేదోక్తాశీర్వచనము. ఈదివ్యఫలము, సకలైశ్వర్యముల నొసఁగును. వేదమూర్తితోఁ గూడియుండని శుభకార్యమును, వెన్నెలలేని రాత్రియు, వేళ —నరింపని సంధ్యావందనమును— గొడ్రాలువంటివని బుధులు తె



ల్పుదురు. వేదమూర్తి నానందింపఁజేసి, ఆతని యాశీర్వచనమొందుట సర్వజనకర్తవ్యము; సకలైశ్వర్యదాయకము. ఆతనిని హింసించి, పరిభవించి, ద్రోహము చేయువారికిఁ జేటొదవు. మహమ్మదీయవీరుఁడగు ఘజనీమహమ్మదు, సోమనాథ్ (Somnath) దేవాలయమందలి విగ్రహములను బగులఁగొట్టి వేదమూర్తులను బరిభవించుటచే నాతఁడు డేరాలోఁ బరుండియున్న సమయమున నొక దండుచే హతుఁడయ్యెగాదే! ఔరంగజేబు, హిందువుల ననేకబాధలు పెట్టి, వేదమూర్తులను హింసించుటచే నాతని రాజ్యము క్షీణించి,తలయెత్తలేకపోయెను. టిప్పుసుల్తాను హిందువులను మతభ్రష్టులగావించి వేదమూర్తులను బాధించుటచే నాతఁడు తనవిభవమునంతయుఁ గొలఁదికాలములోఁ బోగొట్టుకొనఁడే. శ్రీ మునగాల సంస్థానాధీశులగు శ్రీ నాయని వేంకటరంగారావు బహద్దరువారు సతతము వేదమూర్తులను సత్కరించు స్వభావముగలవారగుటచే వారు సర్వసంపదలతోఁ గూడియున్నారు. బ్రిటిషు ప్రభుత్వమువారు, ఇండియాలో నడుగిడినది మొదలుకొని నేటివరకును వేదమూర్తులను గౌరవించుచు వారికి మతవిషయమున యథేచ్ఛముగా వర్తింపుఁడని (క్రీ. శ. 1858) అభయమిచ్చుచు వారి కనేకోన్నతోద్యోగములిచ్చుచు వేదోక్తాశీర్వచనమును బడయు దీక్షతోఁ బ్రకాశించుచున్నందున వారి రాజ్యవిస్తారము దినదినాభివృద్ధిగాంచి సూర్యాస్తమయమెట్టిదో యెఱుఁగనంత విస్తీర్ణమై వర్ధిల్లుటకును, వారికిఁ బ్రపంచమును గంపింపఁజేసిన ఐరోపామహాసంగ్రామమందు విజయము చేకూరుటకును, కారణమయ్యె.

ఇట్టి మహాప్రభావముతో నొప్పారు వేదోక్తాశీర్వచనమును భరతవర్షమున వర్ధిల్లువైశ్యులీకాలమున బడయుచు మహదైశ్వర్యముతోఁ దులతూఁగుచున్నారు. ఈసుస్థులు వేదపండితుని వీక్షించినతోడనే బరబ్రహ్మయని ఆతని నెంచుచు, భక్తిపూర్వకముగా నమస్క-

రింతురు. వారిశక్తి ననుసరించి, పిమ్మట అతనిని సత్కరించువరకును వారికిఁదృప్తితీరదు. విప్రపూజాధురంధరులలో నగ్రగణ్యులు, వైశ్యులు; వేదోక్తాశీర్వచము నొందుటకై, సమారాధనములు చేయించుచు వేదవిద్వాంసులకు వార్షికములిచ్చు భారతీయులు, వైశ్యులు; హిందూధర్మయుక్తమైన దానము లొనరించి వేదోక్తాశీర్వచనమునొందు పుణ్యాత్ములు, వైశ్యులు. హిందూమహమ్మదీయసంఘములకు సఖ్యమొనర్చి, వేదమూర్తులను సమ్మానించి, విశేషరాజ్యలాభ మొంది, దయాళువు లని కీర్తిగాంచిన మహమ్మదీయులగు ఫిరోజ్‌షా (Feroz Shah) షర్షా, అక్బరు చక్రవర్తులు భరతవర్షమున నిర్మించిన రాచబాటలపై నిండియున్న అన్నసత్రము లనేకములను బోషించుచు వేదోక్తాశీర్వచనము నొందుచున్న ఆధునిక భారతీయులు, వైశ్యులు; క్రతువులొనరించుటకు ద్రవ్యసాహాయ్యముచేసి, వేదోక్తాశీర్వచనమునొందు ఆధునికులు, వైశ్యులు; విప్రకులజు లనేకులకు విద్యాభ్యాస మొనరించుటకై ద్రవ్య మొసంగి, వేదోక్తాశీర్వచనమును బడయుచున్నవారు, వైశ్యులు; పూర్వాచారపరాయణులను గౌరవించుచు, వేదోక్తాశీర్వచన మొందు దీక్షాపరులు, వైశ్యులు; వైశ్యులిట్టి మహాపవిత్రతతో నతిశయించియుండుటచే, భరతవర్ష మీకాలమున విప్రపూజానిరతులైన వైశ్యరత్నములతో మెరయుచున్నది. కాకినాడనగరములో వర్ధిల్లుచున్న శ్రీ విజ్జపు సత్యానందముగారీరీతిగావర్తించుచుసద్బ్రాహ్మణులచే నాశీర్వచనము నొందు పుణ్యపురుషులు. ఉత్తరహిందూస్థానమందును, చెన్నపురియందును నీరీతిగ వర్తించువైశ్య లనేకులు ప్రకాశించుచున్నారు. గోదావరీమండలమున, అంబాజీపేటయందు హిందూధర్మయుక్తమైన సదాచారములతో నలరారుచున్న శ్రీ అద్దేపల్లి శేషయ్యగారు వేదోక్తాశీర్వచన ఫలానిరతులై తేజరిల్లుచు విప్రపూజ యొనరించుచున్నారు. నాగరకతాభివృద్ధిచే, వృత్తులు, అద్భుతమైన మార్పులొందిన



నీకాలమున సద్బ్రాహ్మణులగు వేదశాస్త్రశ్రౌతపండితావళికి వైశ్యరత్నములు రాజపోషకులై ప్రాచీనహిందూమహాయుగమునందు సూర్యచంద్రవంశ్య క్షత్రియుల స్థానముల నాక్రమించియుండి, మహదైశ్వర్యముతో విలసిల్లుచున్నారు.

వేదశాస్త్రశ్రౌత విద్వాంసులకుఁ దగిన గౌరవముకలుగు పరిస్థితు లేర్పడుచున్నవి. బరోడాగయాక్వారుగారు, వేదముద్ధరించుటకై విశేషధనవ్యయ మొనరించుచున్నారు. బంగాళమందును, కాశ్మీరమునందును వేదము నచ్చటచ్చటి ప్రజలభివృద్ధిచేయుచున్నారు. ఇదికాశీక్షేత్రమందు నూతనబలముతో వర్ధిల్లుచున్నది. బొంబాయిరాజధానియందు బాలగంగాధరుల పరిశ్రమలచే వేదశాస్త్రములుద్ధరింపఁబడి, వర్ధిల్లుచున్నవి. చెన్నపురమునందుఁ దననిలయమేర్పరచుకొని, ఆంధ్రభాష నుద్ధరించుచు, ఆంధ్రశబ్దమున నువ్విళ్ళూరుచు, ఆంధ్రులకు దివ్యజ్ఞాన మొసఁగిన శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారి స్వార్థత్యాగమువలన నాంధ్రులు వేదశాస్త్రముల నుద్ధరించుచున్నారు. చెన్నపురియందు సంస్కృతకళాశాలలు వర్ధిల్లుచున్నవి. తెనాలిపురమం దొకటి వృద్ధినొందుచున్నది. విజయనగరసంస్థానాధీశులు వేదశాస్త్రపాఠశాల నొకదానిని నెలకొల్పిరి. గోదావరి నదీతీరంబున, గౌతమమునీంద్రుని యాశ్రమంబై, కొవ్వూరుయని వాడుకలోనున్న గోవూరుగ్రామమందుస్వార్థత్యాగులైన శ్రీతల్లాప్రగడ సూర్యనారాయణరావుగారియెడతెగనికృషివలననాంధ్రగీర్వాణవిద్యాలయము స్థాపింపఁబడి మిక్కిలి యభివృద్ధిలోనున్నది. ఆంధ్రమండలమందలి వేదాదివిద్వాంసులు ప్రతివత్సరమును, పుష్యమాసమందు నీవిద్యాలయభవనమున కేతెంచి వేదోక్తాశీర్వచన మొసఁగి తమ వార్షికములను మహాసభయందు గైకొందురు. ఇచ్చట 1922 జనవరినెలలో ప్రథమవిద్వత్పరీక్షలు జరిగినవి. కృష్ణామండలమందు వర్ధిల్లుచున్న బెజవాడ

పురవాసులుకూడ ప్రతివత్సరమును వేదపండితులను సత్కరించుచున్నారు. ఈమండలమందు వాణిజ్యమున నగ్రస్థానము వహించియున్న పాలకొల్లు పురవాసులు ప్రతిసంవత్సరమును ముక్కోటియేకాదశి నాఁడు గొప్ప ఉత్సవముచేసి వేదశాస్త్రశ్రౌతవిశారదుల యాశీర్వచనమొంది వారికి భక్తితో వార్షికము లొసఁగుదురు. విద్యాదానమన నమృతప్రాయముగా నెంచుచు ఆంధ్రుల యమూల్యరత్నమై విలసిల్లుచున్న పీఠికాపురసంస్థానాధీశులగు శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు మహారాజాగారు వేదశాస్త్రపరీక్షల నేర్పాటుచేసి, ఘనాంతస్వాధ్యాయవేత్తలును, వేదార్థము నెఱింగింపఁగల సమర్థులునగు బ్రహ్మశ్రీ వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారిని బరీక్షాధికారిగా నియమించి పండితులచే వేదోక్తాశీర్వచనము నొంది వారికి వార్షికములిచ్చు రాజేంద్రులై ప్రసిద్ధిగాంచుచున్నారు. ఈవిషయములను బరీక్షించినచో దేవసాన్నిధ్యమును స్ఫురింపఁజేయుచు, దయాధర్మాదులతోఁ దులదూగుచు పూర్వాచారములకు మార్గదర్శకులై అల్పసంఖ్యాకులైయున్న వేదమూర్తులు యిక్కాలంబున గౌరవింపఁబడుచున్నట్లును, భారతజాతీయ విద్యాసౌధముయొక్క కిరీటమైన వేదము, నవశక్తితో వర్ధిల్లుచున్నట్లును తెలబడుచున్నది.

## —* 38 తీర్థయాత్రలు. *—

ప్రాచీనకాలమునుండియు భారతీయులు తీర్థయాత్రలు చేయుట వారికి సత్కాలక్షేపమై యున్నది. ఈయాత్రలు, సకలజనులకును శాంతి నొసఁగు పుణ్యకార్యములు; దుఃఖసముద్రమునుండి దాటించు పాగయోడలు; వైరాగ్యమును బోధించుయాగములు; ఆనందస్వరూపుఁడగు పరమేశ్వరుని ధ్యానమునకుఁ దెచ్చి, ఉత్సాహమును బుట్టించు క్రతువులు; పూర్వాచారములం దభిమాన ముదయింపఁజేయు ఆయుధములు; అపజయ, అపమృత్యువులను ఖండించుశస్త్రశ్రేష్ఠములు; దీర్ఘాయురైశ్వర్యంబులకు మూలసాధనములు.



తీర్థయాత్రలీరీతిగా దీర్ఘాయువు నొసఁగును.:—

1. తీర్థయాత్రలకు నడచిపోవుటవలన నారోగ్యమేర్పడి, దార్ఢ్యముకల్గి, ధైర్యస్థైర్యములలవడి, దీర్ఘాయువు కల్గును.

2. యాత్రాపరులు స్నానపానాదుల కుపయోగించు జలముయొక్క గుణవిశేషములచే, దీర్ఘాయువు లభించు.

3. వీరనేకస్థలములకేగి, వివిధములైన శీతోష్ణములకు లోబడుటచే, ఆరోగ్యమునొంది, దీర్ఘాయువు సాధింపగలరు.

4. దేశమందనేక వింతలు గోచరించుటచే, తీర్థయాత్రికులుత్సాహవంతులై, క్లేశమునుజయించి, దీర్ఘాయువు నొందుదురు.

5 తీర్థయాత్రలు లోకానుభవముకల్గించి సద్వర్తనసత్సాంగత్యములను గూర్చి, దీర్ఘాయువును లభింపఁజేయును.

6. తీర్థయాత్రలకేఁగువారు దేవాలయములకేఁగుదురు. అందువలన దీర్ఘాయువు నొందుదురు.

7. వీరు, తీర్థస్థలములనుండి దెచ్చు ఆటవస్తువులు, కలశములు మున్నగువానిని గృహమునందలంకరింతురు. అనుదినమునవి, ఆ యా దేవతాస్వరూపములను స్మరణకుఁదెచ్చి, ఆత్మబలమునొసఁగి, దీర్ఘాయువు నొసఁగును.

8. తీర్థములందు జలకమాడుటవలన పితృదేవతలయాశీర్వచనముకలిగి, దీర్ఘాయువు ప్రాప్తించును. దివ్యమైన (యాత్రా) స్థలము, శాకమున్నగునవి పితృదేవతలకుఁ బ్రీతికరమని హిందూధర్మము చెప్పుచున్నది. కావున 98 వ పుటయందుఁ బనసకాయనుగూర్చి, అట్లు తెల్పియుంటిమి.

షష్ఠమ భాగము.

సమాప్తము.

---

శ్రీ

శుభమస్తు

# హిందూ ధర్మపునరుజ్జీవనము.

# REVIVAL OF HINDU DHARMA.

## సప్తమ భాగము.

---

### వివిధ విషయములు.

ఈభాగమున హిందూసాంప్రదాయములైన పలువిషయములు చర్చింపఁబడియున్నవి. వానినాచరించు పూర్వాచారపరాయణులు దీర్ఘాయువు నొందుదురు.

---

### —* 39 ఆయుర్వేదము. *—

మానవశరీరమునుముట్టడించుసమస్తరోగములకును ప్రతిక్రియలను వివరించు ఆయుర్వేద మాదియందర్వేసీదేవతలు భారతీయుల కుపదేశించిరి. ఇది, భారతీయుని ఆయుర్దాయమును రక్షించు మార్గములను విపులముచేయు మహాధర్మమగుటచే, "ఆయుః" "వేదము" అను పదముల సమ్మేళనముతోఁ గూడినదైయున్నది. ఈవిద్యయందుఁ బ్రాచీనకాలమందు వర్ధిల్లిన ఋషిపుంగవులు అద్భుతమైన పరిశ్రమ లొనరించిరి. వారు రచించిన గ్రంథరత్నము లన్నియు సంస్కృతభాషయందే కలవు. ఈభాష క్షీణించుటవలన నీవిద్యయొక్క మహిమము నాగరకతాదోషంబున భారతీయులు గ్రహింపక, అల్పాయువునకుఁ జిక్కు మార్గము లేర్పడినవి.

జాతీయవైద్యావిధానమైన ఆయుర్వేద మీరీతులచే భారతీయులకు దీర్ఘాయువును బ్రసాదించును:—



1. దేవతలచే నుపదేశింపఁబడిన మహాధర్మమై తేజరిల్లుటచే నాయుర్వేదము, పవిత్రతామహిమములతోఁ దులతూగుచున్నది. ఈ వైద్యావిధానము నాశ్రయించువారికి దేవతల యాశీర్వచనము కలిగి, దీర్ఘాయువు లభించును.

2. ఆయుర్వేదౌషధములు, భరతవర్షమందే పెరిగినమూలికలనుండి తయారగును. ఏదేశమునందు ఫలించు ఆహారపదార్థము లా దేశస్థుల కారోగ్యదాయకము లగునట్లు, భరతవర్షమున బెరిగిన మూలికలు భారతీయుల రోగముల నతిత్వరలో జయించి, ఆయుర్వృద్ధికరములై వఱలు.

3. ఉష్ణదేశీయులైన భారతీయులకుఁ ద్వరలో వీర్యనష్టమును జయించి వీర్యవృద్ధిచేసి శరీరమునకు బలలావణ్యముల నీ ఔషధములే యొసఁగును.

4. ఆయుర్వేదౌషధముల పట్టు (శక్తి) చిరకాలము నిలువఁబడియుండుటచే, సుస్థిరమైన ఆరోగ్యములభించి, వీనినుపయోగించుభారతీయులకు దీర్ఘాయువుకల్గును. ఈదివ్యౌషధములశక్తి తాటియాకుమంటవలె నెప్పటికప్పుడు చల్లారనేరదు. ఈవిషయము వైద్యశాస్త్రజ్ఞులు ధృవపఱచుచున్నారు. పెక్కండ్రిభారతీయులకిది స్వానుభవము.

5. సులభమూల్యమునకు లభించు మూలికలనుండి ఈ ఔషధములు తయారగుటవలన, నిరుపేదలు సహితము, వైద్యచికిత్సనొందగలరు; వారిరోగములు జయింపబడును; ఆయుర్దాయమురక్షింపబడును.

6. ఆయుర్వేదౌషధములు విశేషపుఘాటుతోఁ గూడియుండి ఎప్పటికప్పుడు తయారైన పాను, మిరియములు, శొంఠి, అల్లము మొదలగువాని రసములతో సేవింపఁబడి, రోగములను జయింపగలవు. నిలువయుంచబడిన మూలికసారములు, ఆయుర్వేదౌషధముల కుపయోగింపఁబడు అనుపానములతోఁ దుల్యములు కానేరవు. ఆయుర్వే

దౌషధము లిందువలన, దీర్ఘకాలమారోగ్యమును రక్షింపఁగలవు.

7. ఈవైద్యావిధానము ధర్మశాస్త్రవిరుద్ధమైన చెడుపదార్థములను స్వీకరింపనీయదు. ఇందువలన బుద్ధిబలము నిర్మలమైయుండును. చిరకాలమునుండియు నాయుర్వేదవిధానముల ననుసరించిన భోజనపదార్థముల నారగించువారి సంతతియగుటచే, హిందువులు, ధర్మగుణశీలురై, కుశాగ్రబుద్ధితో వెలుఁగుచున్నారు. వీరికిఁగల సూక్ష్మగ్రాహ్యము వలన మెదడు శ్రమనొందనేరదు. ఆయుర్వృద్ధికల్గును.

8. ఈవైద్యావిధానమందు సూక్ష్మముగా రోగనివారణము చేయు గోసాయిచిటికెలుకలవు. వీనిప్రభావమువలన పురాతనరోగములు సహిత మొక్కత్రుటిలో శరీరమునుండి తొలగును; దీర్ఘాయువు కల్గును. గోదావరిజిల్లాలో వశిష్టానదీతీరంబున ఘనాంతస్వాధ్యాయవేత్తలచే పావనముచేయఁబడిన "కానూరుఅగ్రహారము" పొంతనున్న తీపఱ్ఱుగ్రామము, ఈచిటికెలయందుఁ ప్రవీణుఁడైన "శివలపల్లు"అను నాతనికి వాసస్థలమైయుండె.

9. ఈవైద్యశాస్త్రవేత్త, రోగులను దత్వభేదముకల్గించు కాఫీపానమును జేయనీయనొల్లడు. రోగవిముక్తులైన వారీహేతువుచే సుస్థిరమైన ఆరోగ్యముతో దీపింతురు.

10. ఆయుర్వేదవిద్వాంసుఁడు నాడీజ్ఞానపరిపూర్ణుఁడై తేజరిల్లు. ఈవైద్యుని కంకుశము, నాడీజ్ఞానము. ఈతనివృత్తికిదియే వెన్నెముక. ఈతనివైద్యప్రాబల్యమునకు నాడిపరీక్షాచతురతయే పరమరహస్యము. ఏవైద్యునికీనాడీజ్ఞానము మెండుగానుండునో, ఆతనివైద్యశాల కిటకిటలాడుచుండును. ఏవైద్యునికియ్యది పూజ్యమో, ఆతడీవృత్తియందు విముఖుఁడై విజయమునొందజాలడు. ఏవైద్యునికీజ్ఞానము విశేషముగాగలదో, ఆతఁడు క్షణమాత్రములో రోగమును జక్కఁగాగుర్తింపసామర్థ్యముకలవాఁడై, పుండుగలచోట వాతఁబెట్టురీతిని, రోగమునకర్హమైన



చికిత్సచేసి ఆయుర్దాయమును బ్రసాదించును. ఆయుర్వేదమీజ్ఞానమును విపులముగా బోధించును. కావున నీవిద్వాంసుఁడుత్వరలో పురాణజ్వరములను, వాతపైత్యపుత్రిప్పులను నివారింపఁజేసి, దీర్ఘాయువునొసఁగును.

11. ఈపండితశేఖరుఁడు పూర్వాచారములతోఁ దులతూగుచు రోగులకుత్సాహము నొసఁగుచుండును. ఈతఁడు సాధారణముగా హిందువుఁడై, ధర్మయుక్తమైన తనమతాచారము లాచరించుదీక్షతోఁ దేజరిల్లు. విభూతిపిండికట్లతో, సిరిచూర్ణనామములతో, శాస్త్రోక్తమైన వస్త్రధారణముతో, హిందూధర్మయుక్తమైన శిరోజపుంజముతో నీతఁడు సాంబమూర్తి, శ్రీమహావిష్ణువులను స్ఫురింపఁజేయుచు గౌరవమును బడయును, వశీకరణశక్తితో వెలుంగుచుండు. ఈతని మేనంతయుఁ బ్రాణవాయువుతో నావృతమైయుండ, రోగులీతని వేషభాషలు తిలకించి, ఉత్సాహవంతులగుదురు. ఈదివ్యమూర్తి హిందూగృహములం దత్యంత చనువుతో వర్తించుచు నారీరత్నములను పుత్రికావాత్సల్యముతో, సోదరీభావముతో, మాతృప్రేమనుమించిన దయార్ద్రహృదయముతో నాదరించు. ఈతఁడుత్సాహదాయకములైన పల్కులాడుచు, రోగికారోగ్యమును బ్రసాదించును. ఇన్నిసుగుణముల కాలవాలమై యుండుటచే నితనియందుఁ గర్మిష్ఠులకును, పూర్వాచారపరాయణులకును నత్యంతగౌరవము జనించును.

ఆయుర్వేదౌషధములతో రోగనివారణము గావించువారెల్లరు నాయుర్వేదవైద్యులుకారు. ఈపవిత్రమైన విద్యయందు దారితేరిన చక్కని అనుభవశాలులే నిజముగ నాయుర్వేదవైద్యశేఖరులు. వీధులందు సంచరించుచు, హస్తములను స్పృశించుచు కపటముగు వర్తనము కలవారు, ఆయుర్వేదముయొక్క ఘనతను జెఱచువారగుదురు. ఇట్టిశాస్త్రపరిజ్ఞానశూన్యుల మూలముననే ప్రభువర్యులగు బ్రిటిషుదొరతనమువారు పరిపథమున నాయుర్వేదమును నిర్లక్ష్యముతో భావించుచుండిరి.

ఈ కాలమున బరిస్థితులు మార్పునొందుచున్నవి. పాశ్చాత్యవైద్యావిధానమం దభిమానములైన ప్రభుత్వము వారికిఁగూడ ఆయుర్వేద మన నత్యంతగౌరవము కలుగుచున్నది. అధునికు లాయుర్వేదగ్రంథములను వృద్ధిలోనికి దెచ్చుచున్నారు. వానియుత్కృష్టతను గ్రహింపగల్గి ఆయుర్వేదకళాశాలలను, వైద్యశాలలను నెలకొల్పుచు దేశీయులెల్లరను నీమహాశాస్త్రముయొక్క ఘనతనెఱింగించుచున్నారు. ఆసేతుహిమాచలదేశమందు సంస్కృత మభివృద్ధిలోనున్న ఆర్యావర్త దేశము మొట్టమొదట ఆయుర్వేదరంగముపై ధ్వజమెత్తెను. కలకత్తాలో "కవిరాజు" లు బయలుదేరి శాస్త్రోక్తమైన దివ్యౌషధములను దయారు చేయుదొడంగిరి. జాతీయకళాశాలలను నెలకొల్పసాగిరి. రాష్ట్రమందు "ఆయుర్వేదవిశారదు" లను బ్రతివత్సరమును భరతవర్షమున కొసంగుచున్న "ఆయుర్వేదవిద్యాపీఠము" స్థాపితమయ్యెను. కాశ్మీరము, పంజాబువంటి పశ్చిమోత్తరదేశముల మీఁదకుఁగూడ ఆయుర్వేద జ్వాల ప్రసరించినది. పశ్చిమహిందూదేశమందు మహారాష్ట్రదేశములు ఆయుర్వేదగ్రంథములతో, పండితులతో, ఔషధములతో మున్నిగియున్నవి. గుజరాతు, బరోడాదేశములు ఆయుర్వేదము నత్యంత పూనికతో వృద్ధిజేయుట ప్రారంభించినవి. ఈరీతిగా భరతవర్షమందెల్లెడలను మిన్నుముట్టునట్లెగయుచున్న ఆయుర్వేదతరంగముల అదటు, ఆంధ్రమాతయొక్క సుతునకు సోకినది. ఆయుర్వేదభిషఙ్మణి వైద్యరత్నపండిత. డి. గోపాలాచార్యులవారు, గొప్పపరిశ్రమ లొనరించి, ఆయుర్వేదమందుఁ బ్రవీణులై చెన్ననగరము చేరి, ఆయుర్వేదాశ్రమము స్థాపించి, ఈమహావిద్యకు దక్షిణహిందూస్థానమందు దిట్టమైన పుట్టకోటువేసెను మద్రాసునందలి వైశ్యరత్నములకుఁ నాయుర్వేదము యెడల నభిమానముదయింపఁజేసె; వారిద్రవ్యసాహాయ్యముతో నాయుర్వేదశాశాల నొకదానినచ్చటనే నిర్మింపఁజేసె; ఆంధ్రదేశమందలి



యువజనుల నచ్చటికాకర్షించుచు, ప్రతివత్సరముచు దక్షిణహిందూస్థానమునకుఁ బండితుల నర్పించుచు, దేశసేవ యొనరించుచు, తనస్వశాఖవారగు "వైఖానసు" లకు శాశ్వతకీర్తిఁదెచ్చి, దివికేఁజనెను. ఈ ఆంధ్రపుత్రుని ముద్దుబిడ్డయైన చెన్నపురాయుర్వేదకళాశాల నభివృద్ధికలుచుటకును, ఆయుర్వేదము నుద్ధరించుటకును, ఆంధ్రభాషాభిమానుండును, వైద్యశిఖామణియునగు శ్రీఆచంటలక్ష్మీపతిగారు ఆయుర్వేద క్షేత్రము నలంకరించిరి. కన్యాకుమారి అగ్రముమొదలు కటకమువఱకునుగల దేశీయులత్యంతోత్సాహముతో వీరికి స్వాగతమిచ్చిరి. వీరు ప్రభుత్వమువారిచే నాయుర్వేదము శాస్త్రీయవిధానమని ఒప్పించుచున్నారు. ప్రభుత్వమువారు, వైద్యశాలలు నెలకొల్పని తావులకు నాయుర్వేదపండితులను వేతనములిచ్చి పంపుచున్నారు. శ్రీలక్ష్మీపతిగారు దేశీయులందఱకును శాస్త్రోక్తమైన ఔషధములను లభింపఁజేయుటకై చెన్నపురియందాయుర్వేదఫార్మసీ నొకటిస్థాపించిరి. ఆంధ్రలోకమందు వర్ధిల్లుచున్న సంస్థానాధీశులలోఁ గరిష్ఠులును, పూర్వాచారపరాయణులును, విప్రపూజానిరతులును, వేదోక్తాశీర్వచనఫలాపేక్షులును, మునగాలసంస్థానాధీశులునునగు శ్రీశ్రీనాయని వేంకటరంగారావు బహద్దరువారు, ఈఫార్మసీకి డైరక్టరులై, లక్ష్మీపతిగారికిఁ జేయూతనిచ్చుచుండుట మిక్కిలి సంతోషకారణము. కర్నాటకములో బురపాలకసంఘము లనేకములు, ఆయుర్వేదవైద్యశాలలను నెలకొల్పుచున్నవి. తిరుచనాపల్లి, సేలం, గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం మొదలగు స్థలము లీవిషయమున ముందంజవేసినవి. దేశమందెల్లెడల నాయుర్వేదమహాసభలు జరుగుచున్నవి. శ్రీలక్ష్మీపతిగారికిఁ బ్రాణమిత్రులైన డాక్టరు గండికోట శ్రీనివాసరావుపంతులుగారు రాజమహేంద్రవరమున వర్ధిల్లుచున్న వృద్ధపితామహులవంటి ఆయుర్వేదశేఖరులతో నేకీభవించి గొప్పప్రచార మొనరింపఁ గంక

ణము కట్టుకొనిరి. "ధన్వంత్రీ సమాజము" వీరిప్రోత్సాహమువలన నీ నగరమున స్థాపింపఁబడి, ఆయుర్వేదము నుద్ధరించుచున్నది. 1922 వ అగష్టునెలలో జరిగిన అఖిలభారతాయుర్వేదసమ్మేళనము విజయముతో జరుగుటకు శ్రీనివాసరావుగారే మూలకారకులు. మైసూరురాష్ట్రము, కే. శేషశాస్త్రిగారితో మెఱయుచున్నది. సంయుక్తరాష్ట్రమునకు, ఉమాచరన్ భట్టాచార్యులు వారలంకారులై యున్నారు. జయపూరు సంస్థానము లక్ష్మీరామస్వామి ఆచార్యులవారితో విఱ్ఱవీగుచున్నది; వంగదేశము, మహామహోపాధ్యాయ హారాణచంద్రచక్రవర్తిగారితో నలరారుచున్నది. హైదరాబాదునగరము, హాకీంహరిగోవిందుగారితోఁ బ్రఖ్యాతిఁ బడయుచున్నది. "కోనసీమ"ఖండమందు దేజరిల్లుచు "విటప్రియ" మొదలగు దివ్యౌషధములను దయారుచేసి సర్వరోగసంహారవైద్యశాలను స్థాపించి, అంబాజీపేటయందు వర్ధిల్లుచున్న భిషగ్వర కొర్లపాటి వీరస్వామినాయుడుగారు రాజోలు అమలాపురం తాలూకాలలో నాయుర్వేదమునందగ్రగణ్యులై వెలుఁగుచున్నారు. భారతీయులెల్లరకు నరఖులను స్వీకరించుటయందు విరక్తిపుట్టినది. తలనొప్పిగానున్నచో వీరు శిరోగంధ ముపయోగించుచు, జ్వరమంకురించినయెడల, ఆర్ద్రికరసానుపానాదులతో మాత్రలను మ్రింగుచున్నారు. ఈరీతిగా నశ్వినీదేవతాప్రసాదితమై, పూర్వాచారపరాయణులకుఁ బ్రీతికరమై, భారతజాతీయవైద్యవిధానమైన ఆయుర్వేదము పునరుజ్జీవన మొందుచున్నది.

## —♦ 40 వంట ఆముదము ♦—

పూర్వకాలమునుండియు హైందవపడతులు, గృహములందు నాముదమును దయారుచేయుచు, దానిని గృహకృత్యముల కుపయోగించుచు, దీర్ఘాయురైశ్వర్యములను సాధించుచుండిరి. ఈకాలమున ఫాక్టరీ ఆముద మీాదిగువఫలితములను జెఱచుచున్నది.



ఆముదపుగింజలనుండి చక్కని పరిమళము, వంటఆముదము తయారగునపుడు బయల్వెడలును. ఇది దుర్గంధముల నణచును; అంటురోగోత్పత్తికి నెడమీయదని వైద్యులు తెల్పుదురు. ఆముదపుగింజలను స్త్రీలు త్రొక్కునపుడు వారికిఁ జక్కని దేహపరిశ్రమ గలుగును. జబ్బబలము వృద్ధినొందును. సుకుమారమంతరించును; మితమగు సంభోగవాంఛమాత్రమే యుండును; సుసంతానము కలుగును. స్త్రీలీకాలమున నిట్టిదివ్యఫలితములకు మూలమైన వంటకముదమును దయారుచేయక నతిసుకుమారులై, జారత్వజాడ్యపీడితులగుచున్నారని ఆయుర్వేద పండితులు విశదీకరింతురు.

వంటఆముదము శిశువుల కాయుర్వృద్ధికరము. ఇందు నైట్రోజిన్ వాయువుకలదనియు, అవిసరములను దయారు (Tissue building) చేయుట కత్యావసరమనియు, సమశీతలత్వమును గల్గించి మేహశ్లేష్మాదులను దరుముననియు, దుష్టరక్తమును బయల్వెడలించి, మలబద్ధము నణచి, చక్కనిజఠరమును గల్గించి, రక్తమును శుభ్రపఱచి, జలమొసంగుటచే శిశువు లపమృత్యువునకు జిక్కరనియు నాయుర్వేదనిపుణుల అభిప్రాయము. ఇట్టిశిశువులనరములు విశేషబలముతో నొప్పారుచుండుటచే వారు దీర్ఘకాలము జీవింతురు. ఫ్యాక్టరీఆముదము మేహశ్లేష్మముల నభివృద్ధిచేయు రాకసి. దీనినుపయోగించుటవలననే శిశువులకు మేహాదిరోగము లభివృద్ధియై, వారల్పాయుష్మంతులగుచున్నారు. సంతానముతోఁ దులతూగుచు కలకలలాడుచుండగోరు హిందూజనని వంటాముదమునే తనశిశువుల కొసఁగుట కర్తవ్యము.

ఆముదపుదీపము, ఆరోగ్యైశ్వర్యములనొసఁగు. ఈదీపము సమశీతలత్వముగా నుండును. దీనికాంతి విశేషతీవ్రముగానుండదు. దీని మసికూడ, యిట్టిగుణములుకలదై, కాటుకకుపయోగపడుటవలన నేత్రరోగములు నిర్మూలమగును. నేత్రములనీకాటుకతో నలంకరింపక

ఆధునిక నాగరికులు, చత్వారపీడితులై, నేత్రములకు సులోచనములతో నలంకరించుచున్నారు. ఈఆముదపుదీపముల దీప్తితో నీకాలపువైశ్యులును, సేద్యగాండ్రును, పూర్వాచారపరాయణులును నుపయోగించుచు, ఐశ్వర్యమనుభవించుచున్నారు. ఇట్టిఫలితములు కిరసనాయిల్ దీపము లీయజాలవు. ఈదీపము దృష్టిబలమును క్షీణింపఁజేయును. కండ్లకు వేడిమి నొసఁగును. ఆముదపుదీపమువలె కంటిరోగములను దునుమ జాలదు. ఈదీపమునందు గృహముల కంటుజాడ్యములు త్వరలో జేరును.

## 41 శయ్యాగృహము.

హిందువులు శయనించుప్రదేశము నిర్మలమైయుండుట ప్రధానము. ప్రాణవాయువు చక్కగా ప్రవేశించునట్లును, దుర్వాయువు తొలగునట్లును గవాక్షము లీగృహమును జేరియుండవలెను. ఇచ్చట అనారోగ్యకరమై, అంటురోగముల నుత్పత్తిజేయుచు, నేత్రములకు మహోష్ణత నొసఁగుకిరసనాయిల్ దీపము నుంచరాదు.

ఈదీపమును శయ్యయొక్క తలవైపుదెసయందుంచుటవలన దీపముయొక్క వేడి శిరస్సునకుసోకి, రోగములను బుట్టించును. బుద్ధిబలమును జెఱచును. మఱియు, ప్రమాదవశమున నీస్థానమందుండుదీపము శిరస్సుపైబడి, విపత్తునకు హేతువగును.

శయ్యపై నిర్మలవస్త్రము పఱచుట కర్తవ్యము. ఒరులుపరుండు శయ్యపై పరుండువారికిఁ జర్మరోగములుకలుగును. నల్లులుండుమంచముపై పరుండినచో రక్తక్షయముకల్గును. అంటురోగము లభివృద్ధినొందును. అనుదినమును పరిశుభ్రమైన శ్వేతవస్త్రమును శయ్యపై పరచుట ఆరోగ్యదాయకమై యొప్పారు. ఏకశయ్యపై నొకరికంటె నెక్కువజనులుపరున్నచో, అంటురోగోత్పత్తియై, దీర్ఘాయువు చెడును. దంపతులు, వేర్వేరుశయ్యలపై పరుండుటవలన వారు యుక్తకాలములందే మోహబుద్ధికలవారై దీర్ఘాయువు నొందుదురు.



శయ్య చక్కనిమంచముపై నుండుట ముఖ్యము. ఈమంచము ఎత్తుగానున్నచో, ప్రాణవాయువు శరీరమునకు సోకును; సర్పములు, వృశ్చికములు మొదలగునవి హింసింపజాలవు; దుర్వాయువు నాఘ్రాణించు అవకాశము అట్టివారికిఁ గలుగనేరదు. ఈనియమము లన్నియు దీర్ఘాయువును లభింపఁజేయును. విరిగినట్టియు, సాపులేనట్టియు మంచములపై పరుండరాదనియు, కాలినమంచమందుగాని, మఱ్ఱి, నేరేడు, జువ్వి, రావి మేడి కఱ్ఱలతో దయారైన మంచములందుగాని శయనింపఁగూడదనియు, శత్రువులు, బాలురు వీరిమధ్యమందుగాని ధాన్యమందుగాని, అగ్నికిని, ఆవులకును, గురువులకును మీదభాగమందుగాని శయనించుట ధర్మవిరుద్ధమని పరాశరస్మృతి బోధించుచున్నది.

శిరోభాగము, ఉత్తరపుదిశగా నుండుటవలన దీర్ఘాయువు చెడును. ఉత్తరదిశయందున్న ధృవము (North Pole) అయస్కాంతపు శక్తితో గూడియున్నది. ఈశక్తి మానవుని శిరోభాగమందలి విద్యుచ్ఛక్తిని నాకర్షించి, తేజోవిహీనతను గల్గించి, అల్పాయువును బ్రాప్తింపఁజేయును.

"స్వగృహే ప్రాక్ఛిరస్స్యాత్తు, శ్వశురగృహే
దక్షిణాశిరః ప్రవాసే ప్రత్యక్ఛిర నోత్తరమ్ నకదాచన"—గౌతమసూత్రం

శయ్యయొక్క తలవైపు స్వగృహమందు తూర్పుదిశగా నుండవలెననియు, అత్తవారింటియొద్ద శయనించునపుడు దక్షిణదిశగా నుండుట కర్తవ్యమనియు, తదితరస్థలములు (సంచారముచేయు సమయములందు) పశ్చిమదిశగానుండుటయే శ్రేయస్కరమనియు, ఉత్తరపు దిశగా నెచ్చటను నుండఁగూడదనియు, భావము.

పురుషులు శయనించునపుడు, ఎడమపార్శ్వమున కొరిగి పరుండుట ఆరోగ్యకరమనియు, స్త్రీలు కుడిపార్శ్వమున కొరిగి పరుండుట శ్రేయస్కరమనియు, నాయుర్వృద్ధికరమనియు, వ్యాయామశాస్త్ర

జ్ఞులును ఆంధ్రమండలమున 5, 6 వేల పురుషులచే మంజీ (37, 38, పుటలు) ధారణముచేయించి, గోదావరి హిందూసమాజముపక్షమున చాటుపడుచు, హిందూసాంప్రదాయము నుద్ధరించుచున్న శ్రీ ఏలూరి శ్రీరామచంద్రరావుగారు విశదీకరించుచున్నారు.

శయ్యాగృహము, సువాసన వెదజల్లుచుండవలెను. హిందువులిందుకై, అగరువత్తులు, మంచిగంధము, పన్నీరు మొదలగువాని నుపయోగింతురు. ఈసువాసన ఉత్సాహమునొసఁగి సుఖనిద్రను గల్గించును.

శయ్యాగృహ ముత్సాహముఁబుట్టించుచుండు దేవతాదుల పటములతో నలంకరింపఁబడి యుండవలెను. దంపతుల కిందువలన నట్టి దివ్యస్వరూపములందు మనస్సు లీనమగును. సుసంతానము కలుగును. పురుషుఁడు, గుణవతియై, సౌందర్యవతియై, ఆరోగ్యముతో నలరారుచు, ఆభరణాదులతో హిందూధర్మయుక్తముగా నలంకృతయైన సద్భార్యతో శయనించుటవలన నాయుర్దాయముతో దీపించు సుసంతానము కల్గును.

రాత్రిపూట శయనించుటకుఁబూర్వము తాంబూలము స్వీకరించుట గృహస్థు లెల్లరకు నుత్సాహకారణము. క్షీరము స్వీకరించిన పిమ్మట 45 నిముషములు గడచువఱకును వేచియుండి, పిమ్మట తాంబూలము వేసికొనవలెను. ఈకాలములోగా దాంబూలము నుపయోగించుటవలన నది విషతుల్యమగునని వైద్య, ధర్మశాస్త్రములు తెల్పుచున్నవి.

నిద్రించుటకుఁ బూర్వము పరమేశ్వరధ్యానము చేయుట ప్రాచీనాచారము. ఇది, సుఖనిద్రకుఁ బ్రధానము. దుస్స్వప్నములను ఖండించు ఖడ్గము. భూతాదులవలన భీతికలుగకుండునట్లు కాపాడు వజ్రకవచము. దీర్ఘాయుఃక్షేత్రమునకు నిదానమైన సూక్ష్మమార్గము.



## — 42. హిందూ వివాహము, సుసంతానము. —

హిందూవివాహము శాశ్వతమైన సంబంధమును గలిగించును. ఈబంధము తల్లి, తండ్రి, సోదరి, సోదరుఁడు మున్నగు బాంధవ్యములను విధించును. పశుసాంప్రదాయమైన జారత్వమును దూరముగా బారదోలుటయేగాక, హిందూదంపతులకు సుస్థిరమైన బాంధవ్యము నొసఁగుచున్నది. హైందవేతరులనేకులు వివాహసంబంధ మస్థిరమైనదనియు, దంపతుల కిచ్చవచ్చినపుడు చెడగొట్టుకొన వీలుకలిగినదనియు, వ్యవహారపు ఒడంబడిక(Civil contract) వంటిదనియు నెంతురు. వారియందు నిందువలన దంపతులు విడనాడుకొను ఆచారములును, న్యాయములును గలవు. హిందూసంఘమునకుగాని, న్యాయశాస్త్రమునకుగాని దొల్లిటినుండియు నట్టిపద్ధతులు నస్పృశ్యములు. హిందూవివాహము జరిగిన తరుణము మొదలుకొని తరతరములవఱకును దాని బంధము సుస్థిరమైయుండును.

హిందూవివాహ మిట్టిఘనతతోఁ దేజరిల్లుటకుఁ బ్రధానకారణము దానికిఁగల పవిత్రతయే. హిందువులందు విశేషముగా వ్యాప్తిలోనున్న వివాహపద్ధతి, పవిత్రతతో నెన్నుకొనబడు "బ్రాహ్మవివాహ"మై యున్నది. ఇందు సాలంకృతకన్యాదానము జరుగును; అగ్నిసాక్షిగ పెండ్లి జరుగును. వధూవరులు శ్రేష్ఠమైన వేదోక్తాశీర్వచనమును బడయుదురు. గ్రహబలయుతమైన లగ్నమందే ఈవివాహ మత్యంత వైభవముతో బంధుమిత్రుల సాన్నిధ్యమందు జరుగును. హిందూదంపతుల బాంధవ్య మిందువలన పవిత్రతతో నలరారుచున్నది.

హిందువులు వివాహమువలనఁగోరు ప్రధానఫలితము వంశాభివృద్ధిగాని, క్షణభంగురమైన మోహసుఖము కాదు. భారతీయులు వంశాభివృద్ధికై దానధర్మములు చేయుదురు; పుణ్యకార్యముల నత్యత

దీక్షతో నొనరింతురు; తీర్థయాత్రలు సేవింతురు; ఘోరతపంబు లాచరింతురు; యాగంబులు సేయుదురు. వంశాభివృద్ధిగలవాఁడు పుణ్యాత్ముఁడు; సకలైశ్వర్యములను బడయు నరోత్తముఁడు; వార్ధకమునందు సుఖింప నవకాశముఁగలవాఁడు; తనకును దనపితృదేవతలకును మోక్షపదవి లభింపఁ నవకాశము కలిగించువాఁడు. వంశాభివృద్ధి లేని హైందవుఁడు ఇహమందు సుఖముల నొందజాలఁడనియు బరమందు ఘోరనరకములఁ జిక్కుకొను నరాధముఁడనియు, పాపాత్ముఁడనియు హిందువుల దృఢవిశ్వాసము; ధర్మశాస్త్రవేత్తల ఘనాభిప్రాయము; హిందూధర్మముయొక్క అమూల్యసారము.

వంశాభివృద్ధికి మూలము పుత్రసంతానము. నందనుఁ డుదయించి తలిదండ్రులను వార్ధకమునందు బోషించి వారు గతించినపిమ్మట ఉత్తరకర్మ లాచరించి "పుత్" అను నరకమునుండి రక్షించును గావున నాతనికి పుత్రయని సార్థకనామము కలిగెను. ప్రతిహైందవుఁడును, గుణవతులును, సౌందర్యవతులును నగు పుత్రికలను బడసి వారిని సాలంకృత కన్యాదానముచేసి, తనపితృదేవతలకుఁ బుణ్యలోకములు కలిగించి, వారియాశీర్వచనము నొందఁగోరును. వంశాభివృద్ధికై సుపుత్రులను, పుత్రికలను బడయుట ప్రధానము. ఇదియే సుసంతానము.

సుసంతానమును బడయుటకై దంపతులు అన్యోన్యానురాగములతో ప్రకాశించు టావశ్యకము, ఈగ్రంథమునం దనేక సందర్భములందీ అనుకూలదాంపత్య మెట్లువర్తించినచో గల్గునో కొంతవరకు వివరింపఁబడియున్నది. మత్కృతంబైన "ఐశ్వర్యము" నం దీవిషయము విశేషముగా జర్చింపఁబడియున్నది. అనుకూలదాంపత్యమును దంపతులు సతతము కోరుదురు. వారికి సామ్రాజ్యాధిపత్యము వహించియుండు చక్రవర్తికన్న ఎక్కువసౌఖ్యముల నిచ్చునది అనుకూలదాంపత్యము.



దంపతులు సుసంతానమును బడయుటకై హిందూధర్మమునం దనేక నియమములు తెలుపఁబడియున్నవి. ఈనియమముల నాయుర్వేదము ధృవపఱచుచున్నది. వీనిని (1) సంభోగనియమములనియు (2) గర్భిణుల వర్తననియు రెండుతెఱఁగులుగా విభజింపనగును.

### సంభోగనియమములు.

1 పూర్ణమైన శరీరాభివృద్ధినొందిన స్త్రీపురుషులే సంభోగించుట కర్హులు. వీరే, దార్ఢ్యవంతమైన సుసంతతిని బడయుచు, నీరోగులై, దీర్ఘాయువు నొందగలరు. సర్వావయవాభివృద్ధియు, తేజోబలమును గల్గియుండి, వీరు సంభోగజనితమైన బలహీనతను దృఢీకరింపగలరు. ఆధునికహిందూయువజనులు యుక్తమగు శరీరాభివృద్ధినొందుటకుఁ బూర్వమే సంభోగించు నాచారము కలవారై యుండుటవలనను, నిరంతరము శృంగారరసగ్రంథములను జదువుచు, శృంగారమును ప్రదర్శించుచు జారత్వము నభివృద్ధిచేయుచుండు నాటకశాలల కేగుచుండుట వలనను, అకాలమోహబుద్ధి కలవారై దీర్ఘాయుశ్శూన్యులగుచుండుట ప్రత్యక్షనిదర్శనమై యున్నది. పూర్వకాలమందు హిందువులు బ్రహ్మచర్యాశ్రమమాచరించుచు, తమగురువుయొక్క ఆశ్రమమందుండి ముప్పదివత్సరముల ప్రాయమువచ్చువఱకును నారీరత్నముల దర్శనస్పర్శనాదులు లేకయు, కుటిలకేశులు ప్రపంచమునందు నిర్మింపఁబడుటకు హేతువెద్దియో పరికింప వాంఛలేనివారైయుండియు, చిత్తజవికారమెఱుంగకయు, సత్ప్రవర్తనకులై దీర్ఘాయువుతో విలసిల్లుచుండిరి. వారంతపర్యంతమును బ్రహ్మచర్యాశ్రమ మాచరించుచు, దేవగురుపితృభక్తులతో ప్రకాశించుచు, గురువాజ్ఞఁగైకొని పరిణయము గావించుకొని గృహస్థాశ్రమమును స్వీకరించుచుండిరి. స్త్రీలుకూడ పూర్ణమైన శరీరబింకముగల ప్రాయముగల్గువఱకును పురుషసంపర్కము

లేనివారై వజ్రములవంటి సంతతిని బడయుచు, దీర్ఘాయువు నొందుచుండిరి. ఇక్కాలంబున నాగరకతాభివృద్ధి, పురుషుల ఆశ్రమములను ధ్వంసము గావించినది; వారి కకాలమోహబుద్ధు నంకురింపఁజేసి అకాలమృత్యువునకు బలివెట్టుచున్నది; కామినీరత్నముల పాతివ్రత్యమును భగ్నము గావించుచున్నది; వారి కతిబాల్యమందే సంభోగమందు వాంఛ గుదుర్చుచు, కుసుమాదిరోగములకు వారిని లోబరచుచుఁ దుష్టసంతతికి మూలమై, వారిని అల్పాయుప్రాంతమున కీడ్చుకొనిపోవుచున్నది.

2 శరీరారోగ్యముతోఁ దీపించుచుండువారే సంభోగింపనర్హులు. స్త్రీ పురుషు లిర్వురు నారోగ్యవంతులైయుండు కాలమందే కలియనగును. జ్వరము, తలనొప్పి, వికారము మొదలగు వ్యాధులఁ జిక్కినపుడు సంభోగించువారు "దోషగుణము" నకు లోబడి ఆయుర్దాయమును గోల్పోవుదురు. మరియు స్త్రీ పురుషు లిర్వురును సద్వర్తనాపరులై శోణితముయొక్క శుచిత్వము నశుభ్రపఱచు అంటుజాడ్యములకును, దుష్టసంతతికిని మూలమైన జారత్వమునకు లొంగకుండుట ప్రధానము.

3. యుక్తమగు తిథి, వార, నక్షత్రాదిసమయములందే హిందూదంపతులు సంభోగింపనగును. తిథులలో విదియ, తదియ, పంచమి, సప్తమి, త్రయోదశులు ప్రశస్తములు. వారములలో సోమ, బుధ, గురు, శుక్రవారములు యుక్తమైనవి. నక్షత్రములలో శ్ర. రో. హ. అనూ. స్వా. రే. మూ. ఉ. ఉషా. ఉభాలు ప్రశస్తములు. పుష్య. ధనిష్ట. మృ. అశ్విని. చిత్ర. పునర్వసులు సామాన్యములు. ఇతరనక్షత్రము లధమములు. మరియు పుణ్య, పర్వ, పితృకార్య, జాతాశౌచ మృతాశౌచదినములు వర్జనీయములు. ఈశాస్త్రోక్తమైన ముహూ



ర్తకాలములందు సంభోగించినయెడల దీర్ఘాయువు రక్షింపఁబడి సుసంతానము కలుగునని జ్యోతిషశాస్త్ర మంగీకరించుచున్నది. ఈగ్రహబలయుతమైన సమయములందు సంభోగించునపుడు సంతానబీజములు గ్రహములయొక్క శక్తుల నాకర్షించుట (45 పుట చూడుడు) వలన దార్ఢ్యవంతమై ప్రకాశమానమై కుశాగ్రబుద్ధిగల సుసంతానము కలుగును. ఇట్టిసమయములందు సంభోగించు దంపతులు బలహీనులై గుణహీనులైనను బలవంతులై సుగుణసంపదలతో విరాజిల్లు సుసంతతిని బడసి దీర్ఘాయువు నొందుదురు. సత్యసంధుడును, ధర్మప్రతిష్ఠాపనాసక్తుండును, అద్భుతపరిజ్ఞానధియు, భక్తాగ్రేసరుండును నగు ప్రహ్లాదునివంటి పుణ్యమూర్తి హిరణ్యకశ్యపునివంటి క్రూరరాక్షసునికి నందనుండై యుద్భవించుటకుఁ గారణములలో నొకటి, గ్రహబలము ననుసరించినసమయములందు జరిగిన సంభోగమువలనని తేటపడుచున్నది. గ్రహబలములేని సమయములందు సంభోగించుటవలన సంతానబీజములయొక్క ప్రశస్తములయిన శక్తులను గ్రహము లాకర్షించును. (44వ పుటచూడుడు.) అందువలన సౌందర్యవంతులకుఁ గురూపులును, గుణవంతులకు గుణహీనులును, బలపరాక్రమశాలులకు ధైర్యస్థైర్యపరాక్రమవిహీనులును, ఉదయించుటకు గారణమగుచున్నది. ఈకాలపు హిందువులు నాగరకతాదోషమువలన నయుక్తకాలములందు సంభోగించుచు జారులు, చోరులు, త్రాగుబోతులు, క్రూరులు, మూగలు, అంధులు, మున్నగు దుష్టసంతతిని బడయుచు, అల్పాయువు నొందుచున్నారు. దీర్ఘాయుస్సుసంతానములఁ గోరు హైందవులు, యుక్తమైన తిథి, వార, నక్షత్రాదిసమయములందే సంభోగించుట కర్తవ్యము.

4 స్త్రీ, పురుషులు సంభోగించుటకుఁ బ్రశస్తమై, శాస్త్రోక్తమై ఆయుర్దాయమునకు భంగము కల్గింపనికాలము రాత్రిపూటయని వైద్య ధర్మశాస్త్రములు తెల్పుచున్నవి. రాత్రిపూట మానవులు దేహపరి

శ్రమనొందక విశ్రాంతినొందుదురు. రవియొక్క ప్రకాశవంతమైన కిరణములకు మారుగా రాత్రివేళ చలువలజేయు మనోహరమైన కాంతి సోకుచుండుటవలన శరీరము శీతలత్వముచే నావృతమైయుండు. రక్తమందువలన, సాధారణగమనిక కలదై యుండును. అట్టికాలమందు సంభోగించు స్త్రీపురుషుల శరీరములందలి రక్తము, మితమగు పరిమాణమే వ్యయపడును. వారికిందువలన విశేషబలహీనత కలుగదు. దీర్ఘాయుస్సుసంతానములు లభించును. పూర్వకాలపు హిందువులు రాత్రిపూటయందు మాత్రమే సంభోగించుచు దీర్ఘాయువుతోఁ గలకాలలాడుచుండిరి. ప్రాచీనకాలమునుండియు "గర్భాదాన" శుభకార్యమునకు ముహూర్తము రాత్రిపూటయే, అయియున్నది. ఆధునికహిందువులు పెక్కండ్రు పాశ్చాత్యవ్యామోహమువలన దమసతులను వెంటత్రిప్పుకొనుటవలనను దదితరకారణములవలనను పగటిపూటలందుఁ జిత్తజవికారులై, సంభోగించుచు, దీర్ఘాయుశ్శూన్యులగుచున్నారు. పగటిపూట మానవుడు విహరించుచు, దేహపరిశ్రమ నొందుకాలము. భారతీయులు సూర్యరశ్మికి లోఁబడియుండు సమయము. అందువలన పగటికాలమున భరతవర్ష స్త్రీ, పురుషుల శరీరములందలి రక్త మతిచురుకుగా ప్రవహించుచుండుటవలన నది క్రాగుచున్న పాత్రయందలి చమురువుబోలియుండు. ఇట్టి స్థితిలో స్త్రీ పురుషులు కూడినచో వఱదకాలములో నదియొక్క గట్టుతెగిన ప్రదేశమునుండి, విశేషజలము వ్యర్థమైపోవు చందంబున, వారి శరీరములనుండి విశేషపరిమాణమైన శోణితము వ్యయపడును. మరియు సూర్యుఁడు ప్రసరించుచుండుకాలమునందు రక్తము శుక్లముగా మారునపు డది భానుతేజస్సువలన జలముక్రిందమారునని వైద్యశేఖరులు వివరించుదురు. శరీర మట్టియెడ క్రమముగా లావణ్యాదార్ఢ్యములను గోల్పోవును. ఈకాలమందు పాలినదేహము, నీరసము, అగ్నిమాంద్యము, మున్నగు వికారములకు లోఁబడియుండు స్త్రీ పురుషుల క్షితిస్థితి పగటిపూట సంభోగమువలననే గల్గుచున్నదని ఆయుర్వేద శిఖామణుల అభిప్రాయము. అట్టి స్త్రీ, పురుషులను సోమరితనము దారిద్ర్యము, దుష్టసంతానము మొదలగునవి పీడించును. వారికిఁ బుణ్యనాశనమై, నరకప్రాప్తి కలుగునని పురాణములు తెల్పుచున్నవి. తొల్లి, కశ్యపప్రజాపతియొక్క భార్యయైన దితి, పగలనికాని, రాత్రియనికాని, కాలనియమములులేక సంభోగించుటవలన దైత్యు లుదయించిరి. ఇక్కాలమున ద్విజులీనియమము నలక్ష్యము చేయుచున్నందున బ్రాహ్మణుల కన్నోదకములు లేనిస్థితులు కల్గుచున్నవి. కావున హిందూయువకులును, తోయజాక్షులును సంభోగించుటకుఁ బ్రశస్తమైన కాలము రాత్రిపూటయై యున్నది.



5. ఆకలిబాధతోనున్నపుడు యుక్తముగా భుజింపకఁ బూర్వము సంభోగించుటవలన దీర్ఘాయువు నశించును. దేహమందు జఠరము ఉగ్రతతో బ్రకాశించు నిట్టిసమయమందు సంభోగించినయెడల రక్తక్షయము కల్గును. సకలేంద్రియములును వికలభావము నొందును. విశేషదౌర్బల్య మంకురించును. సోమరితనము, దారిద్ర్యము, పట్టుబడును. దీర్ఘాయువు దగ్ధమగును. కావున భోజనానంతరమే సంభోగింపవలెను.

6. భోజనానంతరము వెంటనే సంభోగించుట అశాస్త్రీయము; అల్పాయుర్దాయమునకుఁ గారణము. భోజనానంతరము $1\frac{1}{2}$ గంటలవఱకును జీర్ణకోశమందలి యంత్రములు పనికలిగినవైయుండును. అంతపర్యంతము నాహారము జీర్ణము కానేరదు. ఘనమగు భోజనపదార్థములను గాని మాంసాదులనుగాని భుజించువారికి 2 గంటలవఱకును నాహారము జీర్ణింపదని వైద్యశాస్త్రము తెల్పుచున్నది. ఈకాలములోగా సంభోగించు స్త్రీ పురుషుల శరీరములందలి జీర్ణకోశములు చెడిపోవును. వారికజీర్ణరోగములు కల్గును. ఆయుర్దాయము నాశనమగును.

7. అర్ధరాత్రసమయంబున సంభోగించుట, అశాస్త్రీయము. అట్టి సమయమందు సంభోగించుటవలన దుష్టసంతానము కల్గునని ఉపనిషత్తులును, జ్యోతిశ్శాస్త్రమును వివరించుచున్నవి.

8. సూర్యోదయమగుటకుఁబూర్వము సంభోగించుటవలన దీర్ఘాయురైశ్వర్యంబులు చెడును. ఈసమయమందు భారతీయులశరీరము లతిశాంతముగానుండి, రవియొక్క ఉగ్రత నెదుర్కొనుటకై నిర్మింపఁబడిన నరుణోదయస్నానమునకై నిరీక్షించుచుండు నీసమయము, మలవిసర్జన మొనరించుటకును, దంతములను శుభ్రపఱచుటకును నేర్పడిన కాలము; సేద్యగాండ్రకుఁ బొలములకుఁబోవుట కేర్పడిన తరుణము; సర్వజనులకును మేల్కాంచుటకు విధింపఁబడిన నిముసము. మలవిసర్జన మొనరింపక బూర్వము సంభోగించుటవలన ననారోగ్యము వాటిల్లు. నిద్రనుండి మేల్కాంచినతోడనే దుర్గంధయుతమైన నోటితోఁ గూడి యుండుటవలన నాయుర్దాయమునకుఁ జేటొదవు. ఈకాలమందు సంభోగించువారికి దౌర్బల్య మంకురించి దారిద్ర్యము సంభవించును. శరీర మరుణోదయస్నానమువలన నూతనబలముతో విరాజిల్లుటకు మారుగా నరుణోదయకాల సంభోగమువలన బలహీనతనొందియుండును. ఇది దీర్ఘాయువును జెఱచును.

9. సంభోగము మితముగా నుండవలెను. అమితసంభోగము దీర్ఘాయువును జెఱచును; దుష్టసంతానమునకుఁ గారణమగును. ఈకాలమున స్త్రీ, పురుషులు అమితసంభోగము చేయుచుండుటవలన వారల్పాయువునకుఁ జిక్కుచున్నారు.

10. హిందూదంపతులు సంభోగించుటకు యుక్తమైన కాలము రాత్రిపూట, భోజనానంతరము రెండుగంటలు గడచినపిమ్మట 11 గంటలవేళ ప్రశస్తమని వైద్యధర్మశాస్త్రములు తెల్పుచున్నవి. మదనకళాశాస్త్ర మీవిషయమును ధృవపఱచుచున్నది.



11. సంభోగించుకాలములందు దంపతు లుత్సాహవంతులై, సుబుద్ధులుకలవారై యున్నచో, సుసంతానము కల్గును. ఈహేతువుచే వారు శయ్యాగృహమందు మంచిగంధము, పన్నీరు, తాంబూలము మున్నగు సుగంధద్రవ్యముల నుపయోగింపవలెను. శయ్యాగృహము నుత్సాహదాయకములగు పటములతో శృంగారింతురు. ఈశ్వరధ్యానము చేయుటావశ్యకము. ధైర్యమైన విషయములందు మనస్సు నిలుపుట విధి. శయ్య శుచిత్వముతో నలరారుట కర్తవ్యము. జారత్వపు విషయములను దలంపరాదు. సత్యము, ధర్మము మొదలైన సుగుణములను స్మరణకు దెచ్చుకొనుచు, కపట, క్రౌర్యములవంటి విషయముల నాకర్ణింపరాదు. విచారగ్రస్తులైనసమయములందును, దుఃఖించు తావులందును, అశుభకరమైన ప్రదేశములందును సంభోగించినచో దుష్టసంతానము కలుగునని శాస్త్ర మెఱింగించుచున్నది.

### 2. గర్భిణులవర్తనము.

గర్భిణులవర్తనము, గర్భిణుల నడవడికయనియు, ఇతరులు వీరి నాదరించు విధములనియు రెండువిధములుగా బరీక్షింపనగును.

గర్భిణులనడవడిక:—ఇది భోజనము, నిద్ర, ఇతరకృత్యములు, అని మూఁడురీతులుగా విభజింపవచ్చును.

1. భోజనము:—భోజనము మితముగా నుండవలెను. 5 వ మాసాంతరము మొదలుకొని భోజనమందు నావుపెరుగు నుపయోగించుటయు, రాత్రిభోజనమందు క్షీర ముపయోగించుటయు విధి యని వైద్యశేఖరులు వక్కాణింతురు. గర్భిణులు, తమకు వాంఛగల్గు భోజన

పదార్థములను స్వీకరించినచో గర్భమందలి శిశువు తేజోబలములతో వృద్ధినొందుచు, జన్మించినపిమ్మట ఆరోగ్యముతో దీపించును.

2. నిద్ర:—వీరు యుక్తకాలములందే నిద్రించుట విధి. భోజనానంతరము 2 గంటలు గడచువఱకును నిద్రింపరాదు. పగలు నిద్రించుట అనారోగ్యకరము; దుష్టసంతతిని బడయుటకు మూలము. ఏలనన, పగలు నిద్రించువారికి కఫము వృద్ధినొందునని సుశ్రుతాచార్యుఁడు "శరీరభాగ" మందు వివరించె. గర్భిణులు పగలు నిద్రించుచో శిశువు వాతరోగములఁ జిక్కునని ఆయుర్వేదవిద్వాంసుల అభిప్రాయము. గ్రహణకాలమందు గర్భిణులు శయనించుట యావశ్యకమని ధర్మము తెల్పుచున్నది.

3. ఇతరకృత్యములు:—వీరెల్లపుడు నుత్సాహదాయకములగు శుభవార్తలను వినుచుండవలెను. (133 పుట చూడుడు.) వీరు దయాధర్మసత్యాదులతో మెఱయుచు సువస్తువులను వీక్షించుట విధి. జెగడములాడుటయు, బిగ్గరగా నార్చుటయు, విశేషప్రయాసతోఁగూడిన పనులు చేయుటయు, ఔన్నత్యముగల ప్రదేశములపై కెక్కుటయు, తడిబట్ట ధరించుటయు, తేమగలతావులం దాసీనులగుటయు వర్జనీయములు. వీరు 5 వ మాసాంతరమునుండియు సంభోగించుట శ్రేష్ఠము కాదు. అట్లు సంభోగించుటవలన గర్భమందుండు శిశువు తనకు బాధ గల్గించుచున్న జననీజనకులను దూషించును. పెద్దలగువారి నాశిశువు దూషించుటవలన గర్భములోనున్నపుడే శిశువునకు నల్పాయువు సంప్రాప్తమగును. ఇంతియగాక, గర్భమందలి ఆడశిశువున్నయెడల బురుషుఁడు పుత్రికాగమనదోష మనుభవించునని ధర్మశాస్త్రకోవిదు లెఱింగింతురు. 5 వ మాసమునాటనుండియు గర్భిణుల కిట్టి అవకాశము



కలుగకుండుటకై, ఆమెను బుట్టింటికి బంపుచుండుట ప్రాచీనాచారమైయున్నదని ధర్మశాస్త్రవేత్తలు వచింతురు.

ఇతరులు గర్భిణుల నాదరించువిధము:—గర్భిణులున్న గృహమునందు వారి బంధుమిత్రులు వారి యుత్సాహమును గాపాడవలెను. వారికి దుఃఖవార్తలను దెల్పుట నీచకార్యము. గర్భిణులున్న గృహమందు శోకింపరాదు. వారి యారోగ్యమును రక్షించునట్లితరులు వర్తించుట శ్రేష్ఠము. భర్తయు, ఆతని బంధువులును గర్భిణిని నతిగౌరవముతో నాదరించుట ప్రధానము.

### స్త్రీ పురుష సంతానము కల్గువిధములు.

ఉపనిషత్తులందు దంపతు లెట్లువర్తించినయెడల స్త్రీ పురుషులుదయింతురో వివరింపఁబడియున్నది. ఇచ్చట తత్సారమాత్రమే వెల్లడించుచుంటిమి.

స్త్రీలు ఋతుమతులైన 4వ దినమున శుద్ధిస్నానమగును. ఈనాల్గవదినము మొదలుకొని సరిరాత్రులందు, అనగా 4, 6, 8, 10, 12, 14, 16 రాత్రులందుమాత్రమే సంభోగించుటవలన బురుషసంతానము కల్గును. ఆదినములందు స్త్రీలకంటె బురుషులు విశేషాహారమును భుజింపవలెను. 4 వ దినమున గర్భముదాల్చు స్త్రీ, దుష్టుఁడగు పురుషసంతతిని బడయుననియు, 6 వ దినమున సుపుత్రుని గనుననియు, 8 వ దినమున ఆయుర్భాగ్యములతో నలరారునందనుని బడయుననియు, 10 వ దినమున గర్భము దాల్చునేని సదాచారసంపన్నుఁడగు తనయుని, 12 వ దినమున చిరకాలజీవుఁడగు సుతుని, 14 వ దినమున మంచికుమారుని 16 వ దినమున సామ్రాజ్యాధిపతియగు కుమారుని గనుననియు, ఉపనిషత్తులు ఎఱింగించుచున్నవి.

ఋతుస్నానమైనపిమ్మట బేసి రాత్రులందు, అనగా 5, 7, 9, 11, 13, 15, రాత్రులందుమాత్రమే సంభోగించుటవలన గర్భముధరించు కాంతలకు స్త్రీసంతానము కలుగును. ఈదినములలోఁ బురుషులకంటె స్త్రీలు విశేషాహారము స్వీకరింపవలెను. 5 వ దినమున గర్భముధరించు నారీరత్నము, సత్పుత్రికను, బడయును. 7, 9 దినములందు గర్భము దాల్చు వనితకు సామాన్యురాలగు కన్యక గల్గును. 11 వ దినమున జరిగినచో, తేజోవతియైనపుత్రిక పుట్టును. 13 వ దినమున గర్భమునుధరించు కోమలి, జారకామిని బడయును. 15 వ నాఁడు గర్భముదాల్చు వారిజాక్షులకు సుగుణసంపదలతోవిలసిల్లు కుమార్తెలు జనింతురు. పురుషుడు ఈఋతుకాలములందే సంభోగించుటవలన బ్రహ్మచర్యమాచరించువానితోఁ దుల్యుడగును. వీని ననుసరించి వర్తించుదంపతులు దీర్ఘాయువు నొందుదురు.

ప్రాచీనహిందూధర్మము, ఇట్టినియమములను నిర్మించియున్నది. చిరకాలమునుండియు భారతీయులు గ్రహచలనము ననుసరించి సమస్తశుభకార్యములను, ఒనరించుచు, సుఫలితముల నొందుచుండిరి. వారందుచే గ్రహములవలన నుచితార్థముగా సేవజేయించికొనుచుండు నట్లు తెల్లమగుచున్నదిగాదే! ప్రాచీనహిందూధర్మోత్కృష్టతకు నింతకంటె నిదర్శన మేమి కావలెను?

### గ్రంథోపసంహారము.

ఆధునికవైద్యశాస్త్రజ్ఞులకు సహితము తెలియని పరమౌషధముల కుపయుక్తములగు మూలికలకు నెలవై, భరతవర్షమును పావనముచేయు పుణ్యతీర్థములకుఁ గల్పతరువై, ప్రాచీనహిందూధర్మనిర్మాతలగు ఋషిశ్రేష్ఠులకు నివాసమై, వసుధపై విలసిల్లు పర్వతశ్రేణులలో నౌన్నత్యము కలదై, యొప్పారు హిమవత్పర్వతరాజము, తనకుఁ



గిరీటము వలె గౌరీశంకర్ (Mount Everest) శిఖరముతోఁ దేజరిల్లుచు సర్వకాలములందును, సర్వదేశీయులకును, ధరణిపై వర్ధిల్లు మానవ ధర్మములలో హిందూధర్మము, సర్వతౌన్నత్యసామ్రాజ్యమును వహించిన తనవలెనే ధర్మసామ్రాజ్యపదము నొందిన దని విశదపఱచుదాని వలె భరతవర్షముయొక్క ఉత్తరదిశ కలంకారమై యున్నది. అత్యంత ఘనతతో నలరు హిందూధర్మము నాచరించు భారతీయులు, ఆయురారోగ్యములతోఁ దులతూగుచు, ప్రపంచసుఖములను బూర్ణముగా ననుభవింపగల్గుచు నిహపరములందు నౌన్నత్యపదవి నొందగలరని భారతీయుల కెఱింగించుటకై సృష్టికర్తచే హిమవత్పర్వతరాజము నిర్మింపఁబడినట్లు గోచరించుచున్నది.

ఈగ్రంథమున పుటపుటయందును వివరింపఁబడి, సర్వప్రాణులకును, జనులకును ప్రీతికరమై, అత్యవసరమై చక్రవర్తులకు సహితము అమూల్యమై, ప్రాచీనహిందువులకు సులభసాధ్యమై, షష్టిపూర్త్యుత్సవమనుభవించుట కావశ్యకమైన దీర్ఘాయువును వర్తమానకాలపు హిందూసంఘమునకుఁ బ్రసాదించుచు మానవజన్మముయొక్క సార్థక్యమును విశదపఱచునది హిందూధర్మపునరుజ్జీవనము. భారతీయులకు సుఖము సమకూర్చునది ప్రాచీనహిందూధర్మాచరణము. దేశీయుల కైశ్వర్యసుసంతానముల నొసఁగి వారికి సర్వకార్యములందును విజయము కల్గించునది హిందూధర్మపునరుజ్జీవనము. రవి చంద్ర నక్షత్రాది జ్యోతులు, అంబరంబున నెందాక ప్రకాశించునో, వారణాసినగరంబున విశ్వేశ్వరుండును, రామేశ్వరక్షేత్రమున రామలింగేశ్వరుఁడును, పంఢరపురమున విఠలేశ్వరుఁడును, శ్రీరంగమున రంగనాథస్వామియు, రాజమహేంద్రవరమున మార్కండేయుఁడును, వాసిష్ఠానదీతీరంబున మెఱయుచున్న మదీయజన్మస్థానమైన నడుపూడిగ్రామముయొక్క వైభవ

మునకుం జిరకాలమునుండియుఁ బ్రధానహేతువైన శ్రీ సుబ్రహ్మణ్యే శ్వరస్వామియు నెందాక సుస్థిరులై వర్ధిల్లుచుందురో, అంతదనుక పూర్వాచారపరాయణుల కమృతప్రాయమై విలసిల్లు మత్కృతంబైన నీహిందూధర్మపునరుజ్జీవనము, వెలయుఁగాక. సకలపుణ్యపురుషులకును, సన్మార్గవర్తులకును, ప్రాచీనహిందూధర్మాచరణనిరతులగు వేదశాస్త్ర శ్రౌతాయుర్వేదపండితావళికిని, గోబ్రాహ్మణులకును, హిందూసాంప్ర దాయము నుద్ధరించుచున్న వైశ్యులకును, శ్రీమత్పీఠికాపుర "మహా రాజేంద్ర" చంద్రునకును, హిందూధర్మనిర్మాతల యాశీర్వచనప్రభా వమువలనను, శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి కృపవలనను శుభం బును దీర్ఘాయువును గల్గుఁగాక !

ఇది శ్రీమదాపస్తంబసూత్రులును, భారద్వాజసగోత్రులును, కన్యాదాన సప్తకక్రియాకలాంబునం బవిత్రహృదయులు నైన శ్రీలక్ష్మీ సోమిదేవి లక్ష్మీనారాయణులకుఁ బుత్రుండును, వేదశాస్త్రశ్రౌత విద్యావిశారదులై, వైదికాచార్యులునై ప్రసిద్ధిగాంచిన శ్రీమత్పిసపాటి వేంకటరామదీక్షితుల దౌహిత్రుండును నగు కళా వేంకటరామయా ఖ్యునిచే విరచితంబైన హిందూధర్మపునరుజ్జీవన మనునపూర్వగ్రం థంబునందుఁ బ్రథమసంపుటము.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాల:—రాజమండ్రి. 1922

